# అంతరంగ చిత్రాలు

( కథల సంపుటి )





చిల్లర భవానీదేవి

ANTHARANGA CHITRALU
Short Stories
by Smt. Chillara Bhavani Devi

March 1993

ముఖచిత్రం : బాలి

తెలుగు విశ్వవిద్యాలయంవారి
ఆర్థిక సహాయంతో ప్రచురింపబడినది.

రు. 25/-

ప్రతులకు :

శ్రీమతి చిల్లర భవానీ దేవి
ఇంటి నెం. 1-2-337
ఫ్లాట్ నెం. 102, గగన్‌మహల్ ఎపార్టుమెంట్స్
దోమల్‌గూడ, హైదరాబాద్ - 500 029

సోల్ డిస్ట్రిబ్యూటర్స్ :

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
"విజ్ఞాన్ భవన్"
4-1-435, బ్యాంక్‌స్ట్రీట్
హైదరాబాద్ - 500 001

ముద్రణ : స్పందన ప్రింటర్స్, మచిలీపట్నం

# కథల నేపథ్యం

జీవితం గులాబీపూల తోటలా ఉందనుకుంటే ఎలా? పువ్వుల వెనుకగల ముళ్ళమాటేమిటి? ప్రపంచం రంగుటద్దంలా ఉందనుకుంటే ఎలా? దాని వెనుకగల నీలి నీడల మాటేమిటి?- అన్నది రచయిత్రి భవానీదేవి విచికిత్స.

ఈ సంపుటిలోని పదిహేను కథల్లో చీకటిలో పయనంచేసి వెలుగులోకి చేరుకొనేవీ వున్నాయి; వెలుగు జాడల్లోకి రాలేక చీకటిలోనే పరిసమాప్తి చెందేవీ వున్నాయి. జీవితం వెలుగునీడల పడుగు పేకగా, నిమ్నోన్నతాల పీఠ భూమిగా, యోగవియోగాల చిత్రహేలగా ఈ కథల్లో కాన వస్తుంది. ఒక కథ మనసులో ఖేదాన్ని రగుల్కొలిపితే, మరొకటి ఆమోదం చిలకరిస్తుంది. ఒకటి చిరునవ్వుకు దారి తీస్తే మరొకటి నిట్టూర్పుకు నెగడు వేస్తుంది. ఒకటి వడగాడ్పులా గూబ లదరగొడితే, మరొకటి మలయ పవనంలా సేదదీరుస్తుంది. ఇందులో మండుటెండలేగావు, చలువపందిళ్లు గూడా వున్నాయి.

తోటి మానవుల హింసాప్రవృత్తికి నిరసనగా వికలాంగుడైన ఓకు ర్రవాడు తీసుకున్న ప్రతిచర్యే - మారని

అంతర్యం. కులపిచ్చాల కట్టుబాట్లను కూలదోయడానికి ఒక ఛద్రమహిళ చేయవలసి వచ్చిన త్యాగమే - మానవత. దాగువడడానికి సహకరించక, కష్ట జీవనానికి పాల్పడితే అపహాస్యం చేసిన లోకుల క్రూర ప్రవృత్తికి నిరసనే-రాలిన మొగ్గ మనిషి మోటువాడల్లే కనిపించినా, మనసులో మానవతా పల్లికల పరిమళం గుభాళించినప్పుడు అతడి దరహాసం శరత్కాల శుభ్ర జ్యోత్స్నలా వుంటుందనడానికి నిదర్శనమే-నవ్వు. భార్యాభర్తలిద్దరూ ఉద్యోగులైనప్పుడు నగర జీవనంలో చిన్నపిల్లల దుస్థితికి వివరణే-పరిష్కారం. పరస్త్రీవ్యామోహంలో భార్యను నిర్లక్ష్యం చేసిన పురుష పుంగవుడు నేర్చుకున్న గుణపాఠమే—గ్రహణం విడిచింది. పిల్లల పెంపకంలో తగు జాగ్రత్త వహించకపోతే ఏర్పడే అనర్థాలకు దృష్టాంతమే - చేజారిన మణిపూస. ఎదుటి వారి త్యాగ ఫలితాన్ని చవిచూడగోరేవారు తమ స్వార్థం కొంత వదలుకోనక్కర లేదా అని నిలదీసి ప్రశ్నించే కథ - అంతరంగ చిత్రాలు. జీవిత పోరాటంలో ఓటమిని ఒప్పుకోకుండా పరిస్థితుల కెదురు నిలిచి గెలిచిన ఓ స్వయం సిద్ధ కథ అపరాజిత. నిజమైన ప్రేమకు భంగపాటు కలిగినా అది తాత్కాలికమేననడానికి ఉదాహరణ - ప్రేమంటే ఇదే ఇదే. అనాథ పిల్లలపట్ల నాగరిక సమాజం నెరపే నిష్ఠుర వర్తన - ఈ శిక్షలు ఎవరికి ? మూగవోయిన వీణ పులకించేదీ, పరవశించేదీ మళ్లీ పాట నేర్పినప్పుడే ననడానికి దాఖలా-వీణాపాణి....ఇలా సింహావలోకనం చేసి చూచుకున్నప్పుడు ఈ సంపుటిలోని కథలు ఎంతటి వైవిధ్యం సంతరించుకున్నాయో తెలుస్తుంది.

ఏదేది ఎలా వుండాలో అలా ఉండడం లేదు. ఎందువల్ల? అన్నది ఈ కథలన్నిటా అంతర్వాహినిగా ప్రవహించే ప్రశ్న. వ్యక్తికీ సంఘానికీ మధ్య, తల్లిదండ్రులకు బిడ్డలకూ మధ్య, భార్యా భర్తలకు మధ్య, కలవారికీ లేనివారికీ మధ్య, బలవంతులకు బలహీనులకు మధ్య ప్రస్తుతం నెలకొన్న అనుబంధాల్లో రచయిత్రికెన్నో లొసుగులు కనిపిస్తున్నాయి. ఈ అపశ్రుతులన్నీ మాసిపోయి ఆరోగ్యకరమైన, ఆనందప్రదమైన, ఆదర్శప్రాయమైన సమాజం ఒకటి ఉద్భవిస్తే ఎంత బాగుండునన్నది ఆమె ఆకాంక్ష. పుట్టినప్పటినుంచీ సాహిత్యం చేస్తున్న ఆలోచన కూడా అదే: 'ఎల్లలోకము లొక్కయిల్లై వర్ణ భేదము లెల్ల కల్లై, వేల లెరుగని ప్రేమ బంధము వేడుకలు కురియ, మతములన్నియు మాసిపోవును, జ్ఞానమొక్కటె నిలిచి వెలుగును....' బాగుంది. ఎంతో బాగుంది. కానీ ఎప్పుడు, ఎప్పుడు అనేదే ప్రశ్న. రచయిత్రి చిల్లర భవానీదేవిగారుకూడా ఆ పెద్దప్రశ్నలో తమ చిన్నగొంతుకను కలుపుతున్నారు. ఆ ధ్వనికి ప్రతిధ్వనులే ఈ కథలు.

దామల్ చెరువు
12-4-1993

మధురాంతకం రాజారాం

# చెల్లీ! ఇది నా చెలిమి పలుకు!

మంచి కథకు నిర్వచనం - చదివించేదా, కదిలించేదా, చకితపరచి అలరించేదా, ఉత్తేజం కలిగించి వుద్రేకపరచేదా అని ప్రశ్నించుకొంటారు రచయితలు, పాఠకులు, విమర్శకులు. వీటిల్లో ఏ ఒక్క లక్షణం ప్రస్ఫుటం చేసినా చాలు, కథ ప్రత్యేకంగా గుర్తింపు పొందుతుంది. దేశం, కాలం ప్రసక్తి లేకుండా తప్పకుండా పాఠకుల దృష్టిని ఆకర్షిస్తుంది. కాలక్షేపం కోసం పత్రికల్లో కథలు చదివే వారు, సాహిత్య విమర్శ, విశ్లేషణలతో పరిచయం లేనివారు కూడా పసవున్న కథను పసిగడతారు. "బాగుంది సుమా!" అని మెచ్చుకుని కమ్మనిదో తీపిదో ఒక రుచిని మనస్సులో మిగుల్చుకొంటారు.

ఇటువంటి అదృష్టానికి నోచుకొనే రచనలు, భవానీ దేవిగారి అంతరంగాన మెదలిన చిత్రాలు, కలం రూపు దిద్దిన జీవన శకలాలు. పదిహేను చిత్రాలనూ పరికించాక వీటిలో అంతస్సూత్రంగా కనుపించేది నిజాయితీ, చిత్త శుద్ధి : ఒకసారి చలంగారు అన్నారు నాతోటి - "నిజం అరుదై పోయింది. సత్యం బయటకు రావాలంటే భయపడు

తోంది - పదిపొరలు కప్పుకొని గానీ కనుపించడం లేదు!" అని. ఉన్నది వున్నట్లు, అనుకొన్నది అనుకొన్నట్లు చెప్ప డానికి రచయితకు నిజాయితీ కావాలి. సత్యమంటే ప్రేమ, గౌరవం ఉండాలి. తను వ్రాస్తున్నదానిలో తనకి కర్త్రీలేని విశ్వాసం వుండాలి. చమత్కారం, అతి తెలివి, అనవసర భేషజం లేకుండా చేసిన రచనలివి.

సాహిత్యానికి సామాజిక ప్రయోజనం వున్నదని చాటి చెప్పే వాక్చిత్రాలు యివి. 'చేతులు లేని' కుప్ప తన అవకరంతో ప్రజలను వినోదపరచలేక చాక్కా అంటించుకుని చనిపోయాడు-కులతత్వం ఎదిరించి ప్రాణం బలిపెట్టింది "మువ్వ" - ఆత్మాభిమానంతో పాలిష్‌రాము రైలు కిందపడి నలిగిపోయాడు - ఒంటరిగా పోరాటం సాగించిన తేజోమూర్తి సుమతి అత్తయ్య, చేయని దొంగ తనానికి పట్టుబడి పోయిన కిష్టుడు - వీరందరూ సమాజంలో ఏమూలో హింసలు పడుతూ నికృష్ట జీవితాలు గడుపు తున్నవారే ఇల్లాంటి ప్రాణులపట్ల రచయిత్రికి అపార మైన సానుభూతి. దగాపడిన వారంటే స్వచ్ఛమైన స్పందన లేనివారు యీ వాక్చిత్రాలు వ్రాయలేరు.

సందేశం, ప్రయోజనం లేని రచన యిందులో లేదు "నవ్వు" కథలో, పోకిరీవాడనుకొన్న ప్రకాష్ రక్తదానం చేసి, నిండు ప్రాణం కాపాడిన సంగతి తెలిసి కొన్న కన్నెపిల్ల భార్గవి ఆరాధనలో పడిన తీరు; నాటు వైద్యాలు, భస్మాలను నమ్ముకొని కన్నబిడ్డనే పోగొట్టు కోబోయిన తల్లికథ 'తొలిగిన చీకటి'; తన బాబు కోసం

వుద్యోగం మానేసి, మరిందరు బాబులు, పాపలకు ఆశ్రయ మిచ్చిన ఒక ఆధునిక వనిత "పరిష్కారం" కథ; ఆడపిల్ల బుద్ధిమంతురాలు, గారాబం ఎక్కువైన మగపిల్లవాడు భ్రష్టుడు అని చెప్పే 'చేజారిన మణిపూస' కథ – కను మరుగైన సవతి తండ్రి చచ్చిపోయాడనే అమాయకమైన భయంతో ఎదురుచూచి, "నాన్న" అంటే స్కూటరు మీద ఒడికి దింపడం వంటి భౌతికమైన అవసరాలు తీర్చేవాడు అని బాబు తెలిసికొన్న కథ 'ఆలంబన' – వీటిల్లో ప్రతి ఒక్కటీ భావగర్భితమైనవే.

కొసమెరుపుతో అవసరమైన ప్రగతి సందేశంతో నన్ను ఆకర్షించిన కథలు 'గ్రహణం విడిచింది' 'అంతరంగ చిత్రాలు'. నీతి విషయంలో స్త్రీ పురుషుల మధ్య ఉన్న ద్వంద్వ ప్రమాణాలను ఎత్తిచూపి ఒక సంసారంలోని భర్తకు కనువిప్పు కలిగించిన కథ 'గ్రహణం విడిచింది' రామ్మూర్తికి నిజభార్యపై మక్కువ తగ్గి, హొయలు వలక బోసిన మరొక మగువపై మోజు హెచ్చింది. " ఆమె " అలవోకగా అంటుంది తన భర్తను గురించి' తన కిష్టమైన ఆడవాళ్ళతో తను తిరుగుతున్నప్పుడు నాకు నచ్చిన మగవాళ్ళతో నేను ఆనందిస్తే తప్పా?.... ఈ మాటలే తన భార్య నోటివెంట వస్తే ? షాకై పోయాడు రామ్మూర్తి. శరవేగాన యింటికి చేరుకున్నాడు. వివేకం ఉదయించింది. చల్లని చందమామ సంసారానికి పట్టిన గ్రహణం విడిచింది.

సంపన్నుడైన మిత్రుడు విశ్వనాథం మనస్ఫూర్తిగా ఆతిథ్యమిచ్చి, అరమరికలు లేకుండా, కట్నం తీసు కోకుండానే తన కొడుక్కి, జానకిరామయ్య కూతురిని చేసు కుంటానన్నప్పుడు జానకిరామయ్య గారిలోనే తేలి

పోయాడు. కానీ కొడుకు పెళ్ళి ప్రసక్తి వచ్చేసరికి "వాసు చదువుకి చేసిన అప్పులు ఎల్లా తీర్చాలి" అనే ఆలోచన మొదలు పెట్టాడు. 'తన నీడ తనకే పెరుగుజ్జులా కనుపిస్తోంది. అంతరంగ చిత్రం స్పష్టంగా లేదు. మనసు అద్దం మసకబారినట్లుంది' అని ముగించారు రచయిత్రి. అది ఆశ కాదు వాస్తవం, మానవ మనస్తత్వం, బలహీనత. విశ్వనాథం ఔదార్యం ముందు, తేలిపోయిన 'తాటాకు బొమ్మతనం' వయస్సు మళ్ళిన మధ్య తరగతి కష్టజీవి, చిన్న సంతోషాల కోసం కూడా ముఖం వాచిపోయిన మామూలు సాదా మనిషి సానుభూతి కోసం దీనంగా చూస్తున్న భావం మనలో.

అక్కడక్కడ కొన్ని చమత్కార ప్రయోగాలు చేశారు. రచయిత్రి - "సోడా బుడ్డీ ఒక చావు కేక పెట్టింది'ట! "సూర్యుడు వాడి గోళ్ళు గుచ్చి కిటికీలోంచి నిద్ర లేపాడ"ట!

కళాకారిణుల కథలు రెండున్నాయి. సంగీతం, నాట్యం ప్రాణమనుకొన్న వారు వివాహంతో ఎలా సమన్వయపరచుకొంటారో విడమర్చి చెప్పారు.

కథకి ఒక చట్రం వుండాలి. అందులో చక్కగా బిగిసిన చిత్రంలాంటిది కథ. నడకలో వేగం, సంగీతంలో తాళంలాగ నిలవాలి. చెప్పవలసిన విశేషాలు అన్నీ వుండాలిగానీ, మితంగా, అవసరమైనంత పరిమాణంలోనే పొదుపుగా చేర్చాలి. అసలు కథలో 'కథత్వం' (అంటే అర్థమైంది కదూ!) కుతూహలం రేపి, ముందు ఏమౌతుందో

అనే చదివించేతనం అత్యవసరం. ఏ పాత్ర యొక్క దృక్కోణం నుంచి వ్రాస్తోంటే అదే చివరివరకు సాగాలి. రచయిత్రి కలుగచేసుకొని తానొక వ్యాఖ్యాతగా ప్రవేశిస్తే విషయంలో చిక్కదనం తగ్గుతుంది. ఆశ్చర్యకరమైన మలుపు, మనస్సుని గుంజే ఘట్టం - వీటిలో ఒక్కటైనా లేనిదే కథలో విశిష్టత లేదు.

— ఇటువంటి సిద్ధాంతపరమైన అభిప్రాయాలు భవానీదేవిగారితో నేను ప్రస్తావించాను. ఆమె నవ్వేసి "నాకు అవన్నీ ఏమీ తెలియవు, ఆలోచించలేదు. వ్రాయాలనిపించినప్పుడు వ్రాసేశాను" అన్నారు. 'నాలోని నాదాలు' 'గవేషణ' వంటి కవితా సంకలనాలు పదునుగా వదిలిన భవాని అంత అమాయకంగా నాకు తెలియదు అంటే, అది సహజవినయం అనాలి. "నీది స్వర్ణభారతం అని పొంగిపోకు. కుళ్ళు భారతం వుందని కళ్ళు తెరచి చూడు" అని తట్టిలేపే బాధ్యత గల రచయిత్రి భవాని.

"మధుర స్నేహదృశ్యాలకోసం, అణువణువు వెదకిన నాకెమేరా, వెలుగుచాలక వెలవెలా పోయింది. లెన్స్ రెప్పలు వాల్చి మూగబోయింది" అనే అతిలోతు వాస్తవాన్ని గుండెను పట్టివేసే ఆవేశంతో తన కవితలో బంధించిన యీ భావుకురాలికి విశిష్టమైన కీర్తి, కథకురాలిగా ఆత్మ సంతృప్తి కలగాలని ఆకాంక్షిస్తున్నాను.

హైదరాబాదు
8-5-1993

తురగా జానకీరాణి

# నీ రా జ న ం



మూర్తీభవించిన మానవతాముద్రతో
స్ఫూర్తినిచ్చిన సాహితీ తపస్వి
చివురించిన నా కలం బాల్యానికి
నడకలు నేర్పిన పరమ యశస్వి
మరపురాని మహా మనస్వి

**డా॥ కొత్తపాటి గంగాధరరావుగారి**

దివ్యస్మృతికి సమర్పిస్తున్న నీరాజనం :

చిల్లర భవానీదేవి

# మనసులో మాట

సున్నిత మనస్కులయిన రచయితలు సమాజ దృశ్యాలకు స్పందించకుండా ఉండలేరు. అందుకే సమాజం నేపథ్యంగా నిరంతరాయంగా ఎన్నో రచనలు పుడుతూనే ఉంటాయి. అందరు రచయితల్లాగే నేను కూడా రోగగ్రస్తమైన సంఘాన్ని స్పృశించి కథలద్వారా పాఠకుల్ని కదిలించే ప్రయత్నం చేశాను....చేస్తున్నాను. విద్యార్థిగా ఉన్నప్పుడు నేను వ్రాసిన తొలి కథకు లభించిన బహుమతే నన్ను రచయిత్రిగా మార్చింది. పెద్దల ప్రోత్సాహం ఆశీస్సులతో ముందుకు సాగిన నా రచనాకాశంలో అప్పుడప్పుడూ కథల మెరుపులు మెరుస్తూనే వున్నాయి.

మన చుట్టూ ఉన్న మనుషుల మనస్తత్వాలు, సమాజ సంఘటనలే నా కథలకు ఇతివృత్తాలు. మనిషి బాధామయగాథలకు కారణమైన స్వార్థాన్నీ, దాని వివిధ విశ్వరూపాలనూ కనిపెట్టి, పరివర్తన ప్రసాదించి, కళ్ళకి వెలుగునిచ్చి, బుద్ధికి పదును పెట్టే కథలు మరిన్ని రాయాలని ఆశపడ్తున్నాను.

ఈ మజిలీలో డా॥ కొట్టిపాటి వారి చల్లని మనసును స్మరించుకుంటూ పుస్తక ప్రచురణకు ఆర్థిక సహాయాన్నం దించిన తెలుగు విశ్వ విద్యాలయం వారికీ

ఈ కథలపై తమ అభిప్రాయాన్నందించి ప్రోత్స హించిన ప్రముఖ కథాశిల్పి శ్రీమధురాంతకం రాజారాం గారికీ, సోదరి శ్రీమతి తురగా జానకీరాణిగారికీ

ఈ కథలకు బహుమతులు, ప్రచురణల ద్వారా వెలుగిచ్చిన సంస్థల నిర్వాహకులకూ, పత్రికాధిపతులకూ

ఈ కథాచిత్రాలకు అందమైన ముఖచిత్రం తీర్చిన ప్రఖ్యాత చిత్రకారులు శ్రీ బాలిగారికి

ప్రత్యేక శ్రద్ధతో ప్రత్యక్షరం ముద్రించిన స్పందన ప్రింటర్స్ అధినేత, సోదరులు శ్రీ గుత్తికొండ సుబ్బారావుగారికీ

రచయితగా నా ప్రయాణంలో తోడుగా నిలచిన కుటుంబ సభ్యులకూ

నా ప్రత్యేక కృతజ్ఞతలు !

చిల్లర భవానీదేవి

# కథాక్రమం


| | | పుట |
|---|---|---|
| 1. | మారని అంతర్యం | 9 |
| 2. | మానవత | 15 |
| 3. | రాలిన మొగ్గ | 23 |
| 4. | నవ్వు | 33 |
| 5. | ప్రేమ | 45 |
| 6. | తొలగిన చీకటి | 51 |
| 7. | పరిష్కారం | 57 |
| 8. | గ్రహణం విడిచింది | 73 |
| 9. | చేజారిన మణిపూస | 83 |
| 10. | అంతరంగ చిత్రాలు | 93 |
| 11. | ఆలంబన | 101 |
| 12. | అపరాజిత | 103 |
| 13. | ప్రేమంటే ఇదే ఇదే | 128 |
| 14. | ఈ శిక్ష ఎవరికి ? | 142 |
| 15. | వీణాపాణి | 155 |
| 16. | మిథ్యా విలువలు | 170 |
| 17. | ప్రియబాంధవి | 183 |
| 18. | ఉషోదయం | 195 |

# మారని అంతర్యం

కొంచెం విస్తీర్ణం తక్కువగా ఉన్న ఆవరణకు తాటాకు దడి కట్టబడి ఉన్నది.

దడికి వేలాడదీసిన మైకులోంచి చౌకబారు మ్యూజిక్ వినిపిస్తున్నది. జనం ఒక్కొక్కరే పోగవుతున్నారు.

కానీ కుప్పుకు ఇదేమీ పట్టటం లేదు. పరధ్యానంగా ఆలోచిస్తూ శూన్యంలోకి చూస్తున్నాడు. ఆ అనంత విశ్వంలో దొరకని వస్తువును వెతుకుతున్నట్లున్నాయి అతని చూపులు.

'రా! ఇంకా ఎంత సేపు....జనం అంతా వచ్చేశారు' వీర్రాజు అరిచినట్లు పిలిచాడు.

కుప్పు చొక్కాకు మొహం రాసుకుని ముందుకు సాగాడు.

కుప్పుని చూడటంతో జనంలో ఈలలు చప్పట్లు మొదలయ్యాయి - "రండి బాబూ- రండి! చేతులు లేని

మనిషి .... కాళ్లతోనే అన్ని పనులు చేస్తాడు; చూడండి మీరు. కనీవినీ ఎరుగని వింతలు – ఒక్కటికొక్కటి ఏభయి పైసలు మాత్రమే, త్వరపడండి " మైకులో పాట ఆగిపోయి వీర్రాజు గొంతు తారాస్థాయిలో వినిపించింది.

జనం వస్తూనే ఉన్నారు – చుట్టూరా నిల్చున్న మనుష్యుల మధ్య వీర్రాజు పర్యవేక్షణలో సింహాలచేత జిక్కిన మేకపిల్లలా ఉన్నాడు కుప్పు.

కుప్పు మనసు కుతకుతలాడుతోంది. వీర్రాజును చేతయితే పట్టుకుని నమిలి మింగేయాలనిపిస్తోంది. కాని పట్టుకోడానికి చేతులు లేవే? నవ్వుకున్నాడు కుప్పు. అసలు చేతులే ఉంటే వీర్రాజు చేతుల్లో పడేవాడు కాదేమో !

చుట్టూ తనను వింతగా చూస్తున్న జనాన్ని చూస్తే ద్వేషం పదివేలరెట్లు పెరుగుతోంది. చేతులకు నోచుకోని తోటిమనిషిని జంతువును చూసినట్లు చూస్తున్నారు. వాడి ఆటలకు ఆనందిస్తున్నారు. కానీ వాడికీ మనసంటూ ఒకటుందనీ, అది ఎంత విలపిస్తుందో ఎవరికీ పట్టదు.

కుప్పు పుట్టగానే తల్లి 'చేతులులేని గుంటడు పుట్టాడు, ఏంజేయాల !' అని వాపోయింది.

రాక్షసాకారంగల వీర్రాజుకు పసితనానే కుప్పు అమ్మివేయబడ్డాడు. అప్పటినుండి వీర్రాజు వ్యాపారానికి

కుప్పు పెట్టుబడి అయ్యాడు. చేయనని ఏడ్చే కుప్పుకు వీర్రాజు కొరడా కాళ్ళతో నే అన్ని పనులు చేయటం నేర్పింది. అక్కడనుండే మొదలయింది కుప్పు బాధామయ గాథ !

నల్లని మొహం, చురుకైన కళ్ళు, ఆ కళ్ళలో ఏదో కాంతి .... పదిహేనేళ్ళ మనసు ప్రపంచాన్ని అర్థం చేసుకోగలుగుతూ .... ఊహా పరిధి వికసించిన కొలదీ అతనికి ఎదురుతిరగసాగింది.

ఆనాటి కుప్పు నైలాన్ కుచ్చుల చొక్కాతో జోకర్‌లా ఉన్నాడు. " తన బ్రతుకు ఎంత బాధాకరము ! తనతోటి మానవులంతా వింత జంతువులా తనను చూస్తుంటే గాయపడిన హృదయాన్ని ఊరడించుకోవడం వృథా ప్రయాస. ఇలా బ్రతకడం కంటే .................. "

" కానీయవోయ్ " అరిచారెవరో.

ఉలిక్కిపడ్డాడు కుప్పు. వీర్రాజు నిప్పులు చెరిగేకళ్ళతో తనని తీక్షణంగా చూస్తున్నాడు. తలదించుకున్నాడు కుప్పు. తర్వాత తనకు తగలబోయే కొరడా దెబ్బలు ఊహించుకుంటూ.

" ఊ ! " హుంకరించాడు వీర్రాజు.

వెంటనే కుప్పు పనికి ఉపక్రమించాడు. రికార్డుప్లేయర్ మీద పాతరికార్డును తీసి క్రొత్త రికార్డును పెట్టాడు కాళ్ళతో.

" నీ బ్రతుకింతేలే ! " పాట మొదలయింది.

ఆ పాటకు నవ్వుకున్నాడు; తన మీద జాలితో ....

కత్తిపీట తీసి చిప్స్‌గాను, కూరముక్కలు గాను ఆలుగడ్డలు తరిగాడు కాలివేళ్ళతో. " తనలాగే కాళ్లున్న మనుషులు తాను కాళ్ళతో చేసే పనులకు ముగ్ధులౌతారు .... ఎందుకో ! వాళ్ళకు చేతులున్నందుకేనేమో ! "

తెగని ఆలోచనలు .... దువ్వెన తీసి తల దువ్వుకున్నాడు.

అద్దంలో చూసుకుంటున్నప్పుడు మొహం కన్పించక పోతే బాగుండుననిపించింది.

కాని అది సిసలైన నిజాయితీగల మనిషిలా తనపని తాను చేసింది. సూది ఒక కాలి బొటన వ్రేలితో పట్టుకుని ఎడమకాలి రెండు వ్రేళ్ళ మధ్య దారం బట్టుకొని సూదిలోకి ఎక్కించాడు. ఒక గుడ్డపై కుడుతుంటే ప్రేక్షకుల్లో హర్ష ధ్వానాలు మిన్నుముట్టాయి.

కుప్పు అంతరంగంలో అగ్ని జ్వాలలు భగ్గుమన్నాయి.

కాళ్ళతోనే పేకముక్కలు కలిపి పంచాడు. జనమంతా తమను తాము మరచిపోయి చూస్తున్నారు.

వీర్రాజు డబ్బులు లెక్కపెట్టుకుంటున్నాడు. కుప్పు అంతర్యంలోని జ్వాల ఆకాశాని కెగిసింది. 'ఇది ఇక కొన సాగటానికి వీల్లేదు. వీర్రాజు లాంటి దానవులు తన లాంటి వారి ద్వారా డబ్బు సంపాదించడానికి వీల్లేదు. చేతులు లేని వాడైనా సాటి మనిషిని మనిషిగా గుర్తించలేని ఈ సమాజంలో బ్రతక కూడదు.'

'భగవాన్ ! ఈ సారైనా నన్ను సరిగా పుట్టించు.'

ఎదురుగా స్టవ్, గిన్నె, అగ్గిపెట్టె ఉంది. అన్నం వండటం చేయవలసిన పని.

కుప్పు మెదడు పాదరసంలా పనిచేసింది.

అగ్గిపెట్టె తీసి స్టవ్ అంటించాడు. ఆ పుల్లను అలాగే ఎవ్వరూ చూడకుండా చొక్కాపై వేసుకున్నాడు.

కుప్పు వేసుకున్న అందమైన నైలాన్ చొక్కా భగ్గుమంది.

ప్రజలలో కోలాహలం పెరిగింది. అంతా పరుగెత్తు తున్నారు. కుప్పు శరీరాన్ని అగ్నిదేవుడు ఆప్యాయంగా దగ్గరకు తీసుకుంటుంటే వీర్రాజు సమీపించటానికి కూడా సాహసించలేదు.

కుప్పు కళ్ళల్లో తనను అమ్మిన తల్లిదండ్రులు, కొనుక్కున్న వీర్రాజు, ఆనందపడే ప్రజలు కన్పించారు. మరుక్షణమే కుప్పుగుండెలు లయతప్పాయి.

ఇంకా నాలుగేళ్ళయినా ఉంటే బాగుండేదిరా కుప్పిగా! నిన్ను కొన్న డబ్బుకి వడ్డీ ఇంకా రాలేదురా! అని గొణుక్కుంటున్న వీర్రాజు అంతర్యం కుప్పని బలి తీసుకోవడంతో మారలేదు. సంతలోని జంతువులా తోటి మనిషిని అంచనా వేసి అతని అభిమానాన్ని గాయపరచే ప్రజలు సంఘంలో ఉన్నంతవరకూ మారదుమరి ! ఇది గమనించి సూర్యుడు కుప్ప శరీరంలాగే ఎర్రబడి అస్త్రాద్రిని చేరుకొన్నాడు. ●

( " స్వాతి " మాస పత్రిక )

# మానవత

సాయంకాలం ప్రకృతి రమ్యంగా ఉన్నది.

దివాకరుడు అలసిన మొహంతో పశ్చిమాద్రిని చేరుకుంటున్నాడు. సన్నని ఈల పాటలతో పిల్లగాలి పలకరిస్తూ పరుగులు పెడుతున్నది. ప్రతి ఇంట్లో పవిత్రత మెదులుతున్నట్లు ఎఱ్ఱని సూర్య కిరణాలు పల్లె అంతా పరచుకున్నాయి.

గుడి ప్రక్కనే కోనేటి నీటిలో కొంగలు వాలి రివ్వున దాపునే ఉన్నచింత చెట్టుపైకి చేరిపోతున్నాయి.

కోనేటిలోని నీరు క్రమంగా సూర్యరశ్మికి దూరమై నల్లబడుతున్నది.

గుడిగోపురంలోని పావురాళ్ళు టపటప రెక్కలాడించు కుంటూ ఒకసారి బయటికి వచ్చి బయటకు తొంగి చూసి మరలా చీకటి పడుతోందని గ్రహించి లోపలికి వెళ్లి ముడుచుకుంటున్నాయి.

గుడిలో గంటలు నిర్విరామంగా కొద్దిసేపు మ్రోగాయి.

వేణుగోపాలస్వామి విగ్రహంముంచు దివ్యదివ్యంగా వెలుగుతున్నది. చిరునవ్వు ఆభరణంగా ధరించిన స్వామి మొహం అత్యంత రమణీయంగా ఉంది.

వ్యత్యస్త పాదారవిందములకు అలంకరింపబడిన మువ్వలు అలనాటి రాచకేళిని జ్ఞప్తి చేస్తున్నాయి —

చేతిలోని వంశీ మోహనకృష్ణునికి మరింత వన్నె చేకూర్చింది. ఆ మూర్తిముందు పద్మాసనంలో కన్నులు మూసుకొని నిశ్చలంగా మువ్వ కూర్చుని ఉంది.

నాలుగు పదులుండే ఆమె శరీరం దైవార్చనకే అంకితమయి దైవత్వ నిలయముగా ఉన్నది.

విరబోసిన నల్లని కురులమధ్య అక్కడక్కడా నెరుస్తున్న వెంట్రుకలు ఆమె జీవితంలోకి ప్రవేశించిన వృద్ధాప్యాన్ని సూచిస్తున్నాయి—

తన్మయావస్థనుండి మువ్వ మేల్కొని కనులు తెరిచింది.

అప్పుడే ఆలయంలోనికి అడుగిడిన కాత్యాయిని కన్పించింది.

పలకరింపుగా నవ్వి లేచి గోపాలునికి హారతిచ్చింది.

ఆ హారతిని తర్వాత కాత్యాయిని వైపు చాచింది.

పవిత్ర సౌందర్యమూర్తి అయిన ఆమె హారతిని అతి భక్తితో కన్నుల కద్దుకున్నది.

కాత్యాయినిలోని భక్తి భావనగాంచి మువ్వ మనసు పరవశమయింది.

" ఏమ్మా ! నిన్న రాలేదేం " ప్రేమగా అడిగింది.

సిగ్గుపడినట్లు తలవంచింది కాత్యాయిని.

" మరిచాను ! నిన్న పెళ్ళివారొచ్చారు గదా ! అంది మువ్వ నవ్వుతూ.

కాత్యాయిని తలపై కెత్త లేదు.

అదిసిగ్గు అనుకొన్నది మువ్వ.

నవ్వుకుంటూ ప్రసాదమందివ్వ బోయింది.

చివ్వున తలెత్తిన కాత్యాయిని కళ్ళల్లో సుడిగుండాల్లాంటి కన్నీరు.

" ఏమిటి తల్లీ ఇది ! ఆప్యాయంగా అడిగే మువ్వ ఎదపై వాలి రోదించింది కాత్యాయిని. కాసేపయ్యాక తమాయించుకొంది.

ఎదలో గోడు విన్పించిందామె.

అంతావిన్న మువ్వ మాట్లాడలేకపోయింది.

వేణుగోపాలుని మీద భారంవేసి ఆశీర్వదించి కాత్యాయినిని సాగనంపింది. భారంగా కదిలిపోయే కాత్యాయినిని కనుమరుగయేంతవరకూ చూసింది.

జపానికి కూర్చుండబోగా పోలమ్మ పరుగెత్తుకుంటూ వచ్చింది.

'ఏంటి పోలమ్మా ఏమయింది'. మువ్వ ఆదుర్దాగా ప్రశ్నించింది.

'ఏటిసెప్పను నా తల్లో! మాకిట్టిగాడిని పురుగు ముట్టుకున్నాది. బేగిరా తల్లీ! ఆడ్ని కాపాడు' పోలమ్మ శోకాలు పెట్టింది.

" పద ఏడవకు " వేణుగోపాలుని తీర్థంతో మువ్వ బయలుదేరింది.

పోలమ్మ గుడిసెలో మంచంపైన వళ్ళెరుగక పడి వున్నాడు కిట్టిగాడు తీర్థం వాడి నోట్లో గోపాల నామస్మరణతో పోసింది మువ్వ.

అంతా ఆత్రంగా చూడసాగారు.

కొద్ది సేపటికి కిట్టిగాడు కళ్ళు తెరిచాడు.

" అమ్మా! నీవు అమ్మోరివి " అంటూ కిట్టిగాడ్ని మువ్వ కాళ్ళ మీద పడేసింది పోలమ్మ.

అదేమిటి పోలమ్మా ! నేనూ మీలాంటి మనిషినే ! అంతా వేణుగోపాలుడి దయ...అంటూనే కిట్టిగాడ్ని మంచం పై పడుకోబెట్టి ఆలయాభిముఖమైంది మువ్వ.

'యాడ పుట్టిందో ఈ తల్లి! మా ఊరోళ్ళకు సేవ సేటానికే వచ్చినట్టుండాది.. దయగల తల్లి !' వెనకనుండి మువ్వకు దండంపెట్టింది పోలమ్మ.

తానెవరో తెలియని మువ్వ తనను వేణుగోపాలుని పాదానికి కట్టే మువ్వలలో ఒకదానిగా చెప్పుకుంటుంటుంది. గోపాలుడే ఆమె సర్వస్వం...ఆమే ఆ ఊరివారి సర్వస్వం!

మువ్వ ఆ రోజు యథావిధిగా గోపాలుని ధ్యానంలో వుంది.

పాదాలను ఎవరో తాకినట్లనిపించి కళ్ళు తెరిచింది.

ఎదురుగా కాత్యాయిని, చంద్రం పూలదండలతో మెరిసిపోతున్నారు.

మువ్వ అర్థవంతగా నవ్వింది.

క్షణం సిగ్గుపడిన కాత్యాయిని మొహంలో భయం చోటు చేసుకుంది.

" పట్నం మెళ్ళిపోదామని బయలు దేరాము. కాని దోవలో నాన్న మనుషులు చూశారు. నీవే కాపాడాలమ్మా " అంటూ కాళ్లు చుట్టేసింది కాత్యాయిని.

" కాలేజీ సెలవలకని వచ్చిన నన్ను తొందర పెట్టింది. కొంచెం ఆలోచించవద్దన్నా విన్లేదమ్మా " అంటూ చంద్రం చెప్తున్నాడు.

కానీ అవేమీ మువ్వకు వినబడటం లేదు. బయట నుండి లీలగా మనుషుల అరుపులు విన్పిస్తున్నై.

విషయం అర్థమయిందామెకు.

ఇటే వచ్చారు. నేను చూశాను

కరణం గొంతు గుడికి దగ్గరగా విన్పించింది.

కాత్యాయిని భయంతో కొయ్యబారిపోయింది.

దీనంగా, ఆర్తిగా ఆవేదనగా మువ్వ వంక చూసింది వణికిపోతూ.

" మీరు లోపల గడియ వేసుకోండి " అంటూ బయటకు నడిచింది మువ్వ స్థిర సంకల్పంతో.

మునసబు ఉగ్రనరసింహమూర్తిలా వచ్చాడు.

" కాత్యాయిని, చంద్రంలు వచ్చారా ఇటు ? అడిగాడు కోపంగా.

' వచ్చారు ' మువ్వ స్వరం ప్రశాంతంగా పలికింది.

" ఏరీ " ఆవేశంగా ముందుకు రాబోయాడు మునసబు.

' గుడిలో ఉన్నారు ' బదులు పలికిందామె స్థిరంగా.

తలుపులు వేసి ఉండటం గమనించిన మునసబు రుద్రుడే అయ్యాడు.

" తలుపులు తీయమను. ఆ కులం తక్కువ వెధవని కట్టుకుని నా పరువు తీసింది. చంపేస్తాను దిక్కుమాలిన దాన్ని. నా కడుపున చెడబుట్టింది. కేకలు పెట్టసాగాడు.

తలుపుల కడ్డంగా నిలబడ్డ మువ్వ వారించింది.

" కొంచెం ఆలోచించండి : మనసులు కలిసి మనువు కావాలనుకున్న వాళ్లను విడదీయటం అన్యాయం— మానవులంతా ఆ గోపాలుని సంతానమే: కులంపేరిట వారిని విడదీయకండి. ఈ కులాలు మనం సృష్టించుకొన్నవి " అంటూ ఇంకా ఏదో చెప్పబోయిన మువ్వను కసురుకున్నాడు మునసబు.

" నీకు తెలియదు మువ్వా : అడ్డులే : "

" నేను లేవను, నాబొందిలో ప్రాణం వున్నంతవరకు ఆ అమాయకుల నేమీ చేయనీయను, " కాళిలా గర్జించిందామె.

" అంతవరకూ వచ్చిందా నీ వ్యవహారం ? చూస్తా ఎట్లా లేవవో : కానీయండిరా : " అరిచాడు మునసబు ఆవేశంపూనిన పదికఱ్ఱలు గాలిలో లేచినై.

మువ్వ ఆలయద్వారం మంటపం మీద కుప్పకూలి పోయింది :

మంటపద్వార మధ్యానగల వేణుగోపాల పాద చిహ్నాలు-మువ్వ రక్తంతో అరుణరాగరంజితాలయినాయి.

వెంటనే ఆలయ ద్వారాలు తెరచుకున్నాయి.

చంద్రం కాత్యాయిని పరుగున వచ్చారు బయటికి.

" ఎంతపనిచేశారు నాన్నా ! అంటూ కాత్యాయిని మువ్వపై పడి విలపించ సాగింది — చంద్రం శిలలా నిల్చుండి పోయాడు.

కాత్యాయిని రోదనతో మునసబు మత్తువదిలి ఈ లోకంలోకి వచ్చాడు.

ఎదురుగా తాను చేసిన దురాగతం మువ్వ రక్తపు ఎరుపులో ప్రతిబింబించింది.

మువ్వ కాళ్లపై పడ్డాడు క్షమించమంటూ........

కళ్ళు బలవంతంగా తెరచిన మువ్వ కరుణగా నవ్వింది.

తన రక్తపు చేతులతో కాత్యాయినీ చంద్రంల చేతులు కలిపి మునసబు చేతుల్లో ఉంచింది ప్రేమమూర్తిలా.

వేణుగోపాలుని వైపు చూసి కడసారిగా నమస్కరించి ఆయన పాదచిహ్నాలపై వాలిపోయింది సుమంలా.

తరతరాల కులమతాల కట్టుబాట్లను ఛేదించటానికి బలియైన మువ్వను చూసి ఆమె చావుకు కారకుడైన మునసబులోని సంకుచితత్వం పశ్చాత్తాపంతో కుమిలి పోయింది — మానవత మల్లెలా విరిసింది. ●

( " స్వాతి " మాస పత్రిక )

# రాలిన మొగ్గ

**టక్‌టక్ మంటూ అప్పటిదాకా కొంపలంటుకుపోతున్నట్లు పరుగెడు తున్న రైలు నీరసం ఆవరించినట్లుగా వేగం తగ్గించుకుంది.**

రోజూలాగే ఆ రోజు కూడా ఆ వంతెనదాకా రాగానే ఎవరో ఎఱ్ఱజెండా చూపినట్లు, కళ్ళెంపట్టి లాగబడిన గుఱ్ఱంలాగా ఆగిపోయింది రైలు.

రైలు ఆగగానే వాతావరణం ప్రశాంతంగా అన్పిం చింది. రైల్లో ఉన్నవాళ్లంతా రైలెందుకు ఆగిందోనని "సిగ్నల్ ఇవ్వలేదా" అనుకుంటూ కిటికీల్లోంచి బయటకు చూసే పందికొక్కుల్లా చూడసాగారు. సిగ్నల్ ఎక్కడా కన్పించలేదు, వాళ్ళకేమీ అంతుపట్టక "ఎవరైనా చైన్ లాగారేమో" అని తమలో తాము కొద్దిసేపు విసుక్కుని నిద్రలోకి కొందరు జారిగిపోయారు. కొందరు కబుర్లలో మునిగిపోయారు పూర్తిగా.

రైలుపట్టాలకు దగ్గరగా ఉన్న గుడిసెల ముందు నుంచి ఒక కాలిబాట రైలుపట్టాలదాకా వచ్చి ఆగిపోయింది. పట్టాల అవతలనుంచి ఆబాట సీరియల్ నవలలా మళ్లీ కన్పిస్తుంది.

వాతావరణాన్ని చీల్చుకుంటూ ఒక పసికేక విన్పించింది.

పట్టాలదగ్గరగా నడుస్తున్న ఒక నడివయసు స్త్రీతో పరుగులాంటి నడకతో నడుస్తున్న ఒక నిక్కరులేని ఐదేళ్ల కుర్రవాడు కన్పించాడు. వాడు ఉత్సాహంగా రైలుకేసి చూస్తూ చేయి ఊపుతూ అరుస్తున్నాడు.

ఇంతలో రైల్లోంచి ఎవరోదూకారు. రైలుదూకిన కుర్రవాడికి పన్నెండేళ్ళుంటాయేమో! మాసిపోయి అక్కడక్కడా చిరిగి దారాలు వేలాడుతున్నలాగూ చొక్కా ఒక చేతిలోనల్లటి మురికి సంచీ, రెండవ చేతితో రైలు రాడ్ పట్టుకుంటూ క్రిందికి ఉరికాడు. చీకిపారేసిన తాటి టెంక లాంటి వాడి జుట్టు గాలికి ఆనందంగా ఇష్టంవచ్చినట్లు నాట్యంచేస్తున్నది. రైలుదిగిన ఆ కుర్రవాడు ఎంతో స్టైలుగా విలువయిన వస్తువును పట్టుకున్నట్లుగా మురికి సంచి అపురూపంగా పట్టుకొని తనవారికేసి నడిచాడు.

తల్లి ప్రక్కన నిల్చుని ఆనందంగా చూస్తున్నాడు తమ్ముడు - మరునిముషంలో వాడి ప్రక్కన నిలబడ్డాడు.

తమ్ముని తలపై ప్రేమగా చేయివేసి నిమిరాడు. బుగ్గమీద తమాషాగా చిటికె వేశాడు. ప్రక్కన ఉన్న తల్లికేసి కళ్ళెత్తయినా చూడలేదు. నిక్కరు జేబుల్లోంచి కొంత చిల్లరతీసి తమ్ముడి చేతిలో పెట్టాడు.

తమ్ముడు గుప్పెటతో ఆ డబ్బుల్ని భద్రంగా పట్టుకుని ఆశగా అన్న మొహంలోకి చూస్తూ "అన్నా! ఒకసారి ఇంటికి రావూ!" అని అడిగాడు.

అన్న ఏమీ మాట్లాడలేదు. ప్రేమగా వాడి తల మళ్ళీ నిమిరాడు. వాడి బుగ్గపై ఒక ముద్దు పెట్టుకున్నాడు. 'నువ్వు అమ్మతో వెళ్ళు' అని తమ్ముడితో చెప్పి కదులుతున్న రైలు సునాయాసంగా ఎక్కేశాడు.

మురికి సంచీలోంచి రెండు బ్రష్‌లు, ఒక నల్లని చిన్న డబ్బా తీసి సంచీ చేతికి తగిలించుకుని "పాలిష్" అంటూ కంపార్టుమెంటులో తిరగసాగాడు.

రైలు కదిలేదాకా చూసి తమ్ముడు తల్లికి దగ్గరగా జరిగి అన్న ఇచ్చిన డబ్బులు ఇచ్చాడు—

అన్న ఇంటికి రానన్నాడా! అన్నీ విన్నా ఏదో ఆశగా అడిగిందామె.

"ఆ!" వాడు పెద్దగా అరిచాడు.

'ఏమన్నాడు?'

'ఏమీ అనలేదు' చిన్నబోయిన మొహంతో బదులిచ్చాడు వాడు.

'సరే పద! పొద్దెక్కుతోంది' పిల్లవాడ్ని తొందరపెట్టి నడిచిందామె. మనసునిండా పెద్దకొడుకుని గురించిన ఆలోచనలు కారుమేఘాల్లా కమ్ముకున్నాయి.

ఇప్పటికి సరిగ్గా రెండునెలల క్రిందట ఏడుపు మొహంతో స్కూలునుంచి ఇంటికి వచ్చాడు రాము.

'నేనింక బడికిపోను' అన్నాడు పట్టుదలగా తల్లితో.

'ఎందుకని' కోపంగా అరిచిందామె.

'నాకు ఏమీ అర్థంకావటం లేదు - మాస్టరు క్లాసులో ఏమీ చెప్పకుండా చాలావరకు ఇంటిదగ్గర నేర్చుకొని రమ్మంటున్నారు. నాకు ఇంటిదగ్గర ఎవరు చెపుతారు ?' ఎదురు ప్రశ్న వేశాడు వాడు.

వాడు వేసిన ప్రశ్నకు జవాబు ఆమెవద్ద లేదు. ఆమె, ఆమె భర్త ఇద్దరూ చదువుకోని వారే! పగలంతా పనిచేసి శ్రమించి, వచ్చిన డబ్బుల్తో తాగి ఇల్లుచేరే భర్తని తిట్టుకుంటూ పిల్లల్ని చదివించి ప్రయోజకులుగా చెయ్యాలని కాయకష్టం చేస్తున్నదామె. కొడుకు చదువు మానేస్తానంటే ఆ తల్లి మనసు తల్లడిల్లిపోయింది.

ఆ రోజు సాయంత్రమే పుస్తకాలన్నీ పాతపుస్తకాలు కొనే షాపులో అమ్మేసి బ్రష్‌లు, పాలిష్ డబ్బా తెచ్చాడు వాడు.

'నేను పాలిష్ చేసి సంపాదిస్తాను' నిర్ణయించుకున్నట్లుగా అన్నాడు.

'నీకేం రోగమిది ? మిగతా పిల్లలంతా చదూకోడం లేదూ ?' కోపంగా అరిచింది తల్లి.

'మిగతా పిల్లలంతా స్కూలు వదలగానే మాస్టరింటికి వెళతారు ట్యూషన్‌కి.'

'నువ్వు కూడా వెళ్ళు' ఆమె అసహనంగా అంది.

'కానీ మాస్టారు వాళ్ళందరి దగ్గరా నెలకు పదిహేను రూపాయలు తీసుకుంటున్నాడు తెలుసా ?' కోపంగా చూశాడు రాము.

" మనం కూడా ఇద్దాము " తల్లి బతిమిలాడుతూ అంది.

తల్లి ట్యూషన్ డబ్బులు కట్టాలంటే ఎంత కష్టపడాలో రాముకు తెలుసు-తల్లి ప్రేమకు మనసులోనే ఆనందించాడు.

" వద్దమ్మా ఈ చదువు సాగేది కాదు" — నేను సంపాదించి నిన్ను సంతోషపెడతాను. నువ్వు నాన్నతో డబ్బుల కోసం పోట్లాడనవసరం లేదు — దృఢంగా అన్నాడు.

"పసివాడివి, నీకేపని చేతవుతుందిరా" తల్లి మనసు రెపరెపలాడింది.

వెంటనే రాము ఎంతో ఆప్యాయంగా బ్రష్‌లు, పాలిష్ డబ్బా చూపాడు.

అవి చూడగానే తను కన్న కలలన్నీ కళ్ళముందే కరిగిపోయినట్లు విలవిల్లాడిందా మాతృహృదయం! వాడితో ఆ పని మానమని, చదువుకోమని ఎంతో చెప్పింది.

రాము వినలేదు తన నిర్ణయానికి తిరుగులేదని చెప్పి ఇంట్లోంచి వచ్చేశాడు.

ఇది జరిగి రెండు నెలలయింది. ఆ రైలు రోజూ ఆ వంతెన దగ్గరకి రాగానే ఆగిపోతుంది.

రైలు అక్కడ ఆగటానికి గల కారణాలు చాలామంది చాలారకాలుగా అనుకుంటారు. కొందరు దొంగతనంగా తెచ్చే సరుకులు అక్కడ దింపుకోటానికే రైలు ఆపుతారని అంటారు.

కొందరు నాగరికులు అక్కడ రైలు క్రాసింగ్ ఉంది కాబట్టి ఆగుతుందని అంటారు.

రాము ఆ రైలులోనే వస్తాడు రోజూ. ఎందుకంటే ఇదే టైముకు ఇంటి పని చేసుకుని తల్లి పైబస్తీలోని ఇళ్ళలో అంట్లు తోమటానికి వెళ్తుంది.

రాము తమ్ముడు ఎప్పుడూ తల్లితోనే ఉంటాడు — రాము రోజూ తనకిచ్చే డబ్బులన్నీ అమ్మకిచ్చేటప్పుడు పదిపైసలు దాచుకుంటాడు. ఆ సంగతి తెల్సినా తల్లి తెలీనట్లే ఉంటుంది.

ఆ పదిపైసలతో వాడు పంచదార గోలీలు కొనుక్కుంటాడు. కానీ అన్నీ ఒంటరిగా తినడు. వాటిల్లో రెండు గోలీలు చెల్లెలుకోసం దాచిఉంచుతాడు. ఎందుకంటే చెల్లెలంటే వాడికి ప్రాణంగాబట్టి ....

రోజూలాగే ఆ రోజు కూడా స్టేషన్ నుంచి రైలు కదలగానే రాము ఒక కంపార్టు మెంటులోకి ఎక్కాడు. అది ఫస్ట్‌క్లాస్ కంపార్టుమెంట్. వాడు పాలిష్ అంటూ ప్రయాణీకులని అడిగాడు.

అకస్మాత్తుగా పరిచిత స్వరం విన్పించి ఆ వైపు చూశాడు. ఆ వ్యక్తిని చూడగానే వాడి కళ్ళు మెరిశాయి. దగ్గరిగా వెళ్ళి "పాలిష్ సార్" అన్నాడు.

ఆ వ్యక్తి అంగీకారసూచకంగా తల ఊపాడు. రాము ఎంతో ఆసక్తిగా, ఆప్యాయంగా కూర్చొని సంచిలోని సామాన్లు బయటకు తీస్తూ "సాదానా! క్రీమ్ కలరా!" ప్రశ్నించాడు వినయంగా.

"సాదా" ఆయన బదులిచ్చాడు.

" బాగా మెరిసేట్లు చేస్తాను సార్ ! క్రీమ్ కలర్ వేయించుకోండి సార్ ! పావలా చాలు "

" వద్దు " వాడి వంక చూడకుండానే ఇంగ్లీషు పుస్తకంలోంచి కఠినంగా అన్నాడాయన.

రాము ఏమీ మాట్లాడకుండా మెల్లగా పాలిష్ చేయసాగాడు. తల వంచుకుని పాలిష్ చేస్తున్న రాము తలకు కాలుమార్చుకుంటున్న ఆయన పాదం తగిలింది. అప్పుడు రాముని చూసి గుర్తుపట్టాడాయన.

" ఓ ........ రామూ ! నువ్వా ".

అవును సార్ ! మాష్టారు తనను గుర్తుపట్టి పలకరించినందుకు సంతోషంతో ఉప్పొంగిపోయిందా పసిహృదయం.

" ఈ పని ఎప్పుడు మొదలు పెట్టావు? "

'రెండు నెలల్నుంచండి' వినయంగా జవాబిచ్చాడు.

" ఆ, మంచిది నీకు ఇదే తగిన పని " ఆయన నిరసనగా అంటూ పుస్తకంలో తలదూర్చాడు మళ్ళీ.

ఆ మాటలు వింటూనే రాము శరీరంలో వందల సూదులు గుచ్చుకున్నట్లనిపించింది. ఏమీ మాట్లాడలేక పోయాడు వాడు.

పాలిష్ చేస్తున్న వాడి చేయి వణుకుతూ మాటిమాటికి ఆగిపోతున్నది.

ఇంతలో ఆ వంతెన వస్తున్నది. రైలు వేగం తగ్గ లేదింకా. రాము పాలిష్ చేయటం ఆపి త్వరగా లేచి నిల్చు న్నాడు. వాడి మొహం కోపంతో జేవురించి ఉంది.

రైలింకా స్పీడు తగ్గించుకోలేదెందుకో, ఆ వంతెన వచ్చేసింది. కోపంగా వాడి చేతిలోని బ్రష్‌ను మాష్టారు కేసి విసిరాడు. రైల్లోనుంచి దూకేశాడు. అదే టైముకు వాడి తమ్ముడి కేక బిగ్గరగా విన్పించింది.

రైలు మెల్లగా ఆగింది.

రాము నిర్జీవ శరీరం రైలుపట్టాలకు కొంచెందూరంలో రక్తసిక్తమై పడిఉంది. గట్టిగా బిగించివున్న వాడి గుప్పె టలో పాలిష్ డబ్బా ఉంది.

రాము తల్లి ఈ దృశ్యం చూస్తూనే ఒక కేకవేసి మూర్ఛపోయింది. తమ్ముడు అన్న దగ్గరకు వస్తుంటే చుట్టూ ఉన్న జనం వాడిని దూరంగా నెట్టేస్తున్నారు — అన్న కేమయిందో తెలీక వాడు ఏడుస్తున్నాడు. వాడి హీన స్వరం ఎవరూ పట్టించుకోవటం లేదు.

గుంపులో ఎవరో అన్నాడు " అరె! వీడు పాలిష్ కుర్రాడు " అని.

ఇంతలో గాలిలోకి తమ్ముడు విసిరిన చొక్కావచ్చి రాము మొహాన్ని కప్పేసింది.

తను చదువుకోడానికి సహకరించక, పైగా తాను శ్రమించి బ్రతుకుతుంటే అపహాస్యం చేసి తన లేత మనస్సును గాయం చేసిన ఈ సమాజంలోని విషపురుగులకు మొహం చూపటం కూడా ఇష్టం లేనట్లుగా రాము మొహం మీద తమ్ముడి చొక్కా పరుచుకుంది.

విషయం విన్న రాము తండ్రి తాగిన మైకంలో భార్యను ఓదారుస్తూ " ఎందుకేడుస్తావే! వాడి లాటి వాళ్ల బతుకింతే!" అని నిశ్చలంగా చెప్తున్నాడు. ●

( " యువ " మాస పత్రిక )

# నవ్వు

"టైం అయింది త్వరగా తెమలు"
అంది భార్గవి అక్కతో.

"అయిపోయింది లేవే! ఒరేయ్ గోపీ! రిక్షా పిల్చుకురా!" అంది అరుణ చీరకుచ్చిళ్ళు సవరించుకుంటూ.

గోపీ మరుక్షణంలోనే వాకిట్లో రిక్షాతో ప్రత్యక్షమయ్యాడు.

"అక్కయ్యని దించి జాగ్రత్తగా తిరిగిరావే భార్గవీ" అరుంధతి చిన్న కూతురితో జాగ్రత్తలు చెప్పింది.

"సర్లేవే అంతభయం ఎందుకు, పోనీవోయ్ రిక్షా" రిక్షావాడిని తొందరపెట్టింది భార్గవి.

సర్దుకొని కూర్చున్నారిద్దరూ. అరుణ దిగాలుగా మొహం పెట్టి—

"వెళ్ళివస్తానమ్మా" అంది.

'మంచిది తల్లీ! సామాన్లు జాగ్రత్త. ఎక్కేటప్పుడు దిగేటప్పుడు లెక్కపెట్టుకోండి!' రిక్షా సాగిపోతుంటే వెనక నించి అరిచినట్లుగా కేక వేసి చెప్పింది అరుంధతి.

తల్లి కేకకు మొహం చిట్లించుకుంది భార్గవి.

స్టేషన్ చేరగానే సామాన్లన్నీ ఒక చోట పెట్టి రిక్షా వాడికి డబ్బులిచ్చి పంపింది భార్గవి. టికెట్లు తెచ్చింది, అక్కని సామాన్లకి కాపలాగా ఉంచి.

సామాన్లన్నీ ప్లాట్‌ఫారంపై చేర్చటానికి ఇద్దరూ చాలా శ్రమ పడవలసివచ్చింది. మొత్తం పదకొండున్నాయి. ఇద్దరివల్ల ఏమవుతుంది!! కూలీని మాట్లాడింది. దిగేచోట కూలీలు దొరకరు. అమ్మ మరీ చాదస్తంగా ఇన్ని మూటలు చేస్తుంది. ప్రయాణంలో సామాను ఎంత తక్కువగా వుంటే అంత మంచిదంటే అమ్మ వినిపించుకోదు .... కొత్తగా పెళ్లయిన అక్క సంసారం కోసం పదకొండు మూటలు .... అమ్మ దృష్టిలో తక్కువ కిందే లెక్క. తనలో తాను విసుక్కుంది భార్గవి.

ఇంతలో గంట కొట్టారు.

ప్లాట్‌ఫారంపై హడావిడి మొదలైంది. అందరూ పరుగు పందాలో గుర్రాల్లా అటూ యిటూ పరుగెడుతున్నారు.

రైలు వచ్చి వగరుస్తూ నిల్చుంది.

రెండు నిముషాల్లో అక్క ఎక్కగానే సామాన్లన్నీ ఎక్కించింది కూలీవాడిచేత. వాడే అన్నీ సర్దాడు. కూలీ ఇస్తుండగానే రైలు కదిలింది. హడావిడిగా దిగిన కూలీని చూసి "అమ్మయ్య" అని విశ్రాంతిగా గాలి పీల్చుకుంది భార్గవి. ఎక్స్‌ప్రెస్ రైలు ఇంతకంటే ఎక్కువ సేపు ఆగదుమరి ....

నిలబడి అటూ ఇటూ చూసింది. అరుణకు ఎలాగో సీటు దొరికింది. తనకే లేదు.

'ఈ ట్రెయిన్ ఎప్పుడూ ఇంతే!' సన్నగా సణిగింది.

ఇంతలో ఎవరో సర్దుకొని సీటు ఇచ్చారు.

"ఫర్వాలేదు! ఈ మాత్రం మానవత్వం ఉంది కాబట్టే ఇంతమాత్రం ఉంది దేశం! అనుకుంది భార్గవి. సీటు ఇచ్చిన వారికి కళ్ళతోనే కృతజ్ఞతలు తెలిపింది. మళ్ళీ ఒకసారి ఎదురు సీటుకిందా ప్రక్కసీటుకిందా సర్దిన, సామాన్లు కళ్ళతోనే లెక్కవేసుకుంది. అరుణకు ఇవేమి పట్టలేదు.

ఆమె ధ్యాసంతా భర్తమీద ఉంది.

భార్గవితో దారిపొడుగునా భర్తగురించిన సంగతులు చెప్పసాగింది అరుణ.

బావగారి గురించిన కబుర్లు వింటున్న భార్గవి కళ్ళు అకస్మాత్తుగా ఎదురుగా ఉన్న సింగిల్ సీటులో కూర్చున్న వ్యక్తిమీద పడినాయి.

ఇక్కడే ఎక్కినట్లున్నాడు.

ఎవరితను ? అసలు మనిషేనా అనుకుంది ఉలిక్కి పడ్డట్లుగా .... నల్లనిమనిషి, మనిషికి మ్యాచయే నల్లకళ్ళ జోడు. బొమ్మల బఫూన్‌చొక్కా, హిప్పీ క్రాప్‌తో ఉన్నతను తమమాటలు శ్రద్ధగా వింటున్నట్లు తోచింది భార్గవికి. మధ్య మధ్య చిరునవ్వులు కూడా చిందిస్తున్నాడు అపర కృష్ణుడు :

ఏదో పుస్తకం చేతుల్లో పట్టుకున్నా అతని కళ్ళు భార్గవిమీదే ఉన్నట్లుగా నల్లకళ్ళజోడు లోంచి కూడా లీలగా కనిపిస్తున్నది.

భార్గవికి వళ్ళుమండింది.

" ఏయ్ మిస్టర్ : మర్యాద తెలీదా : ఏమిటా చూపులు .... " అందామనుకుంది. కానీ 'నువ్వు నావైపు చూడంది నేను చూసినట్లు నీకెలా తెలిసింద'ని అతడంటే పరువే పోతుంది.

ఆలోచిస్తున్న భార్గవికి అరుణ మాటలు బుర్ర కెక్కటంలేదు.

చిన్న కుదుపుతో రైలాగిందెందుకో .... సంచీ బోర్లా పడింది.

అమ్మ అరుణ కిష్టమని పెట్టిన సపోటాలు, యాపిల్స్ బయటికి వచ్చి అందర్నీ పలకరించాయి. అతనికాళ్ళ దగ్గరికి దొర్లిపోయాయి కొన్ని.

అతను వెంటనే వంగి సరిచేసిపెట్టాడు. ఆపైగా " థాంక్స్ " చెప్పండన్నట్లు అక్కచెల్లెళ్ళ కేసి చూశాడు, నవ్వు మొహంతో.

భార్గవి కోపంగా చురచురా చూసి మొహం మాడ్చుకుంది.

'పెద్ద హీరో....బయల్దేరాడు' అనుకుంది కసిగా.

అరుణమాత్రం అతనికేసి చూసి 'థాంక్స్' అన్నది.

" మొహానికి తోడు థ్యాంక్స్ కూడా.... " అరుణ చెవిలో గొణిగింది భార్గవి. " నెల్లూరు చేరటానికి ఇంకా అరగంట పడుతుంది " వాచీ చూసుకుంటూ అక్కతో అంది భార్గవి.

అతను కూడా వెంటనే వాచీచూసుకున్నాడు. భార్గవికి లేచి ఆచెంపా ఈచెంపా వాయించుదామన్నంత కోపం వచ్చింది.

ఎప్పుడూ చూపులిటే ! పైగా ఉద్ధరిస్తున్నట్లు వెకిలి నవ్వులు .... పళ్ళు నూరుకుంది కోపంగా.

" పదకొండు సామాన్లు తయారుచేసింది అమ్మ ! ఎలా దిగాలో ఏమో ! రెండు నిముషాలే ఆగుతుందేమో ప్యాసింజ రెక్కినా బాగుండేది " దిగులుగా అన్నది అరుణ.

" మరేం ఫర్వాలేదులే ! నేనున్నానుగా ! " భార్గవి భరోసా ఇచ్చింది.

ఇంతలో అతను చేయిచాపాడు.

మొదట భార్గవి తెల్లబోయింది అర్థంకాక.

తర్వాత ఆ చాపటం తన చేతిలోని " విజయచిత్ర " కోసమని గ్రహించి చప్పున ఇచ్చింది. కాసేపు బొమ్మలు చూసి తిరిగి ఇచ్చేశాడతను. నెల్లూరు వచ్చేస్తున్నది.

స్టేషన్ రాబోతుందనగా భార్గవి గభాలున లేచింది. అరుణ కూడా లేచింది.

" బావగారొస్తారో లేదో ! "

" ఖచ్చితంగా తెలీదుగా వస్తున్నట్లు .... ఇవాళో రేపో వస్తామని వ్రాశాను " అరుణ దిగులుగా అంది.

" కాస్త ఈ సామాను అందిస్తారా ! " భార్గవి అతనితో అన్నది.

" తప్పకుండా " అంటున్న అతని మొహంలో వెయ్యిట్యూబ్‌లైట్ల కాంతులు !

"అందమైన పెళ్ళికాని ఆడపిల్ల సాయంకోరితే ! కాదంటానా" అనే భావం ఆకళ్ళజోడు వెనుక కళ్ళలో ఊహించుకుంది భార్గవి.

అరుణ, భార్గవి ముందు దిగారు.

అన్ని సామాన్లూ అతనే గబగబా దింపాడు. తర్వాత అతను కంపార్టుమెంట్ తలుపు దగ్గరే నిలబడి ఇటే చూస్తున్నాడు.

అతనికి మళ్ళీ "థాంక్స్" చెప్పవద్దని భార్గవి ముందుగా చెప్పటంవలన అరుణ అటు తిరిగి కూలీతో బేరమాడుతున్నది.

భార్గవి కూడా అతన్ని గమనించనట్లుగా కూలీకేసి చూస్తున్నది.

ఇంకా నల్లబడిన మొహంతో అవమానంగా ఫీలవుతున్నట్లున్నాడు....'బాగా జరిగింది. ఇంతే కావాలిశాస్తి!' అనుకుంది భార్గవి కసిగా—

'పూర్ ఫెలో' అనుకుంది అరుణజాలిగా.

ఇంతలో గార్డు విజిల్ వేసి పచ్చజెండా ఊపాడు.

అతను ఇటే చూస్తున్నాడు.

వాళ్ళు పొరపాటున కూడా అతనికేసి చూడలేదు. సాగిపోతున్న రైల్లోకి అతను ఎక్కకపోవటం భార్గవి చూస్తే ఇంకెంత కోపగించుకునేదో!

'మొత్తానికి భలేపని చేశావే! అతని చేత అన్ని సామానులు మోయించి కనీసం కృతజ్ఞతలైన చెప్పనీయవు' విసుక్కుంది అరుణ.

'లేకపోతే ఏమిటక్కా! రైలెక్కిన దగ్గర్నుంచీ చూస్తున్నాను. ఒకటే వెర్రిచూపు .... పిచ్చి నవ్వు .... ఆడపిల్ల మొహం ఎరగనట్లు.'

రైలు కదిలేటప్పుడు అతని మొహం గుర్తువచ్చి పకాపకా నవ్వింది భార్గవి.

వారి వెనగ్గా నడుస్తున్న అతను ఆ మాటలకు చిన్నగా నవ్వుకున్నాడు.

కూలీలచేత సామాన్లన్నీ రిక్షాల్లో సర్దించుకొని ఇంటి వైపు బయలుదేరారు అక్కాచెల్లెళ్ళు. ఇల్లు చేరేసరికి పక్కింటావిడ తాళంచెవి ఇచ్చింది. ఇవాళోరేపో తాము రావచ్చని తాళంచెవి ఇచ్చి భర్త ఆఫీసుకు వెళ్ళుంటారని అరుణ ఊహించింది.

ఇంటి తాళంతీసి సామానంతా లోపలికి చేర్చారు అతిప్రయాసతో.

"మంచినీళ్ళు కావాలా" పక్కింటావిడ నీళ్ళు తెచ్చి ఇచ్చింది. ఇద్దరూ గబగబా చెరోగ్లాసు నీళ్ళు తాగారు.

" మీరు వస్తున్నట్లు మీవారికి తెల్సా ? " అరుణను అడిగిందావిడ.

" తెలీదండి ! ఏం ? "

" ఏం లేదులేమ్మా ! నీ పసుపు కుంకుమలు గట్టివి తల్లీ ! అబ్బాయికి పెద్ద గండం తప్పింది." ఆవిడ అనునయంగా అంది.

" ఏం జరిగిందండీ ! " అరుణ హీనస్వరంతో అడిగింది.

భార్గవి మొహంలో భయం, కంగారు చోటుచేసుకున్నాయి. కాళ్ళు వణుకుతున్నాయి. ఆవిడ చెప్పబోయేది వినటానికి సర్వశక్తులూ కూడదీసుకునే ప్రయత్నం చేస్తోంది.

"ఏమీ లేదు. నిన్న ప్రొద్దున అబ్బాయి మామూలుగానే ఆఫీసుకి వెళ్తున్నాడట. టర్నింగ్‌లో లారీ స్కూటర్ గుద్దేశాడట. దోవనబోయేవాళ్ళు హాస్పిటల్‌లో చేర్చారు. ఆఫీసు ప్యూన్ని పంపేదాకా నాకూ తెలీదమ్మా. చక్కగా కళకళ్ళాడుతూ వెళ్ళినవాడు కట్లతో పడుకునివుంటే కళ్ళు చెమర్చాయంటే నమ్ము ! కాఫీ....అదీ ఇచ్చి వచ్చాను. మీకు టెలిగ్రాం ఇప్పించాడట. మీరొస్తే ఇవ్వమని ఇంటి తాళాలు ఇచ్చాడు'' ప్రవాహంలా సాగిన ఆవిడ మాటలు విన్న అరుణ మొహం వాడిపోయి, మనిషి కుప్పకూలిపోయింది.

భార్గవి కర్తవ్యం గుర్తుచేసుకుంది.

అక్కని తీసుకొని, హాస్పిటల్ అడ్రసు తెల్సుకొని బయలుదేరింది. ఇద్దరూ మరుక్షణంలో హాస్పిటల్ ముందు రిక్షా దిగారు.

రూము నెంబరు ఎనిమిదికోసం వెదుకుతూ నడుస్తున్నారు.

అవును—ఇదే ఎనిమిది.

లోపల అడుగు పెడుతూనే భార్గవి కంటబడిన దృశ్యం చూసి ఆశ్చర్యపోయింది.

ఇతను....ఇక్కడ....ఇదెలా సాధ్యం ! బావగారు అంత ఆప్యాయంగా అతని చేయిపట్టుకొని మాట్లాడుతున్నారు ఎందుకని....

ఇద్దరూ లోపలికి అడుగు పెట్టగానే వాళ్ళు మాట్లాడుకోవటం ఆపేశారు.

అక్కని చూసిన బావ ఆనంద్ మొహంలో శతకోటి దీపకాంతులు....ఆపదల్లో అయినవారి రాకకన్నా ఆనంధం వుండదేమో !

"ఏమండీ ! ఏమిటిదంతా !" దగ్గరికివెళ్ళిన అరుణ కళ్ళనిండా నీళ్ళు.

కాలికీ, చేతికీ బ్యాండేజీతోవున్న బావని చూస్తే భార్గవి మనసు బాధతో నిండిపోయింది.

"ఎందుకేడుస్తావు పిచ్చీ! భగవంతుడు మనని చల్లగా చూడబట్టి....కొద్దిలో తప్పిపోయింది. కొద్దిగానే గాయాలు తగిలాయి. త్వరలోనే తగ్గిపోతాయి. దిగులు పడకు" భార్య తలపై ఎడమచేయివేసి నిమిరాడు ఆనంద్.

"ఏమ్మా భార్గవీ! టెలిగ్రాం అందిందా! మీ అక్కకి కొంచెం ధైర్యం చెప్పు" ఆనంద్ అలా అంటే భార్గవికి కంటనీరు తిరిగింది.

"ఎలా జరిగిందండీ!" అడిగింది మెల్లగా.

"మామూలుగా ఆఫీసు కెళ్తున్నాను. టర్నింగ్‌లో ఎదురుగా వచ్చిన లారీ రాంగ్‌సైడ్‌లో వచ్చి కొట్టేసింది. నేను అప్పటికే తెలివిగా ప్రక్కకి తీయబట్టి సరిపోయింది. లేకపోతే మనిషినే కనపడకపోదునేమో! అన్నట్లు మరిచాను, ఇతను ప్రకాష్. ఇంతవరకు పరిచయం లేకపోయినా నాకు ప్రాణదానం చేసిన దేవుడు. ఈ యాక్సిడెంటులో రక్తం బాగా పోయిందట. నా గ్రూప్ బ్లడ్ దొరకలేదని డాక్టర్లు ఆదుర్దా పడ్డారట. ఇతని చుట్టాలెవరో ఈ హాస్పటల్లో వున్నారని చూడటానికి వచ్చి నా సంగతి తెలిసి తన రక్తం నా బ్లడ్ గ్రూప్‌కి సరిపోతే డొనేట్ చేశాడు. వీళ్ళది దగ్గర్లో ఊరే. ఈరోజు మళ్ళీ నన్ను చూసిపోవటానికి వచ్చాడు."

అంత నీరసంలోనూ ప్రకాష్ గురించి ఆనంద్ అనర్గళంగా పొగుడుతున్నాడు కృతజ్ఞతాభారంతో.

భార్గవికి చెవులు పనిచేయటం మానేశాయి.

"ఇతను ఇంత సహృదయుడా! ఇంతటి మానవతా మూర్తా! తనెంత నీచంగా అంచనా వేసింది! మనిషి ఆకారాన్ని బట్టి గుణాలు ఊహించటం ఎంత పొరపాటు!" భార్గవి మనసులో అతన్ని గురించిన ఆలోచనలు ముసురుకున్నాయి. అతనికేసి కృతజ్ఞతగా చూసింది.

ఆతను మళ్ళీ అదే నవ్వు నవ్వాడు.

కానీ భార్గవికి ఇప్పుడా నవ్వు కోపం తెప్పించటలేదు. మలయమారుతంలా చల్లగా హాయినిచ్చింది.

'మీకు నా కృతజ్ఞతలెలా చెప్పాలో తెలీటం లేదండీ! ఆజన్మాంతం మీకు ఋణపడి వుంటాము." అరుణ ప్రకాష్‌తో అనే మాటలు భార్గవి కళ్ళతోనే పలికించింది, అతనివైపు ఆరాధనగా చూస్తూ.

("ఆంధ్రభూమి" వారపత్రిక)

# ప్రేమ

"సేవాశ్రమం" అక్షరాలు ఎండలో మెరుస్తున్నాయి.

కందిపోయిన మొహాన చిరుచెమటను తుడుచుకుంటూ లోనికి వచ్చింది సీత.

బాబాజీ దైవ ధ్యానంలో ఉన్నారు. ఒక్క క్షణం కళ్ళుమూసుకొని నమస్కరించి తన గదిలోకి వెళ్ళింది. పుస్తకాలు అలమరులో పెట్టి కుర్చీలో కూలబడింది.

ఇంతలో ప్రార్థన బెల్లు మ్రోగింది. సీతకు లేవక తప్పలేదు.

అంతా లైన్లలో నిలబడ్డారు.

బాబాజీ చెపుతున్నారు "తోటి మానవుడిపై ప్రేమ చూపగలిగే జీవితాలు ధన్యం! అందరు తోటి మానవుని సోదరునిగా భావించగలగాలి."

సీత మనస్సు అనిర్వచనీయమైన ఆనందంతో నిండిపోయింది.

"రాత్రంతా చదివితేగానీ రేపటి పరీక్ష బాగా రాయలేను" అనుకుంటూ హిస్టరీ నోట్సు తీసింది.

క్రింద ఏదో పడిందని గ్రహించి వంగి తీసింది.

"నేను నిన్ను ప్రేమిస్తున్నాను" రవి సంతకం వుంది.

నిన్న హిస్టరీ నోట్సు అడిగి తీసుకుని ఈరోజు ఇచ్చిన రవి నోట్సులో పెట్టి ఇచ్చాడు ఈ కాగితాన్ని.

"నేను కూడా నిన్ను ప్రేమిస్తున్నాను" అని సీత దానిపై సమాధానం వ్రాసింది.

మర్నాడు కాలేజీ లైబ్రరీలో కలసిన మోహన్‌ను చూసి చిరునవ్వు నవ్వింది సీత. ఒక కాగితాన్ని అతనికి ఇచ్చింది.

ఇంటర్వెల్‌లో రవి ఎదురయ్యాడు. అతనికి తను వ్రాసిన సమాధానం అందించింది.

క్యాంటిన్‌లో నిలబడ్డ రవి దగ్గరికి మోహన్ వచ్చాడు.

మోహన్ "ఐయామ్ సో లక్కీ! సీత వ్రాసింది చూశావా!" అంటూ చూపించాడు.

రవి అవాక్కయిపోయాడు. "నాకు కూడా ఇచ్చిందే!" అంటూ చూపించాడు.

ఇద్దరూ సీత తమని ఫూల్ చేసిందని పళ్ళు కొరుక్కున్నారు.

"శాస్తి చేయాల్సిందే" పిడికిలి బిగించాడు రవి.

సీత కాలేజీ వదలగానే ఆశ్రమం దారిపట్టింది.

ఆమె వెనగ్గా ఒక కారు దూసుకు వచ్చింది.

కారు ఆగటం, మోహన్ సీత నోరునొక్కి లోపలికి గుంజుకోవటం, తిరిగి కారు కదలిపోవటం, అంతా క్షణాల్లో జరిగింది.

కిరణ్ ఇది గమనించి ఆశ్చర్యపోయాడు. ఆశ్రమానికి వెళ్ళి సీతను పెళ్ళిచేసుకుంటానని బాబాజీతో చెప్పాలని వస్తున్నాడు కిరణ్. క్షణంసేపు మెదడు పనిచేయలేదు. ఇంతలో ఖాళీ టాక్సీ కనపడగానే ఆపాడు. మోహన్ కారును ఫాలో అయ్యాడు.

మోహన్ కారు ఊరిబయట శిథిలమైన మేడదగ్గర ఆగింది.

మోహన్, రవి ఇద్దరూ దిగి సీతను పెడరెక్కలు విరిచి లోనికి తీసుకెళ్ళారు.

కిరణ్ టాక్సీ ఆపి తాను మెల్లగా లోనికి నడిచాడు. స్తంభం వెనక నక్కి ఏం జరుగుతుందా అని చూశాడు.

సీత స్తంభానికి కట్టేసి వుంది.

"ఏం సీతా ! ఇప్పుడేమంటావు" వ్యంగ్యంగా నవ్వాడు రవి.

ప్రశాంతంగా నవ్వింది సీత.

"మా ఇద్దర్నీ ప్రేమిస్తున్నానని మోసం చేస్తావా ? జీవితాంతం గుర్తుండేలా నీకు పరాభవం చేస్తాను" రవి కట్లూడదీసి ఆమెపైకి వంగాడు.

పులిలా ఉరికాడు కిరణ్. బలిష్టుడయిన కిరణ్‌ముందు ఆ ఇద్దరూ ఆగలేకపోయారు. పిక్కబలం చూపారు.

సీత కట్లు విప్పి బయటకు నడిచాడు కిరణ్, ఆమె అతన్ని అనుసరించింది.

మర్నాడు ప్రిన్సిపాల్ రమ్మన్న కబురు విని రూంలోకి అడుగుపెట్టింది సీత.

ఎదురుగావున్న రవి, మోహన్‌లను చూసి చిరునవ్వు నవ్వింది.

అర్థంగాని రవీ, మోహన్ ఒకరి మొహం ఒకరు చూసుకున్నారు.

"సీతా ! ఇది నీవు వ్రాసిన ఉత్తరమేనా ?" ప్రిన్సిపాల్ సీత రవికి వ్రాసినది చూపాడు.

"యస్ సర్" నమ్రతగా పలికింది సీత స్వరం.

"ఇది...." ఇంకొకటి చూపారాయన. అది మోహన్‌కి వ్రాసింది.

"అవునండీ"

"ఇద్దరికీ ప్రేమిస్తున్నట్లు వ్రాశావు. అంటే నీ ఉద్దేశ్యం ?" తీవ్రంగా ఉందాయన స్వరం.

"అవును సర్ ! రవిని మోహన్‌ని ఇప్పటికీ నేను ప్రేమిస్తున్నాను—మిమ్మల్ని కూడా !" స్థిరంగా వుంది సీత స్వరం.

"వ్వాట్" అదిరిపడ్డారాయన.

"అవునండీ....చిన్నతనంలోనే అనాథనై బాబాజీ సంరక్షణలోనే పెరిగిన నాకు ప్రేమించటం తప్ప ద్వేషించటం తెలియదు—వాళ్ళిద్దరూ నన్ను ప్రేమిస్తున్నారని వ్రాస్తే నేనూ నా మనసులోని మాట వ్రాశాను. తోటి మానవులందరూ ప్రేమార్హులే !" ప్రశాంత ఝరిలా సాగింది సీత వాక్ప్రవాహం.

సీత మాటలు విన్న రవి, మోహన్ ఇద్దరూ పశ్చాత్తాపంతో కుంగిపోయారు.

"అర్థమయిందా మీకు ! కనిపించిన ప్రతి ఆడపిల్లను కామదృష్టితో చూసే మీకు ప్రేమ విలువ ఏం తెలుస్తుంది !" అన్నారు ప్రిన్సిపాల్, వారివంక ఏహ్యంగా చూస్తూ.

"మమ్మల్ని క్షమించు సీతా ! సార్ మీరు కూడా ! వుయ్ ఆర్ వెరీ సారీ ! చెల్లెలిలాంటి సీతకు....ద్రోహం చెయ్యబోయాం" కన్నీళ్ళు జలజల వర్షించాయి.

"అదేంటి రవీ ! మనలో మనకు క్షమార్పణలేమిటి, వస్తాను సార్ !" అని చేతులు జోడించి బయటకు నడిచింది సీత.

వెళ్తున్న ఆమెవంక గౌరవంగా చూశారు మిగిలిన ముగ్గురూ.

సేవాసదనంముందు పెళ్ళిపందిరి పవిత్రంగా వుంది. సన్నాయి సుమధురంగా మ్రోగుతోంది. పట్టుచీరెల రెప రెపలు, తాటియాకుల గరగరలమధ్య బాబాజీ ఆశీర్వాదంతో ఆదర్శయువకుడైన కిరణ్ కానీ కట్నం ఆశించక సీతను స్వంతం చేసుకున్నాడు.

రవి మోహన్‌లు ఆనందంగా అక్షింతలు చల్లారు.

సీత కళ్ళలోని మరో ప్రేమ, కిరణ్ కళ్ళలో కలిసి చూపరులకు కనువిందు కల్గించింది.

( 'అనామిక' మాసపత్రిక )

# తొలగిన చీకటి

"పద్మా! చిన్నికెలా ఉంది..." ఆఫీసుకు వెళ్తూ అడిగాడు భాస్కర్.

" కొంచెం వళ్ళు వెచ్చబడిందండీ ! "

" సాయంత్రం నేను వచ్చాక డాక్టరు దగ్గరకి తీసుకు వెళ్దాము. అన్నం పెట్టకు " అంటూ హడావుడిగా వెళ్ళాడు భాస్కర్.

పద్మకు భోజనం చేయాలనిపించలేదు.

చిన్ని నీరసంగా పడుకుంది. మధ్య మధ్య 'అమ్మా!' అని పిలుస్తున్నది. శ్వాస ఆడనట్లు ఇబ్బందిగా కదుల్తున్నది.

" అమ్మాయ్ పద్మా! భోజనం అయిందా " పక్కింటి పిన్నిగారొచ్చింది. ఆవిడ అప్పుడప్పుడు అలావచ్చి పద్మతో బాతాఖానీ వేస్తుంటుంది.

" ఏమిటి? చిన్ని అలా పడుకుంది....వంట్లో బాగా లేదా ! " అడిగిందావిడ.

" అవునండీ జ్వరం ఎక్కువగా లేదు కానీ ఉండుండి ఎగిరి పడ్తున్నట్లుంది. ఊపిరి బరువుగా తీస్తుంది " పద్మ భయం దుఃఖం కలిగిన గొంతుతో చెప్పింది.

ఆమె చిన్ని దగ్గరికి వచ్చి చూసి పద్మని పిలిచింది.

" ఇలా వుంటే ఇంకా ఇంట్లో పడుకోబెట్టావా....? " అధికారంగా అడిగింది.

" ఏం చేయమంటారండీ ! నాకు ఈవూరు కొత్త ఆయన ఆఫీసునుంచి వచ్చాక డాక్టరుదగ్గర కెళ్దామన్నారు."

" డాక్టరెందుకే పిచ్చి మొహమా ! పిల్ల దడుచుకుంటేనూ" ఆమె రాగం తీసింది.

పద్మకు నిజమే ననిపించింది. నిన్న గంట మోగించుకుంటూ పగటి వేషగాళ్ళు పులివేషంలో వచ్చారు. చిన్ని చూసింది కూడా! ఆ విషయం పిన్నిగారితో చెప్పింది.

" నే చెప్పలా " ఆమె మాంత్రికుడి ప్రాణ రహస్యం తెలిసినట్లుగా నవ్వింది.

" ఎలా పిన్నిగారూ " పద్మ ఆత్రంగా అడిగింది.

విష్ణుమూర్తి అభయహస్తం ఇచ్చినట్లు పిన్నిగారు ఫోజుపెట్టి " ప్రక్క బజారులో తాయెత్తుల సాయెబున్నాడు. తీసుకెళ్దాం" అంది.

"ఇప్పుడేనా"

" నే నన్నం తినివస్తాను. ఈలోగా నీవూ తిను. ఒక్క మంత్రం వేశాడంటే పిల్ల పచ్చిమిరపకాయలాగా ఎగిరి ఆడుకుంటుంది"

ఆమె ఇచ్చిన భరోసాతో పద్మ అన్నం తిని పిన్నిగారితో కలసి పక్క బజారులోవున్న మంత్రాల సాయబు దగ్గరికి బయలుదేరింది.

చిన్నికి తగ్గించమని వెయ్యి దేముళ్ళకు మనసులో మొక్కుకుంది పద్మ.

పల్లెటూర్లో పుట్టి పెరిగిన పద్మ భాస్కర్‌ను చేసుకొని పట్టణానికి వచ్చినా లోకజ్ఞానం తెలియని అమాయకురాలు. ట్రాన్స్‌ఫర్ అయి క్రొత్త వూరు రావటం మరీ అయోమయమై పోయింది పద్మకు. చిన్నిమీద వెర్రి ఆపేక్ష ! ఎర్రని ఎండలో పిల్లనెత్తుకొని అలాగే నడిచింది. పిన్నిగారు జెండా కట్టిన ఒక పాక ముందు ఆగారు.

జనం కిక్కిరిసి వున్నారు.

వీలు వెంబడి లోపల కెళ్ళారిద్దరూ !

బారెడు తెల్లని గడ్డం, గళ్ళ లుంగీ, చొక్కా లేదు. మెళ్ళో రంగు రంగుల దారాలు, కుడిబుగ్గన నల్లని పులిపిరి కాయతో సాయబు ఆకారం....పద్మకే వణుకు పుట్టింది.

ఎవరో ముసలాయన ముగ్గురు పిల్లలను తెచ్చాడు. "ఈ బాబు నా మనవడు" అన్నాడాయన ఒక పిల్లవాడ్ని చూపిస్తూ.

"ఏం చేస్తున్నాడు ?" సాయబు ప్రశ్నించాడు. అతని గొంతుక విని పద్మ ఉలిక్కిపడి సర్దుకు కూర్చుంది.

"స్కూలుకు వెళ్ళనని ఏడుస్తున్నాడు" మొన్ననే చేర్చాము. సరిగా బడికివెళ్ళి చదువుకొనేట్టు తాయత్తు కట్టండి"

"ఏం బాబూ ! స్కూలు కెళ్ళవా ?" ఎఱ్ఱని తన కళ్ళతో పిల్లవాడికేసి సూటిగా చూస్తూ అడిగాడు సాయబు.

"వెళ్తానండీ" పిల్లవాడు భయంగా బదులిచ్చాడు.

"ఆ ! అట్లు ఉండాల" అంటూ సాయబు తన ప్రక్క నున్న సంచీలోంచి ఒక పొట్లం తీశాడు. విభూతి పిల్లవాడి నొసటికి రాసి మెళ్ళో రేకుముక్క వేళ్ళాడుతున్న రంగుల దారాన్ని కడుతూ ఏవో మంత్రాలు చదివాడు. తర్వాత పిల్లవాడికి బాగా చదువొస్తుంది పొమ్మన్నాడు.

మరో పాపను చూపించాడా ముసలాయన.

" అర్ధరాత్రి నిద్రలో కలవరిస్తుందండీ ".

"ఏం పాపా ! కలలొస్తున్నాయా" అంటూనే అంక్షే కట్టేశాడు మెళ్ళో. యథాప్రకారమైన తతంగంతో. మూడో

కుర్రాడు అల్లరి ఎక్కువ చేస్తున్నాడని ముసలాయన చెప్పాడు.

"ఏం బాబూ అల్లరి చేస్తావా"

సాయిబు ప్రశ్నకు కుర్రవాడు తాత వెనకాల దాగాడు.

ఇవతలకు లాగి అంక్ష కట్టాడు సాయిబు.

ముగ్గురికి ఒక్కొక్కరికి రెండు రూపాయల చొప్పున ఆరు రూపాయలు చెల్లించి బయటపడ్డాడు ముసలాయన.

పద్మ చిన్నిని చూపింది సాయిబుకు.

"ఇది నరదిష్టి. భయం....జడుపు" అంటూ అంక్ష ఒకటి చిన్ని మెళ్ళో కట్టి, "రేప్పొద్దుటికి తగ్గకపోతే రెండు రూపాయలు వాపసు ఇస్తాను" అన్నాడు డబ్బులు తీసుకుంటూ భరోసాగా.

పద్మ తేలికపడిన హృదయంతో తిరిగి వచ్చేసింది.

సాయంత్రం భాస్కర్ ఇంటికి రాగానే "చిన్నిని డాక్టరు దగ్గరకు తీసుకుపోదాం పద" అన్నాడు.

"వద్దులెండి. అంక్ష కట్టించాను" అంది పద్మ.

"అదేమిటి పద్మా! మంత్రాలకు చింతకాయలు రాల్తాయా? మరేం ఫర్వాలేదు. ఎందుకైనా మంచిది. ఒకసారి చూపిస్తే సరిపోతుంది" అంటూ చిన్నిని భుజాన వేసుకున్నాడు భాస్కర్.

దగ్గరలోనే వున్న డాక్టర్ దగ్గరకు తీసుకెళ్ళారు.

డాక్టరు చిన్నిని పరీక్ష చేస్తూనే ఆందోళనగా "ఇలా మొదలయి ఎంత సేపయింది" అడిగాడు.

"పొద్దున ఎనిమిదింటికి" పద్మ చెప్పింది.

"ఇవ్వటిదాకా ఏం చేస్తున్నారు.? సిస్టర్ ! ఆపరేషన్‌కి రెడీ చేయి" అని అందరికీ ఆర్డర్లివ్వసాగాడు.

పద్మ భయపడటం చూసిన డాక్టరు "మరేం ఫర్వా లేదమ్మా ! డిఫ్తీరియా. వెంటనే ఆపరేషన్ చేస్తే సరి పోతుంది. మీరు సమయం మించిపోకుండా తెచ్చారు. కాబట్టి భయపడ నవసరం లేదు" అన్నాడు. పద్మ వణికి పోయింది "సాయిబు మాటలు విని వూరుకునుంటే చిన్ని బ్రతుకేమయ్యేదో" అని.

ఆపరేషన్ సక్సెస్ అయిందని తెలిసాక పద్మ మనసు కుదుటపడింది.

"చూశావా పద్మా ! ఎప్పుడూ మూఢ నమ్మకాలతో వైద్యాన్ని మానకూడదు. డాక్టర్‌గార్కి చూపబట్టి సరి పోయింది" అన్నాడు భాస్కర్ అనునయంగా. "నిజమే నండీ ! అటువంటివి నమ్మటం నాదే పొరపాటు. కొంచెంలో ఎంత ప్రమాదం తప్పిపోయింది." నిద్రపోతున్న చిన్ని నుదుటిపై ప్రేమగా ముద్దుపెట్టుకుంది పద్మ. ●

('మహిళ' మాసపత్రిక)

# పరిష్కారం

'ఇప్పుడేం చేయాలండీ' దిగులుగా అన్నది శాంతి.

" ఏదో ఒకటి చేద్దాంలే! అంతగా అయితే నువ్వు కొన్నాళ్ళు లీవ్ పెట్టుకుందువుగానిలే " సర్దిచెప్పాడు సుబ్బారావు.

" లీవ్ కూడా లేదండీ నాకు....అంతా లాస్ ఆఫ్ పే అవుతుంది. అసలే సరిపోని జీతాలతో నడుపుతున్నాం సంసారం " బాబు తడుపుకున్న డ్రాయరు తీసి ఇంకొకటి వేస్తూ అంది శాంతి.

" పనిమనుషులు నమ్మకమైన వాళ్ళు దొరికితే.... ఫరవాలేదు " కొంచెం సేపాగి మళ్ళీ అంది తనే.

" మా ఫ్రెండ్ మోహన్‌రావుకి చెప్పాను. చూస్తానన్నాడు. ఎవరో ఒకావిడ ఉందిట రేపు ఏ సంగతీ చెప్తానన్నాడు. కనుక్కుంటాను మళ్ళీ...." భార్యను సమాధాన పరిచాడు సుబ్బారావు.

"ఏమైనా కూరలు తీసుకురండి" సంచి అందించింది శాంతి. దగ్గర్లోనే ఉన్న కూరల కొట్టుకు బయలు దేరాడు సుబ్బారావు. అలా వెళ్తున్న భర్తవంకే చూస్తుండిపోయింది శాంతి. పెళ్ళప్పుడు ఎంత బాగుండేవారు! ఇప్పుడు బాగా చిక్కి నల్లబడిపోయారు.

పెళ్ళయి హైదరాబాదులో కాపురం పెట్టిననాడు ఎన్ని అందమైన కలలుకన్నారు. ఆ రోజులు ఎంత మధురమైనవి. తను ఉద్యోగంలో చేరాలని ఆలోచించిన రోజు గుర్తు కొచ్చింది శాంతికి....

  

" నేను కూడా ఉద్యోగంలో చేరతానండీ...." అంది భర్తదగ్గర చేరి మెల్లగా శాంతి.

" వద్దులే శాంతీ! హాయిగా ఇంట్లో ఉండి నన్ను చూసుకోవాలు " లాలనగా భార్యచేయి తన చేతిలోకి తీసుకొని అన్నాడు సుబ్బారావు.

" అదికాదండీ! మనం ఎల్లకాలం ఇలాగే ఉంటామా! ఇద్దరికి ముగ్గురం, నల్గురం కామా! అప్పుడు మీ ఒక్కరి సంపాదనలో మనం హాయిగా బతకటం కష్టమౌతుంది. మీ నాన్నగార్కి మీరు పంపే డబ్బులు పంపలేకపోతే వాళ్ళు

బాధపడతారు. అలాగని మీ ఉద్యోగాన్ని చిన్న చూపు చూస్తున్నాననుకోవద్దు. ధరలు ఆకాశాన్నంటే ఈ రోజుల్లో ఆడవాళ్ళు ఉద్యోగం చేయటం తప్పేమీ కాదండీ" శాంతి మనసువిప్పి చెప్పింది.

"నువ్వేమైనా చెప్పు శాంతీ హాయిగా ఇంట్లో తిని కూర్చోక నీకీ పాట్లెందుకు చెప్పు. నాకిష్టంలేదు"

"మరోసారి ఆలోచించండి ప్లీజ్! మా ఫ్రెండ్ లలిత నిన్న బజారులో కన్పించి చెప్పింది. వాళ్ళ ఫరంలో స్టెనో పోస్టు ఖాళీగా ఉందట. నేనిష్టపడితే వాళ్ళ మేనేజరుకుచెప్పి ఇప్పిస్తుందట. నెలతిరిగేసరికి ఐదొందలు చేతిలో పడతాయి" ఉత్సాహంగా చెప్పుకుపోతోంది శాంతి.

"ఎన్నో వస్తువులు కొనుక్కోవచ్చు. అందరిలాగా డబ్బు ఇబ్బందులు ఉండవు. అంతగా అయితే ఎప్పుడు చేయలేననిపిస్తే అప్పుడు మానేస్తాను." భర్తకు నచ్చ జెప్పింది శాంతి. ఆమె మాటల్లో ఎలాగైనా భర్తని ఒప్పించాలనే తాపత్రయం కన్పించింది.

ఆలోచించాడు సుబ్బారావు.

తనకొచ్చే ఆరొందల్లో తండ్రికి కొంత పంపగా మిగిలిన దానిలో ఇంటి ఖర్చులకు పోను....పాతికో ముప్పయ్యో మిగుల్తున్నాయి. నెలాఖరులో అప్పులు తప్పటంలేదు. శాంతి కూడా ఉద్యోగం చేస్తే వేణ్ణీళ్ళకు

చన్నీళ్ళు తోడుగా పరిస్థితి కొంత మెరుగు పడవచ్చు! చెల్లెలి పెళ్ళి ఈ సంవత్సరంలో చేయవచ్చు. అయిష్టంగా ఒప్పుకున్నాడు భార్య ఆలోచనను.

చిన్నపిల్లలా సంబరపడింది శాంతి.

  

కాలచక్రం తన పరిభ్రమణాన్ని కొనసాగిస్తూనే ఉంది.

శాంతి ఉద్యోగంలో ప్రవేశించి నెలయింది. మొదటి జీతంతో ఇంటికి వచ్చింది.

ఆమె ఊహలు రెక్కలు కట్టుకొని ఆకాశంలో విహరిస్తున్నాయి. అందమైన దృశ్యాలు ఆకారం ధరించి ఆమె కళ్ళముందు నాట్యమాడుతున్నాయి.

ప్రపంచాన్ని గెలిచిన మహారాణిలా ఉందామె మనస్సు.

భర్తమొహంలో వెల్లివిరిసే ఆనందాన్ని చూడాలి. ఆయనబట్టలు బాగా పాతబడిపోయాయి. ఆ నీలం చారల చొక్కా సన్నగా చిరుగుపట్టిందికూడా! రేపు వెళ్ళి ఆయనకు రెండు జతల బట్టలు తీసుకోవాలి.

గుమ్మంలోకి వస్తూనే మంచం మీద పడుకున్న సుబ్బారావు వాలకం చూడగానే ఆమె ఉత్సాహపుపొంగు చల్లారిపోయింది!

బ్యాగు పడేసి కాళ్ళు చేతులు కడుక్కొని వచ్చింది.

"ఏమండీ!" మెల్లగా పిలిచింది.

'ఆ....' నూతిలోంచి వచ్చినట్లుందాతని స్వరం.

"ఏమిటలా ఉన్నారు? వంట్లో బాగాలేదా...." నుదుటిమీద చేయివేసి చూసింది.

"వేడిగాలేదే! జ్వరమేమీ ఉన్నట్లుగాలేదు" తనలో తాను అనుకున్నట్లుగా అన్నది.

"ఏమీ లేదులే! తలనొప్పిగా ఉంది. కాఫీ ఇస్తావా"
"క్షణంలో తెస్తాను" అంటూ వంటింట్లోకి నడిచింది ఆమె. ఇచ్చిన కాఫీ తాగేసి మళ్ళీ అలాగేపడుకున్నాడు అతను. దేనిగురించో బాధపడుతున్నట్లుగా అన్పించింది శాంతికి.

వంటముగించి భోజనాలయ్యాక ఆలోచిస్తున్న అతని దగ్గరికి వచ్చింది. దిండులోకి మొహం దూర్చి బోర్లా పడుకున్న అతని జుట్టులోకి వేళ్ళు పోనిచ్చి నిమురుతూ "నాతో చెప్పరూ .... ఎందుకలా ఉన్నారు?" అనునయించింది.

"ఏమీ లేదు" అటు తిరిగి పడుకున్నాడు తను కాసేపలాగే కూర్చుండిపోయింది. మళ్ళీ కర్తవ్యం గుర్తు కొచ్చింది. "మీ బాధలో పాలుపంచుకునే నాకు కూడా చెప్పడం ఇష్టం లేకపోతే వద్దులెండి...." నిష్ఠురంగా అంది.

"అది కాదు శాంతీ! నాన్న వ్రాసిన ఉత్తరంచూడు! నేనేమన్నా వేలు మూటగట్టుకుంటున్నానా! అన్నయ్య అసలు పట్టించుకోడు. నేను మాత్రం ఎక్కడ్నుంచి తేవాలి అంత డబ్బు? కాస్తాకూస్తాకాదు ఏడు వేలట."

"ఆదా సంగతి దానికింత దిగు లెందుకు....అయినా ఇప్పుడంత డబ్బు ఎందుకుట."

"మా చెల్లెలు లక్ష్మికి పెళ్ళికుదిరిందట .... కట్నం ఎనిమిది వేలు, పైన పెళ్ళి ఖర్చు. నన్ను కనీసం ఏడెనిమిది వేలయినా సర్దమని వ్రాశారు."

"ఆయన పెద్దవారై పోయారు. ఉన్న ఒక్కపిల్ల పెళ్ళిచేస్తే బాధ్యత తీరిపోతుందని చూస్తున్నారు. మీ అన్నయ్య పట్టించుకోలేదని మీరుకూడా అలా అంటే ఎలా...? మనిద్దరం సంపాదిస్తున్నాం. అప్పు చేసి ఇద్దాము. తీర్చు కోలేకపోములెండి" భర్తకి ధైర్యం చెప్పింది.

ఆమె దేవతలా కన్పించిందా క్షణంలో. వడ్డీకి అప్పుచేసి ఆమె జీతంతో సహా పంపాడు తండ్రికి.

మొదటి నెల జీతమే ఇలా కావటం శాంతికి కొంచెం బాధకలిగినా బాధ్యతలు గుర్తు చేసుకొని సరిపెట్టుకుంది.

ఆ తర్వాత ప్రతి నెల జీతం మార్వాడీ వడ్డీకే సరిపోతున్నది.

ఇద్దరూ సంపాదిస్తున్నారనగానే చుట్టూ ఉన్నవాళ్ళకి కూడా కోరికలు పెరుగుతాయి. అదే ఒక్కరి సంపాదన యితే "ఒంటరి సంపాదన...ఏంమిగులుతుంది పాపం!" అంటూ సానుభూతి ప్రకటిస్తారు.

శాంతికిప్పుడసలు తీరికే లేకుండాపోయింది. యాంత్రికంగా ప్రొద్దున్నే లేచి పనులన్నీ పూర్తిచేసుకోవటం, టిఫిన్ బాక్సులో పెట్టుకొని బయటపడితే మళ్ళీ సాయంత్రం ఐదున్నరదాకా ఆఫీసరు దూర్వాసుడికి భయపడటం సరిపోతుంది. ఇంటికి వచ్చాక మళ్ళీ వంటపని....భోజనాలయే సరికి రాత్రి పదవుతోంది.

వళ్ళంతా పులిసినట్లయి నిద్ర ముంచుకువస్తుంది. సుబ్బారావు దగ్గరిగా వచ్చినా ఆమెలో ఏ స్పందనా ఉండటంలేదు.

ఎంత త్వరగా నిద్రపోతానా అని ఎదురు చూసి అతని అవసరం తీరగానే నిద్రాదేవి వడిలో వరిగిపోతున్నది.

ఒక్కోసారి తీరిగ్గా ఆలోచిస్తే "తను ఎవరికోసం ఇంతకష్టపడుతున్నది? నెలంతా కష్టపడితే వచ్చే ఫల

పేఃమిటి 'తనవారికోసం శ్రమిస్తున్నదనుకుంటే వాళ్ళకి తన శ్రమపట్ల గుర్తింపులేదు సరిగదా నిందలు నిష్ఠూరాలు ఎక్కువవుతున్నాయి. తన పరిస్థితిలో ఏదైనా మార్పు ఉందా అంటే అదీలేదు. అవే ఐదారు చీరలు....అదే చైను మెళ్ళో.... అంతా అదే జీవితం "

శారీరక శ్రమ మానసిక సంఘర్షణల మధ్య నలిగి పోయే శాంతి సుకుమార హృదయాన్ని అర్థంచేసుకునేటంత చురుకైనవాడుకాదు సుబ్బారావు.

పోనీ ఇప్పుడీ ఉద్యోగం మానేద్దామంటే భర్త నెత్తిన తను ప్రోత్సహించి దించిన అప్పు భారం తగ్గేదెలా .... ? భర్త జీతంతో ఇల్లు గడవటమే కష్టంగా ఉంటే తన మందులు వేవిళ్ళ బాధలు అన్నీ తీరేదెలా ?

'ఇద్దరూ సంపాదిస్తున్నారుకదా ! ఇంకో వంద ఎక్కువ పంపించండి ' అని రాశాడు సుబ్బారావు తండ్రి.

అది శాంతికి చూపి తలపట్టుకున్నాడు సుబ్బారావు. ఏమీ మాట్లాడలేకపోయింది శాంతి. ఆడబడుచు పెళ్ళి బాకీలే ఇంకా తీరలేదని ఎలా రాస్తుంది ? అయినా వాళ్ళది సక్రమంగా అర్థం చేసుకుంటే ఇంక లేనిదేముంది....

ఉద్యోగంలో చేరాక మనశ్శాంతి కరువయినట్లయింది బాబు పుట్టాక శాంతికి ఇంకొక కొత్త సమస్య వచ్చిపడింది.

మూడు నెలలయాక మళ్ళీ ఆఫీసుకు వెళ్ళాల్సి ఉంది. ఇంట్లో బాబును చూసేవాళ్ళెవరు! అమ్మ ఉంటే ఇంత సమస్య ఉండేది కాదు. చిన్నప్పుడే దాటిపోయిన తల్లిని తలుచుకొంది శాంతి. అత్తగారి దగ్గర ఉంచుదామంటే 'నా ఆరోగ్యం బాగాలేదని' ఆవిడ వ్రాసిన వాక్యం అడ్డు పడింది.

తన డబ్బులు కావాలిగానీ తన బాధలెవరికి కావాలి...!

పనిమనిషిని బ్రతిమిలాడి తను ఆఫీసు కెళ్ళిన టైములో బాబును చూడటానికి అరపై రూపాయలకి వప్పించింది.

రిలీఫ్‌గా ఫీలయింది.

బాబుతో పెరిగిన బడ్జెట్ చూసి గాభరా పడినా తప్పించుకోగలిగిన వేమీ లేవందులో.

'శాంతీ! రోజురోజుకూ బాబు వీక్‌గా తయారవుతున్నా డెందుకు.'

"అవునండీ! నేను కూడా అదే అనుకుంటున్నాను" తన అభిప్రాయం కూడా బయట పెట్టింది.

ఇద్దరూ దగ్గర్లోనే ఉన్న పిల్లల డాక్టరు దగ్గరికి తీసికెళ్ళి పాతిక రూపాయలు ఫీజు ఇచ్చుకున్నాక వాడికి ఆహారం వేళకి సరిగా కడుపు నిండా పడటంలేదని తేల్చి చెప్పాడు డాక్టరు.

శాంతి కళ్ళలో నీళ్ళూరాయి.

" తన బిడ్డను సరిగా చూసుకునే అదృష్టం కూడా లేకుండాపోయింది. వెధవ ఉద్యోగం గుదిబండ లాగా తయారయింది " మనసులోనే తిట్టుకుంది శాంతి. ఇంటి కొచ్చి పనిమనిషి మీద తన కోపం చూపించింది.

" నేను మీరు చెప్పినట్టే పాలు పట్టానమ్మా " అనే దాని మాటల్లో రవంతైనా నిజాయితీ కన్పించలేదు.

దాన్ని మాన్పించింది వెంటనే.

దిగులు పడే శాంతిని ఓదారుస్తున్నాడు సుబ్బారావు.

తన ఫ్రెండ్ మోహనరావు చెప్పిన మనిషిని తీసుకొచ్చారు.

ఓ రోజున.

ముప్పై ఏళ్ళుంటాయేమో! నల్లగా ఉన్నా శుభ్రంగా ఉంది.

ఆమెను చూసి తృప్తి పడింది శాంతి.

" మా బాబు కోసమే నిన్ను పెట్టుకోవటం. వాడికి వేళకి పాలు నీళ్ళు అన్నీ శ్రద్ధగా చూడాలి. ఎంతివ్వమంటావు....? " సూటిగా అడిగింది.

" మీ కంటే బాగా చూస్తాను. నా పని మీరే చూస్తారుగా వంద ఇప్పించండి "

అదిరిపడింది శాంతి.

" అంతివ్వ లేను ఎనభై ఇస్తాను. బాబును మాత్రం సరిగా చూడాలి. ఏ లోపం జరిగినా ఊరుకోను." నిర్మొహమాటంగా చెప్పింది ఆమె తల్లిహృదయం.

" పనిచూశాకే ఇవ్వండమ్మా .... నా కొడుకు కంటే ఎక్కువగా చూసుకొంటాను " ఆమె మాటలు అమృత ప్రాయంగా తోచాయి. ఆమె మీద నమ్మకంకూడా అప్పటి కప్పుడు పెరిగిపోయింది శాంతికి.

" నీ పేరు....? "

" ఎల్లమ్మండీ "

ఏ వేళకి ఏం చెయాలో బాబుపనులన్నీ విడమరిచి చెప్పింది శాంతి.

రోజులు మళ్ళీ నిశ్చింతగా దొర్లిపోతున్నాయి.

శాంతి జీతం ఆ నెలలోనే ఒక వంద పెరిగింది. శాంతి కిప్పుడు రిలీఫ్‌గానూ ఆనందంగానూ ఉంది.

ఆఫీసునుంచి వచ్చి బట్టలు మార్చుకోగానే బాబు నెత్తుకోవటం శాంతి కలవాటు.

ఆ రోజెందుకో బాబు చాలా నీరసంగా ఉన్నాడు.

" నాది ఊరికే అనుమానమేమో! నిద్రవచ్చిందేమో పాలు పట్టి నిద్రపుచ్చితే అలసినట్లుగా నిద్ర పోయాడు వెంటనే.

అప్పుడప్పుడూ అలాగే ఉంటున్నా ఎందుకో శాంతికి అర్థం కావటం లేదు.

ఆరోజు బుధవారం....

సాయంత్రం ఇంటికొచ్చేసరికి ప్రక్కింటావిడ వాళ్ళ వీధి గుమ్మంలో నిలబడి ఉంది. నవ్వుతూ పలకరించింది శాంతిని.

నీరసంగా విసుగ్గా ఉన్నా మర్యాద కోసం నిలుచుని మాట్లాడుతోంది శాంతి.

త్వరగా ఇంట్లోకి వెళ్ళి కాఫీతాగాలనిపిస్తున్నది.

"మీబాబెందుకోనండి! అంతగా గుక్కపట్టి ఏడ్చాడు మధ్యాహ్నం" "ఏమోనండీ: నేను ఇంట్లో లేనుగా: ఎల్లమ్మ లేదా...." "ఉన్నట్లే ఉంది. ఆవిడ కోసం ఎవరో ఒకతను వచ్చాడు. అతనితో మాటల్లోపడి పట్టించుకోలేదేమో! అయినా అతను అప్పుడప్పుడూ వస్తున్నాడు. అతను వచ్చినపుడల్లా మీ బాబుకు భయమేమో !....అంత ఏడుస్తున్నాడు." ఆవిడ మాటలు శాంతి మనసులో తెలీని కల్లోలాన్ని సృష్టించాయి.

"అతను ఏటైములో వస్తాడు....ఎలా ఉంటాడు"

"ప్రతి బుధవారం వస్తున్నట్లున్నాడండీ"

"అలాగా.... వస్తానండీ...." సాలోచనగా కదిలింది శాంతి.

ఇంట్లోకి వస్తూనే ఎల్లమ్మతో—

"మధ్యాహ్నం బాబు ఎందుకు గుక్కపట్టి చాలా సేపు ఏడ్చాడు" తీక్షణంగా అడిగింది.

"లేదమ్మా! కొద్దిసేపే! ఆకలేస్తే పాలు కలిపేలోగా ఏడ్చాడు" కంగారుగా బదులిచ్చింది ఎల్లమ్మ

ఆ విషయం గురించి ఇంక తర్కించదలుచుకోలేదు శాంతి. ఆరోజుకూడా బాబు చాలా నీరసంగా ఉన్నట్లు గమనించిందామె. కొంచం జ్వరం కూడా వచ్చినట్లుంది. పాలు అసలు తాగలేదు.

మళ్ళీ బుధవారం వచ్చింది.

సుబ్బారావూ, శాంతీ యధావిధిగా ఎల్లమ్మకు అన్నీ అప్పగించేసి ఇంట్లోంచి బయటపడ్డారు.

మధ్యాహ్నం రెండు గంటలయింది.

దాదాపు నలభై ఏళ్ళ వయసున్న నల్లటి మగమనిషి ఆ ఇంటి గేటు తీసుకొని లోపలికి వచ్చాడు. గిరజాలజుట్టు, మెలితిప్పిన మీసాలతో పుష్టిగా పెరిగిన కండలతో బలంగా ఉన్నాడు.

గేటు చప్పుడు కాగానే ఎల్లమ్మ బాబు నెత్తుకొని బయటికి వచ్చింది.

అతన్ని చూడగానే ఎల్లమ్మ కళ్లలో కోటిదీపాల కాంతులు.

అతను వస్తూనే 'ఏమోయ్ : కులాసా' అంటూ బాబుని పలకరించాడు.

వాణ్ణి చూస్తూనే బాబు భయంతో కళ్ళు పత్తికాయల్లా చేసి బిక్కమొహం వేసుకొని తలతిప్పుకొని ఎల్లమ్మ భుజాన్ని కరుచుకున్నాడు.

"వీడు నన్ను చూసి భయపడుతున్నాడే" అతను లోపలికివస్తూ ఎల్లమ్మ బుగ్గపై చిటికేశాడు

"వాడి మొహం...." అంటూ బాబును మంచంమీద పడుకోబెట్టింది ఎల్లమ్మ.

అతను మోటుగా ఎల్లమ్మను కౌగిలించుకోబోయాడు

'ఛీ' ఇప్పుడేమిటి వదులు....రాత్రికి....' ఆమె ముద్దుగా విసుక్కుంది

అతనామెనోసారి ముద్దుపెట్టుకొని వదిలేశాడు

తర్వాత ఇద్దరూ బిస్కెట్లుతిని బత్తాయిరసం తాగారు.

అతను బాబువైపు అడుగులు వేస్తుంటే బాబు నిస్సహాయంగా పులినోటపడబోయే మేకలా గిజగిజలాడుతూ ఏడ్వసాగాడు. అతడు తన చేతిలోని సూదిని బాబు చేతికి గుచ్చి మెల్లగా కావలసినంత బ్లడ్ బాటిల్‌లోకి తీసుకున్నాడు.

అప్పటిదాకా బాబును కదలకుండా పట్టుకుంది ఎల్లమ్మ

ఆ పసివాడు చేసే ఆక్రందన....వాళ్ళ రాతి హృదయాన్ని కదిలించలేకపోయింది

తన పని పూర్తికాగానే ఎల్లమ్మ బాబును బుజాన వేసుకొని సముదాయించటానికి ప్రయత్నిస్తూ "మా యింటావిడ బాబు మధ్యాహ్నం బాగా ఏడుస్తున్నాడని ఆరాతీస్తోంది.... నాకేవిటో భయంగా ఉంది నువ్వికరావొద్దు" అంది భయం భయంగా.

"ఏంటే అంత భయపడతావ్ ! అంత తేలిగ్గా ఎవ్వరూ ఇది తెల్సుకోలేరు"

"మరి పైసలెప్పుడిస్తావ్"

"రాత్రికి వస్తావుగా....అవీ ఇవీ....అన్నీ ఒకే సారిస్తా" కొంటెగా నవ్వి బ్యాగ్ తీసుకొని తలుపుతీస్తూనే ఎదురుగా నిలబడిన వ్యక్తుల్ని చూసి నిర్ఘాంతపోయాడు

శాంతి విసురుగా లోపలికి వస్తూనే బాబును లాక్కొని గుండెలకు హత్తుకుంది. ఆమె హృదయం విపరీతంగా బాధపడి ఒళ్ళు తెలీటంలేదు. కన్నీరు జలజలా దూకుతోంది.

"రాక్షసీ ! ఎంతకి తెగించావు....నువ్వసలు ఆడదానివేనా ! అసలు మనిషివేనా....ఇలా సంపాదించే

నువ్వసలు బ్రతకటానికే వీల్లేదు...." ఎల్లమ్మ మీదికి ఆడ పులిలా ఉరికే శాంతిని వారించాడు సుబ్బారావు.

" నా చిట్టితండ్రిని నీలాంటి దగాకోరుకప్పగించి ఎంత తప్పు చేశాను " వాళ్ళని పోలీసులు తీసుకెళ్తుంటే ఆవేశపడింది శాంతి.

" డబ్బుకోసం ఎంత కక్కుర్తి పడింది " బాధపడే శాంతిని ఓదార్చాడు సుబ్బారావు బాధపడుతూనే

" నీలాంటి తల్లులు ఎంత మందో! ఉద్యోగంచేసే ప్రతి వాళ్ళకీ పిల్లల పోషణలో ఇలాంటి చేదు అనుభవాలు తప్పవు...." చల్లబరచటానికి ప్రయత్నించాడు.

మరికొన్ని నెలలకి ఆ ఇంటి ముంగిట్లో చాలామంది పిల్లలు రకరకాల వయస్సుల్లోని వాళ్ళు....నవ్వులు కేరింతలతో ఆడుకుంటున్నారు. వాళ్ళందరి పర్యవేక్షణ శాంతి చేస్తున్నది. ఆమె క్రింద నలుగురు ఆయాలు పనిచేస్తున్నారు. ఇంటి గేటుమీద " శిశువిహార్ " అనే బోర్డు వేలాడుతోంది. ఇదే ఆమె రెండు సమస్యలకీ పరిష్కారం....

శాంతి మనస్సిప్పుడెంతో ప్రశాంతంగా ఉన్నట్లు సంతోషంతో వెలిగే ఆమె వదనం చూస్తేనే తెలుస్తున్నది. ●

( ' ఆదివారం ' వారపత్రిక )

# గ్రహణం విడిచింది

సూర్యుడు నిద్ర లేస్తూనే ఆ రోజు కూడా మండిపడుతున్నట్లు చుర చురా చూస్తున్నాడు ప్రపంచాన్ని.

రామ్మూర్తి ఇంకా నిద్రపోవటం చూసి తన వాడిగోళ్ళు కిటికీలోంచి గుచ్చి నిద్రలేపాడు. రామ్మూర్తికి చిరాగ్గా మెలకువ వచ్చింది.

చుట్టూ పరిసరాలు చూశాక తనెక్కడున్నాడో తెలుసుకోవటానిక్కి ఇష్టం లేనట్లుగా కళ్ళు గట్టిగా మూసుకున్నాడు.

వంటింట్లోంచి గిన్నెల చప్పుడు కమల ఉనికిని తెలియజేస్తున్నది.

"అమ్మ! ఆ...." అంటున్న బుజ్జిగాడికి నిద్రమత్తును వదిలిస్తోంది.

" ఏడవకు నాన్నా! నాన్నకి మెలకువచ్చి కోపం చేస్తారు. ఏంకావాలి ఈ పాలు తాగు....ఆ....ఇంక ఆడు కోవాలి. బంగారు తండ్రిలా" వాడిని ఏడవనీయకుండా కమల సముదాయిస్తోంది.

రామ్మూర్తికి ఈ వాతావరణం నచ్చలేదు.

" ఛీ! ఛీ! నిద్రలేస్తూనే పాడుగోల! వెధవ సంత! మనశ్శాంతి లేదీ కొంపలో" విసుక్కుంటూ మంచం దిగాడు.

కమల ఆదుర్దాగా వచ్చి బ్రష్ మీద పేస్టు వేసి రామ్మూర్తికి ఇచ్చింది.

అతను మొహం కడుక్కొని వచ్చేలోగా బుజ్జిగాడిని వరండాలో నాలుగు బొమ్మలు ముందుపడేసి కూర్చొబెట్టి భర్తకి కాఫీ కలిపి రెడీగా తెచ్చింది.

కాఫీ రుచి చూస్తూనే మరింత మండి పడ్డాడు రామ్మూర్తి.

" ఇది కాఫీనా! నీ దరిద్రపు మొహంలాగే వుంది" రెండు గుక్కల్లో కషాయంలాగా మింగేసి పది నిమిషాల్లో స్నానం ముగించాడు. డ్రస్ చేసుకొని " నాకోసం వంట చేయకు" అని గోడతో చెప్పినట్లు అనేసి బయటపడ్డాడు.

ఈ తొందరేమిటో అర్థంకాక ఈ లోపానికి కారణం తెలియక కళ్ళల్లో పొంగే సముద్రాలకు చెలియలి కట్టలు

వేసుకుంటూ నిలబడిపోయింది. కమల త్వరత్వరగా నడిచి వెళ్ళే రామ్మూర్తి ఒక్కసారి వెనక్కి తిరిగి ఆమెను చూస్తే ముందుకు నడవలేకపోయేవాడే: కానీ అతను చూడలేదు.

ఏమిటీయన పరిస్థితి: ఎందుకిలా మారిపోయారు...? నిద్రలేస్తూనే తనని దగ్గరకు పిలిచి ప్రేమః గుర్తుగా ఒక ముద్దు అందిస్తే కాని మంచం దిగేవారు కాదే: "పాచి మొహంతోనే ఏమిటండీ ఇది" అంటే "నిద్రలేవగానే నీ మొహం చూడకపోతే తోచదోయ్ నాకు" అనేవారు. తను సిగ్గుతో మాట్లాడలేకపోయేది.

"ఇందులో సిగ్గు పడవలసిన దేముంది. మనం భార్యాభర్తలం. కానిపని చెయటం లేదు. పద డియర్" అంటూ ప్రతి పనికి తన వెంటనే ఉండి అల్లరి చేసే రామ్మూర్తి కేమయిందిప్పుడు....:

'స్నానం మీరు చేయండి. నేనెందుకు' అంటే.

"అదేమిటోయ్" అర్థాంగి నీవు లేనిదే పూర్తి స్నానమెలా అవుతుందీ అంటూ తనని లాక్కుని బాత్‌రూము తలుపు లోపల గడియ పెట్టేసేవారు.

బుజ్జిగాడు పుట్టబోయే ముందు ఎంత అపురూపంగా చూసుకున్నారు తనని. ప్రతి పనిలోనూ సాయం చేస్తూ: చిలిపి మాటలతో మరింత సిగ్గు పడేటట్లుగా చేసేవారు

పురిటికి అమ్మదగ్గరకు వెళ్తానంటే, 'ఇప్పుడే ఎందుకోయ్ : నువ్వు లేకపోతే నాకు తోచదు ' అంటూ ఉంచేసి చివరికి ఇక్కడే పురుడయ్యేటట్లు చేసి అమ్మను ఇక్కడకు పిలుచుకు వచ్చారు.

బుజ్జిగాడు పుట్టాక వాడి మీద ఆయన ప్రేమ చూస్తే తనకే ఈర్ష్య కలిగేది.

ప్రపంచంలో తన కొక్కడికే కొడుకు ఉన్నట్లు ఆయన చూపే అంతులేని ప్రేమ నవ్వు తెప్పించినా మరువ లేని ఆనందానుభూతిగా మిగిలిపోయింది. అటువంటి మనిషి ఈ పదిరోజుల్లోనే ఎంతగా మారిపోయారో ఆలోచిస్తే కమలకి నమ్మశక్యం కావటంలేదు. భర్త హృదయం అంతు పట్టని చిక్కు ప్రశ్నగా ఉందామెకు.

బుజ్జిగాడు ఆకలితో ఏడుస్తుంటే ఈ లోకంలోకి వచ్చిన కమల వాడి నెత్తుకొని ఇంట్లోకి నడిచింది బాధగా.

♦ ♦ ♦

హుషారుగా ఈల వేసుకుంటూ నడుస్తున్నాడు రామ్మూర్తి. ఇంకెంత దూరం ! వచ్చేశానులే సంతోషంగా తనలో తాను చిరునవ్వు నవ్వుకుంటున్నాడు. ఎదురుగా వచ్చిన వోణీపిల్ల రామ్మూర్తి తనకేసే నవ్వాడనుకొని కోపంగా చురచురా చూస్తూ వెళ్ళిపోయింది. బుజాలెగరేసి ముందుకు నడిచాడు రామ్మూర్తి.

ఒక డాబా యింటిముందు ఆగిపోయాడు.

ముందు పూలచెట్లున్నాయి. గేటు మీదుగా జాజి పందిరి అల్లించారు. పూలు క్రిందికి తొంగి చూస్తున్నాయి.

ఇంట్లోకి వెళ్ళే దోవకి రెండువైపులా జినియా మొక్కలు పూలతో తలలూపుతున్నాయి. ఆహ్లాదంగా ఉన్న వాతావరణంలో రామ్మూర్తి మనసు శ్రుతి చేసిన వీణలా ఉంది.

కాలింగ్ బెల్ మీద చేయి వేస్తుండగానే తలుపులు తెరుచుకున్నాయి.

అతన్ని చూసి ఆమె సమ్మోహనంగా నవ్వింది. రామ్మూర్తికి చక్కలిగింతలు పెట్టినట్లయింది.

" మీ కోసమే ఎదురు చూస్తున్నాను, రండి " ఆహ్వానించిందామె.

ఆనందంతో ఉబ్బితబ్బిబ్బయిపోతూ ఆమె వెంట డ్రాయింగ్ రూములోకి నడిచాడు. తలంటుకున్న ఆమె ముంగురులు పచ్చని ఫాల భాగం మీద నాట్యం చేస్తున్నాయి. నీలిరంగు చీర అదేరంగు జాకెటులో నీలి సుందరిలా ఉంది. చెవులకు మెరిసే జూకాలు వేలాడుతున్నాయి. మెళ్ళో సన్నటి చైను. ఆ చేతికొకటి, ఈ చేతికొకటి బంగారపు గాజులు. ఎక్వేరియంలో చేపల్లా కళ్ళు విప్పుతూ....

" కాఫీ తీసుకుంటారా! " అంది.

" వద్దు " తడబడ్డాడు.

చిన్నగా నవ్వి లోపలికి నడిచి వెళ్ళిందామె. ఆమె పిరుదులపై నాట్యం చేసే జడినుండి దృష్టి మరల్చుకోలేక పోయాడు రామ్మూర్తి.

" ఎప్పుడైనా నా కమల ఇంత వయ్యారంగా నడిచిందా " అనుకున్నాడు తప్ప పెళ్ళయిన కొత్తల్లో కమలనడక మీద కవిత్వం రాసిన సంగతి గుర్తు చేసుకోలేక పోయాడు.

" తీసుకోండి " కళ్ళల్లోకి చిలిపిగా చూస్తూ కాఫీ కప్పు అందించే ఆమె కళ్ళలోకి చూసి కప్పు చేతిలోకి తీసుకొని ' థ్యాంక్స్ ' అన్నాడు.

" అప్పుడేనా " అర్ధవంతంగా నవ్విందామె.

" ఈ రోజు మన ప్రోగ్రాం ఏమిటి ? " అడిగాడు మెల్లగా.

" ఏముందీ! అన్నపూర్ణాలో లంచ్ ఆ తర్వాత మ్యాటినీ ' మౌనగీతం ' చూసి రాత్రికి నా చేతి భోజనం.... ఆ తర్వాత...."గలగలా నవ్వింది.

గుండెల్లో పన్నీరు చిలికినట్లయింది రామ్మూర్తికి. " అయితే రెడీనా.... " ఆమె చేయి అందుకోబోయాడు చొరవగా.

" అప్పుడేనా కొంచెం సేపు కబుర్లు చెప్పుకుందాం " గోముగా అంది.

" నాకు కబుర్లు చెప్పటం రాదు "

"మరి....యూ సిల్లీ బాయ్...." అతన్ని సుతారంగా వెనక్కినెట్టి లోపలికి వెళ్ళింది.

ఎంత సొగసరి....గడసరి. సోషల్ బిహేవియర్.... కమల ఎప్పుడైనా ఇంత ఫ్రీగా ఉందా! ఈమెలాగా కమలను మార్చగలనా! జిడ్డు మొహం....అదీ....ఎప్పటికీ మారదు. అయినా ఇలాంటప్పుడు కూడా దాన్ని గుర్తు చేసుకోవటం ఎందుకు....

ఆటోలో అన్నపూర్ణా దగ్గర దిగగానే ఆమె హేండ్ బ్యాగ్ జిప్ తీసేలోపు రామ్మూర్తి ఆటోఫేర్ ఇచ్చేశాడు.

డిమ్‌లైట్ల వెలుగులో డిస్కోమ్యూజిక్ వింటూ ఆమె కళ్ళలోకి చూస్తుంటే ఏం తిన్నాడో గాని మరునిముషంలోనే కడుపు నిండినట్లనిపించింది.

సినీమా హాల్లో అతని చేయి ఆమె చేతిని నిమురుతూనే ఉంది. ఆమె అతని చేయి ఒకసారి తన చేతిలోకి తీసుకొని సున్నితంగా నొక్కి వదిలేసింది.

చటుక్కున కమల గుర్తుకు వచ్చింది రామ్మూర్తికి. పెళ్ళయిన కొత్తల్లో కమలను సినీమాకు తీసికెళితే ఎంత

ముడుచుకొని కుర్చీలో నాలుగో భాగంలో కూర్చుందో! తన చేయి తగిలిస్తే మైలపడి పోతుందన్నట్లు మరింత ముడుచుకున్న కమలను చూస్తే ఆరోజెంత నవ్వు; చిరాకు కలిగాయి. ఛీ .... ఆలోచనలు తప్పించుకోవటానికి తల విదిలించాడు.

" ఏమిటి డియర్ "గారాబంగా అడిగింది.

" ఏంలేదు. రాత్రికి మీ ఇంట్లో విందు గురించి ఆలోచిస్తున్నాను...." నవ్వాడు చిన్నగా.

' యూ....నాటీ ' చెంప మీద చిన్నగా కొట్టింది అల్లరిగా నవ్వుతూ. వెంటనే నిన్నటి సంఘటన గుర్తు కొచ్చింది రామ్మూర్తికి.

" ఏమండీ! నేనేం తప్పు చేశానని నన్నిలా శిక్షిస్తు న్నారు. మీరు రోజు రోజుకీ ఎందు కింతగా మారిపోతు న్నారు. మీ అనాదరణకు కారణం చెప్పండి" కమల కన్నీళ్ళతో అడిగింది.

' నీకు చెప్పవలసిన అవసరం నాకేమీ లేదు ' విదిలించాడు తను

" కాదు! చెప్పితీరాలి. అది సరియైన కారణం అవునో కాదో కూడా నేనాలోచించుకోవాలి " సూటిగానే అంది.

" మాటలు బాగా నేర్చావు....ముందు నాకడ్డంలే! "

"నేను లేవను, ఈరోజు మీరు చెప్పి తీరాలి" మొండిగా అంది.

చెంప ఛెళ్ళుమనిపించి "రాస్కెల్! మొగుడికి ఎదురు చెప్పటం మాత్రం తెలుసు" విసురుగా బయట పడ్డాడు. నీళ్ళు నిండిన కళ్ళతో కమల చూసిన ఆ చూపును మరచిపోలేకపోతున్నాడు రామ్మూర్తి. బలవంతంగా ఆలోచనలు మార్చుకోవటానికి ప్రయత్నించాడు.

"ఇంత పరాకు అయితే ఎలా" ఏదో అడిగినా బదులివ్వని రామ్మూర్తిని నిష్ఠూరంగా విసుక్కుందామె.

"లేదు నీ గురించే ఆలోచిస్తున్నాను. నువ్వు పరిచయమైన ఈ పదిరోజులు బృందావనంలో ఉన్నట్లనిపిస్తున్నది. నీకు పెళ్ళయిందన్నావు కదా! నీ భర్త మన గురించి తెలిస్తే ఊరుకుంటాడా".

"ఊరుకోకపోతే ఉరిపెట్టుకోనీ! మీరే చెప్పండి తన కిష్టమయిన ఆడవాళ్లతో తను తిరుగుతూన్నప్పుడు, నాకు నచ్చిన మగవాళ్లతో నేను ఆనందిస్తే! తప్పా! మగ వాడికో నీతి! ఆడదానికో నీతినా!"

రామ్మూర్తి వీపుమీద కొరడాతో ఛెళ్లున బాదినట్లయింది.

ఈ మాటలే కమల నోటివెంట వస్తే! ఇప్పటిదాకా ఈమెలాగా కమల లేదని బాధపడ్డాడు తను....కానీ ఇప్పుడు

ఈమెలాగా కమల ఆలోచించకూడదని వెయ్యి దేముళ్ళని తలచుకుంటున్నాడు.

"ఎక్కడికండీ!" విసురుగా వెళ్ళే రామ్మూర్తిని ఆపలేక హాలు బయటకి వచ్చి రామ్మూర్తి ఎక్కిన రిక్షాకేసి చూస్తూండిపోయిందామె.

రిక్షాలో ఉన్నా రామ్మూర్తి మనసు క్రమక్రమంగా తేలిక పడుతోంది.

ఆఫీసు వేళలో ఇంటి కొచ్చిన భర్త ఏ పిడుగులు కురిపిస్తాడోనని బెదురు కళ్ళతో చూసే కమలను చూస్తే రామ్మూర్తి గుండెల్లో తెలీని బాధ కలిగింది.

"నా కమల ఎంత చిక్కిపోయిందీ పదిరోజుల్లో" అనుకున్నాడు.

"కమలా!" ఆ గొంతులోని ప్రేమ నిజమా....కాదా అని సంశయిస్తూ నిల్చిన కమలను సందిట్లో పొదువు కున్నాడు ప్రేమగా.

"ఎందుకట్లా చూస్తావు. మనకి పట్టిన గ్రహణం విడిచింది!" అంటూ ఆమె బుగ్గలమీదికి జారే కన్నీటిని తుడిచి ఆప్యాయంగా —గుండెకు హత్తుకున్నాడు రామ్మూర్తి మనస్ఫూర్తిగా.

('వనితాజ్యోతి' మాసపత్రిక)

# చే జారిన మణిపూస

"అమ్మా! తమ్ముడు చూడవే!"

పదేళ్ళ ఉష ఏడుస్తూ వచ్చింది.

"ఏం చేశాడు" కూర తరుగుతున్న సుశీల తలెత్తి అడిగింది.

"నన్ను ఊరికే కొట్టాడు" రాగం తీస్తూ అంది ఉష.

"వాడి జోలికి పోవద్దని చెప్పానా లేదా! నీ వేమీ చేయంది వాడెందుకు కొడతాడు!" కూర తిరగమాత వేస్తూ చిరాగ్గా అంది సుశీల.

"కాదే.... మా టీచరేమో నోట్సులు శుభ్రంగా ఉండాలి....అంటుంది....వాడేమో నా నోట్సు నిండా పిచ్చి గీతలు గీశాడు. మా టీచరు చూస్తే తంతుంది...." కన్నీళ్ళ మధ్య అంది ఉష

'వాడికి అందకుండా పెట్టుకోవాలి.... వాడికేం తెలుస్తుంది పసిబిడ్డ' అంటూ వెనకేసుకొస్తున్న తల్లి వెనుక గారాబాలు పోతున్నాడు రవి.

'నేనేం అందించలేదే' అంటూ ఇంకేదో చెప్ప బోతున్న ఉష వీపుపై ఒక్కటంటించింది సుశీల.

" చెప్తుంటే నీ క్కాదూ .... వాడు మగబిడ్డ .... రేపు వాడే ఉద్ధరించేది....నీ బాబు సొమ్మేదో పోయినట్లేడుస్తావేః పైగా సమాధానం చెప్తావా..ఆడముం..నోరుమూసుకోక..." తానూ దానినేనన్న సంగతి మరిచి ఉష వీపుపై చేతిని ప్రయోగించింది సుశీల.

బల్లిలా నేలను కరుచుకున్న ఉష ఏడ్చి ఏడ్చి అలాగే నిద్రపోయింది.

రవి మాత్రం అమ్మ పెట్టిన పెరుగన్నం ముద్దలు మింగి అమ్మ పక్కలో నిద్రపోయాడు.

♦ ♦ ♦

" ఉషాః " తల్లిపిలుపు విన్న ఉష నెమ్మదిగా వెళ్ళింది.

" ఏంటమ్మా "

" ఇక్కడ పదిరూపాయలు పెట్టాను. తీశావా.... " తీవ్రంగా అడిగిందామె.

" లేదమ్మా .... " అమాయకంగా ఉంది ఉష మొహం.

" నువ్వు తియ్యకపోతే ఇంకెవరు తీస్తారు .... నిజం చెప్పు. "

తల్లి చెయ్యి ఎత్తటం చూసి రెండడుగులు వెనక్కి వేసింది ఉష. ' నిజంగా నేను తియ్యలేదమ్మా ....ఇందాక రవి ఇక్కడే నిల్చుని ఉన్నాడు.... ' మధ్యలో ఆపింది ఉష తల్లి మొహం చూసి భయపడి.

" నువ్వుతీసి వాడిమీద తోస్తావా .... వాడు మగబిడ్డ, వాడికేంఖర్మ తీయటానికి .... దొంగతనం కూడా నేర్చా వన్నమాట.... " అంటూనే ఉషపై దెబ్బలవర్షం కురిపించింది సుశీల.

" నిజంగా నేను తియ్యలేదమ్మా .... ఒట్టు .... " అంటున్న ఉష మాటలు ఆ దెబ్బల చప్పుళ్ళలో కలసి పోయాయి.

అప్పుడే ఆఫీసునుండి వస్తున్న మాధవరావు 'ఏమిటి సుశీ....ఎందుకు దాన్నలా కొడ్తున్నావు .... ' అంటూ కూతురికి అడ్డం నిల్చున్నాడు.

" మీరుండండసలు....ఇవాళ దీని అంతుతేలుస్తాను. ఇదీ...." అంటూ ఉష మీదికి సివంగిలా ఉరకబోతున్న భార్యన్ను ఆపి—

" ఏమయిందో చెప్పవేంటి.... " తట్టు తేలిన ఉష వీపు వంక బాధగా చూస్తూ అడిగాడు మాధవరావు.

" స్నానానికెళుతూ టేబుల్ మీద పదిరూపాయలు పెట్టాను. ఇంతలోనే ఏమయిందో తెలియదు. మాయం చేసి నా కొడుకు మీద పెడ్తున్నది దొంగతనం " ఫిర్యాదుగా అంది సుశీల.

" సుశీ....ఉష కూడా నీ కూతురే....ఏమ్మా ....ఉషా... తీశావా. " అనునయంగా అడిగాడు కూతుర్ని మాధవరావు.

భయంతోనే తల అడ్డంగా ఊపింది ఉష.

" రవి ఏడీ "

ఇల్లంతా వెతికినా రవి లేడు.

" చూశావా సుశీ ! వాడే తీసి పారిపోయాడు. ఫ్రెండ్‌తో ఏ సినిమాకో చెక్కేసి ఉంటాడు. అనవసరంగా దీన్ని బాదావు " అనునయంగా తల నిమురుతున్న తండ్రిని అంటుకుపోయింది ఉష.

"ఏ మొచ్చిందో వీడికి" విసుక్కుంటూ వంటింట్లోకి వెళ్ళింది సుశీల. రాత్రి పన్నెండయినా రవి జాడ లేదు.

" ఇంక నిద్రపో సుశీలా....వస్తాడులేవాడే.... " అంటూ చదువుతున్న పుస్తకం మూసేసిపడుకున్నాడు రావు.

" పొద్దుననగా రెండు మెతుకులు తిని వెళ్ళాడండీ ఎక్కడ పడిపోయాడో " తల్లిగుండె చలించింది.

తలుపు శబ్దానికి ఉలిక్కిపడి లేచిందామె.

వరండాలో లైటు వేసి తలుపు తీసింది.

ఎదురుగా పీక్కుపోయిన మొహంతో రవి :

" ఏంటిరా ఇది....అన్నం కూడా తినకుండా.... " అంటూ వంటింట్లోకి వెళ్ళే తల్లిని అనుసరిస్తూ

" నాన్న పడుకున్నారా .... " రహస్యంగా అడిగాడు.

" ఆ! ఇప్పుడే పడుకున్నారు .... ప్రొద్దున టేబుల్ పైన పెట్టిన పదిరూపాయలు తీశావా : "

" లేదమ్మా....నేను తీయలేదే.... : "

"మరి ఇప్పటిదాకా ఏం చేస్తున్నావు" ప్రశ్నించింది అనుమానంగానే.

" మా ఫ్రెండ్ పుట్టినరోజు సెకండ్ షోసిన్మాకి తీసుకెళ్ళాడు " అందమైన అబద్ధం ఆడే రవి మొహంలోకి నమ్మకంగా చూసిందా తల్లి.

రాత్రంతా తన డబ్బులతో ఫ్రెండ్‌తో కలసి చూసి ఆనందించిన సెక్స్ సినిమా తాలూకు దృశ్యాలలో హీరోగా తననే ఊహించుకుంటూ కలలుగన్నాడు రవి.

పొద్దున లేస్తూనే రావుతో అంది సుశీల.

" నిన్న అనవసరంగా నా బిడ్డ ననుమానించారు. వాడు తీయలేదట. మీ కూతురెంత నంగనాచి!...." అంది కోపంగా.

" వాడి మాటలు నమ్మావా.... " సూటిగా ప్రశ్నించాడు రావు.

" మగబిడ్డ! వాడి మాటలు నమ్మక ఎవర్ని నమ్మతాను మీ కూతురు.... " సుశీల మాటలు పూర్తి కాలేదు.

'సుశీలా ఇంక ఆపు' అరిచాడు రావు అసహనంగా.

" మన పిల్లవాడయితే కావచ్చు. కానీ వాడి గుణాలు తీర్చి దిద్దవలసిన నువ్విలా ప్రతి దానికీ సమర్థించకు....రవీ....ఇట్రా.... " పిల్లిలా అడుగులేసుకుంటూ వచ్చిన పన్నెండేళ్ళ కొడుకు మొహంలోకి సూటిగా చూశాడు రావు.

రవి తలదించుకున్నాడు అపరాధిలా.

చెంప ఛెళ్ళుమన్న రవికి కళ్ళు తిరిగాయి.

" నిజం చెప్పరా మీ అమ్మకు .... " అంటూ వంగదీసి రెండు వేశాడు రావు.

"అమ్మోయ్....చచ్చానే...." అరుస్తున్నాడు రవి.

" చంపేస్తా వెధవా .... నిజం చెప్పు .... అరిచావంటే ప్రాణం తీస్తా .... " అంటూ కోపంగా మరి రెండు తగిలించాడు.

"నేనే తీశాను....ఇంకెప్పుడూ తీయను...." అంటూ దండం పెట్టాడు రవి.

" నాన్నా.... రవిని కొట్టొద్దు .... " అంటూ అడ్డు వచ్చిన ఉషని చూసి.

" సిగ్గులేదురా....నీ మూలంగా దెబ్బలు తిన్నా అది నిన్ను కొట్టొద్దంటున్నది....ఛీ....ఎలా బాగు పడతావురా...." అంది సుశీల రవి కళ్ళు తుడిచి దగ్గరికి తీసుకొని.

" పొద్దున్నే ఎవరి మొహం చూశావో అనవసరంగా ఇన్ని దెబ్బలు తిన్నావు. ముష్టి పదిరూపాయలు తీసి నందుకు ఇంత కొట్టాలా.... ? అయినా అడిగితే మేము ఇవ్వమన్నామా....సంపాదించేది ఎవరి కోసమనుకున్నావు నాన్నా.... " అంటూ రవిని బుజ్జగిస్తున్నదా తల్లి.

" సుశీలా : నువ్వు నోరు మూసుకొని లోపలికి వెళ్ళు " రావు గద్దింపుతో గొణుగుతూ లోపలికి నడిచింది.

• • •

వోణీ వేసుకుంటూ కళ్ళతో టేబుల్ వైపు చూపిన ఉష " అమ్మా.... " అని కేక పెట్టింది.

" ఏమిటే.... " వంటింట్లోంచి సుశీల పలికింది.

"నా వాచీ....తీశావా...." కంగారుగా అడిగింది ఉష.

" ఏమో నాకేం తెలుసు .... సరిగ్గా చూశావా " చేతులు పమిటకొంగుతో తుడుచుకుంటూ వచ్చిన సుశీల అంతా వెతికింది.

"సరిగానే చూశానే....ఇక్కడే టేబుల్ మీద పెట్టాను. ఏమయిందో " బాధగా అంది ఉష.

" రవి ఇప్పుడే వెళ్ళాడుగా .... పట్టుకెళ్ళాడేమో " రావు భారంగా అన్నాడు.

"మీరు మరీనూ...ప్రతిదానికీ వాడొకడు దొరికాడు... నువ్వు సరిగ్గా చూడవే" కూతుర్ని విసుక్కొంది.

" ఇంకేం చూడను .... అవసరం కూడా లేదు .... కాలేజీకి టైం కూడా అయింది " నిట్టూరుస్తూ చెప్పిలేసుకుంది ఉష.

" ఆడపిల్లవైనా నువ్వు శ్రద్ధగా చదువుకుంటున్నావు గాని వాడికా జ్ఞానం లేదు " నీరసంగా అన్నాడు రావు.

స్నేహితురాలి పిలుపుతో బయటికి నడిచింది ఉష.

' మీరే వాడ్నలా తయారు చేసింది, కూతురి గురించి తప్ప వాడి గురించి శ్రద్ధ తీసుకుంటే అలా తయారయ్యేవాడా ; నా బిడ్డను నాశనం చేసింది మీరే....' రుద్ధస్వరంతో అంది సుశీల.

" నీకు తెలీదు సుశీ....ఇప్పుడు మనం వాదులాడు కోవడటంవల్ల ప్రయోజనం లేదు. బయట ఆకర్షణలు విపరీతంగా ఉన్న ఈ రోజుల్లో పిల్లల పెంపకం సమస్యే! అది నీ లాంటి తల్లులకు అర్థం కాదు. పెద్దవాళ్ళయినాక కొందరు స్వయంగా తెలుసుకుని మారతారు. మనకా అదృష్టం కూడా ఉన్నట్లు లేదు. " నిట్టూర్చాడాయన.

సాయంత్రం కాలేజి టైముకు ముందుగానే కంగారుగా వచ్చింది ఉష.

" అమ్మా! తమ్ముడు పోలీసు స్టేషన్లో అరెస్టయి ఉన్నాడుట "

" ఎవరు చెప్పారు.... " పాలిపోయిన మొహంతో అడిగింది సుశీల. ఆమె కాళ్ళు వణుకుతున్నాయి.

" పాలరంగయ్య నేను వస్తుంటే చెప్పాడు "

" ఏం చేశాడే తల్లీ....వాడు.... " సుశీల స్వరంలో దుఃఖం తొణికిసలాడుతోంది.

'జేబుదొంగలతో చేతులు కలిపాడుట. వాళ్ళముఠాలో ఎవర్నో పట్టుకుంటే అందరిపేర్లు బయటకి వచ్చాయిట' ఉష కన్నీళ్ళు తుడుచుకుంది.

దిండులో తలదూర్చి ఏడుస్తున్న తల్లిని ఓదార్చేందుకు ఆ అమ్మాయి చేస్తున్న ప్రయత్నం వ్యర్థమవుతోంది.

రావు ఆఫీసునుండి వస్తూనే అంతా తెలుసుకుని "ప్రొద్దు అర్ధరాత్రి తిరుగుళ్ళు చూసి అనుకుంటూనే ఉన్నాను. ఏదో....కొంప ముంచుతాడని" దిగులుగా అన్నాడు.

" పదండి....చూసి వద్దాము పిచ్చివన్నాపి! ఎలా ఉన్నాడో అక్కడ వాళ్ళు బాగా కొడతారేమో! నా బిడ్డను నాకు దక్కించండి" విలపించే భార్యను ఓదార్చాలని విఫల యత్నం చేసాడు రావు.

" సుశీలా! ఎవరి బిడ్డయినా తప్పుచేస్తే శిక్ష అను భవించి తీరాలి .... ఇలా అయినా వాడి జీవితంలోకి వెలుగొస్తుందేమో" పితృహృదయం గిలగిలలాడుతోంది.

కటకటాల వెనుక రవిని చూస్తూనే సుశీల, ఉషలు భోరుమని ఏడ్చారు. తల్లికీ, అక్కకీ, తండ్రికి మొహం చూపించలేక రవి తలదించుకున్నాడు అపరాధ భావంతో.

" పిల్లల్ని కనగానే తల్లిదండ్రుల బాధ్యత తీరదు. పుట్టేటప్పుడు మణిపూసల్లాంటి మనసులుండే పిల్లల్ని సక్రమమైన మార్గంలో నడిపేవాళ్ళే నిజమైన తల్లి దండ్రులు. ఆ మణిపూస చే జారితే చెప్పేదేముంటుంది.... ఇంక దొరుకుతుందా....ఏమో...." మనసు జారిన కళ్ళను కర్చీఫ్‌తో అద్దుకున్నాడు రావు.

( " విశ్వ రచన " పక్ష పత్రిక )

# అంతరంగ చిత్రాలు

జ్యేష్ఠ మాసపు ఎండ నెత్తి మాడ్చేస్తోంది.

వేణుగోపాలస్వామి దేవాలయంలో గంటలు విన్పిస్తున్నాయి.

గోపురం మీద ఒక్క పావురం కూడా ఎగురుతున్నట్లు కన్పించటం లేదు. పక్షులన్నీ దాహానికి విపరీతంగా అరుస్తున్నాయి. కాళ్ళకి చెప్పులున్నా నడక సాగటం లేదు. పైకండువాతో ఒకసారి మొహం తుడుచుకున్నాడు జానకి రామయ్య. "అబ్బ" అనుకున్నాడు.

దాహం వేస్తోంది. అటూ ఇటూ చూశాడు. దూరంగా ఒక కిళ్ళీ బంకు కన్పిస్తోంది. కాళ్ళీడ్చుకుంటూ అక్కడిదాకా నడిచాడు.

"బాబూ : ఓ సోడా కొట్టు" సోడాబుడ్డి ఓ చావుకేక పెట్టింది.

కాస్త ప్రాణం కుదుట పడింది జానకిరామయ్యకి. దమ్ము లిచ్చాడు.

"ఏమండీ! ఎండలో బయలు దేరారు: ఊవ్వూరేనా: " పలకరించాడు కిళ్ళీకొట్టువాడు.

" కాదు బాబు: విజయవాడ నుంచి వస్తున్నా! విశ్వనాధం ప్లీడరుగారిల్లు తెలుసా నీకు "

" ప్లీడరుగారు తెలీకేమండీ: ఇట్నుంచి తిన్నగా నడిచి కుడి వేపు సందు తిరిగితే కుడి వేపే వాలుగో ఇల్లు ఉంటారండీ "

" మంచిది బాబూ: వస్తాను "

ఇల్లు దగ్గరికి వచ్చేసిందన్న తృప్తితో అడుగులు చకచకా పడుతున్నాయి.

అందంగా పూల మొక్కలతో ఖరీదైన కర్టెన్లతో ఇంటి సిరిని ప్రకటిస్తోందా ఇల్లు. ఇంటి కాంపౌండు మీదకి ప్రాకి ఎఱ్ఱ పూలపంట పండించుకుంటున్న బోగన్ విల్లా తృప్తిగా వచ్చేవారి కందరికీ స్వాగత మిస్తోంది:

కాలింగ్ బెల్ మోత విని కర్టెన్ కొద్దిగా తొలగించి కన్పించీ కన్పించకుండా.

" ఎవరు కావాలండీ " మధుర కంఠ స్వరం ప్రశ్నించింది.

"విశ్వనాథం గారు లేరాండీ....!" ఆశగా అడిగాడు.

"ఉన్నారు....కూర్చోండి" లోనికి వెళుతూ వరండా లోని కుర్చీలకేసి చేయి చూపించింది.

"ఆమె విశ్వనాథంగారి భార్య అయివుంటుంది" అనుకున్నాడు జానకి రామయ్య.

"అరె నువ్వా జానకీ! బాగున్నావురా!" ఉప్పొంగిన ప్రేమాతిశయంతో చిరపరిచితమైన కంఠస్వరం విని ఆశ్చర్యపోయాడు జానకిరామయ్య. మనసునిండా మల్లెలు పరచిన భావన.

"నువ్వేనా విస్సూ....!" చేతినిచాపి విశ్వనాథం చేయి అందుకున్నాడు జానకిరామయ్య ఆనందంతో పొంగిపోతూ.

"ఎవరో అనుకున్నాను....! సావిత్రీ....ఇలారా...." భార్యని కేకేశాడు హడావుడిగా విశ్వనాథం.

ఆవిడ బయటికి వచ్చింది. పెళ్ళికూతురిగా పసుపు బట్టల్లో చూసిన సావిత్రి నిండు ముత్తయిదువగా జీవితం పండించుకున్న తృప్తితో కనులముందు నిలిచింది. ఆకర్షణీయమైన సావిత్రికి పరిపూర్ణత్వం కూడా సిద్ధించి నట్లుంది.

" మీరా అన్నయ్యగారూ....ఎవరోనని....పోల్చు కోలేకపోయాను " సంజాయిషీ ఇచ్చుకుంటున్నట్లుగా అంది.

"ఫర్వా లేదమ్మా....చాలా కాలం అయింది గదా:" సర్ది చెప్పాడు జానకి రామయ్య. నత్తలా తనలో తానే ముడుచుకుపోతున్నాడు.

విశ్వానాథం ఎంతటి ఐశ్వర్యవంతుడయ్యాడు. క్లాసులో యావరేజ్ స్టూడెంట్‌గా ఉండే విస్సుగాడు ప్లీడరయి పేరు ప్రఖ్యాతులు సంపాదిస్తే క్లాసులో ఎప్పుడూ ఫస్ట్‌వచ్చే తను బతకలేని బడిపంతులుగా పల్లెలో పొద్దు పుచ్చు తున్నాడు. ఉన్న ఒక్క ఆడపిల్లకూ పెళ్ళి చేయాలంటే సతమతమౌతున్నాడు.

'ఏరా: అంతాక్షేమమేనా: మా చెల్లెలు ఎలా ఉంది: పెళ్ళిలో చూడటమే: పిల్లలు ఎలా ఉన్నారు...?' విశ్వనాథం దగ్గర కూర్చొని ప్రశ్నలు పరంపర కురిపించాడు. " మీ చెల్లెలు నన్ను వంటరివాడ్ని చేసి వెళ్ళిపోయిందిరా : " జానకిరామయ్య గొంతు గరగరలాడింది.

'అరెరే: మనం మళ్ళీ కలుసుకోలేక పోవటంవల్ల నాకీ సంగతు లేవీ తెలియవు:' విశ్వనాథం నొచ్చుకున్నాడు.

తన ఆర్థిక కారణాలవల్ల వైద్యం సరిగ్గా చేయించ లేకపోయినందునే ప్రియమైన భార్యను దూరం చేసు కున్నానని స్నేహితునికి ఎలా చెప్పగలడు.

జానకిరామయ్య మనసు భార్య జ్ఞాపకాలతో దుఃఖ భారమయింది.

" పద జానకీ ! స్నానంచేయి....భోజనం చేద్దాం ! తర్వాత తీరిగ్గా మాట్లాడుకోవచ్చు "

" వద్దు వద్దు.... " మొహమాటపడ్డాడు.

తను వంటిమీద బట్టలు తప్ప మరో జత తెచ్చుకో లేదని గుర్తు చేసుకున్నాడు.

" ఫర్వాలేదురా ! నా దగ్గర మొహమాటము నీకు. కాలేజీ రోజుల్లో .... రోజూ నీ క్యారేజీలో అన్నం నాకు పెట్టేవాడివి....గుర్తుందా! అలాంటి నిన్ను అన్నంతినకుండా పోనిస్తానా .... '' విశ్వనాథం తన దగ్గర కాలేజీ రోజుల్లో పొందిన చిన్నచిన్న సహాయాలు గుర్తు చేసుకుంటుంటే జానకిరామయ్యకు తృప్తిగా అన్పిస్తోంది. తనలోని అహానికి ఆనందంగా ఉంది.

స్నానం చేసి ఇస్త్రీలుంగీ కట్టుకొని రుచికరమైన భోజనం చేసిన జానకిరామయ్యకు చాలా రోజుల తర్వాత నిజంగా జీవితం కమ్మగా అన్పించింది. ఇద్దరు మిత్రులూ తమ చిన్ననాటి ముచ్చట్లు నెమరు వేసుకుంటున్నారు. సావిత్రికూడా ఆసక్తిగానే వింటున్నది. వచ్చిన పని విశ్వనాథం అడగ లేదు. జానకిరామయ్య చెప్పలేదు. ఎలా చెప్పాలా అని తనలో తాను మథన పడుతున్నాడు.

కొంత సేపటికి,

"చెప్పరా! జానకీ ఎందుకిలా నాపేరు వెదుక్కుంటూ వచ్చావో...." కదిపాడు విశ్వనాథం.

" నోట్లో వేసుకున్న తాంబూలం గొంతుకు అడ్డు పడ్డట్లయింది. తీరా చెప్పితే ఇచ్చిన మర్యాద అంతా తుడుచుకుపోతుందేమో! ఆడపిల్ల తండ్రిగా అడుగు పెడితే ఆ ఇంట్లో ఇంత మర్యాద పొందేవాడేనా!" అయినా చెప్పక తప్పదు.

" ఏం లేదురా! మాధవికి పెళ్ళి సంబంధాలు చూస్తున్నాను. నీపేరు చెప్పి....నీ కొడుకు పెళ్ళికి ఉన్నాడంటే కనుక్కుందామని వచ్చాను. తీరా వస్తే....నువ్వే...."

"అరె!" పడీపడీ నవ్వాడు ఆనందంగా విశ్వనాథం.

'ఇంత నానుస్తావేరా! నేనయితేనేం...మరీ మంచిది... ఇలా అయితే మనం తరుచు కలుస్తాం! మాధవి ఫోటో తెచ్చావా! ఇవ్వు. మా వాడు శ్రీహరి బొంబాయిలో ఇంజనీరుగా చేస్తున్నాడు. మనం ఇంక వియ్యంకుల పాత్రలు ధరించాలన్న మాట' ఆనందపడుతున్న విశ్వనాథాన్ని చూస్తే జానకిరామయ్యకి నోట మాట రాలేదు ఇంతటి ఐశ్వర్యవంతుడింట్లో తన కూతురు అడుగు పెడుతుంటే నమ్మ శక్యం కాలేదు.

"మావాడు నామాట కాదనడన్న నమ్మకం నాకుంది. అయినా ఈ రోజుల్లో పిల్లలు కదా! నువ్వింక మీ వూరెళ్ళి

పెళ్ళి పనులు చూసుకోవచ్చు" విశ్వనాధం మంచితనానికి మూర్ఛ వస్తోంది జానకిరామయ్యకి.

"మాధవి చామనచాయలో ఉంటుంది డిగ్రీ చదివింది.... " ఏదో చెప్పబోతున్న జానకిరామయ్యను వారించాడు విశ్వనాధం.

"మాధవి నీ కూతురు....అంటే : అంతకు మించిన క్వాలిఫికేషన్లు ఏవీ ఉండవు నా దృష్టిలో.... "

"కట్నంమాట.... " నసిగాడు.

"నువ్వు ఒప్పుకోవటమే .... " జోక్ చేసినట్లుగా అని పెద్దగా నవ్వాడు విశ్వనాధం.

"ఫోరా .... పెద్దపోజులు నాకు కట్నం ఇస్తాడుట సావిత్రీ....చూడు వీడి బడాయి. "

తనా ప్రశ్న ఎందుకు వేశానా అని తన మీద తనకే అసహ్యం వేసింది.

"చూడు జానకీ : మనుషుల ఆప్యాయతల కంటే కాగితం కట్టలకి విలువ ఉందనుకోను. మా జానకి కూతురు మా యింటి కోడలు కావటం కంటే ఆనందం ఏముంటుంది నాకు. మేమెంత సంతోషంగా శేష జీవితం గడుపుతాం....: నాకు లేనిది నీ వివ్వగలిగేది ఏదిరా....నా స్వార్ధంతో నేను నీకూతుర్ని నా కొడుక్కి చేసుకుంటున్నాననుకో : కోరినంత

కట్నంతో వచ్చిన కోడలు మనసు....ముందే అత్తమామలకు ఎంత దూరమౌతుందో నాకు తెలుసు ". జానకిరామయ్య కళ్ళు చెమర్చాయి.

" సరేరా ! అయితే మంచిరోజు చూసి అమ్మాయిని చూడటానికి అబ్బాయిని పిలిపించు. నేను ఏర్పాట్లు " అంటున్న జానకిరామయ్యతో —

" ఆ ..... అన్నట్లు చెప్పటం మర్చిపోయానురా ! మా అమ్మాయికికూడా నీ ఎరికలో ఏదైనా సంబంధంచూడు. ఇద్దరి పెళ్ళిళ్ళు ఒకేసారి జరిపిస్తే నా బాధ్యత తీరి పోతుంది. నా సిద్ధాంతం అర్ధమయిందిగా! కట్నం ప్రసక్తి ఉండకూడదు. అబ్బాయికి భార్యని పోషించుకునే శక్తి ఉంటే చాలు " విశ్వనాధం చెప్పాడు.

తన కొడుకు వాసు వెంటనే గుర్తొచ్చాడు జానకి రామయ్యకు. విశ్వనాధం కట్న సిద్ధాంతం నోరు మెదపనీయ లేదు. వాసు చదువు కోసం చేసిన అప్పులు ఆయన అంతరాత్మ నోరు నొక్కేశాయి.

కూతురి పెళ్ళి దాదాపుగా ఖాయం చేసుకుని ఇంటికి వస్తున్న జానకిరామయ్యకు తన నీడ తనకే మరుగుజ్జులా కన్పిస్తోంది! తన అంతరంగ చిత్రం తనకే స్పష్టంగా కన్పించటం లేదు. మనసు అద్దం మసక బారినట్లుంది !

('హారిక' వార పత్రిక)

# ఆలంబన

"నువ్వు మా నాన్నవి కావు ఫో! నువ్వు మా నాన్నవి కావు" మంచం మీదుంచి ఎగిరెగిరి పడుతున్నాడు బాబు. మంచం పక్కనే కన్నీళ్ళతో కూర్చున్న సుమిత్ర కేమీ పాలుపోలేదు.

"బాబూ! బాబూ!" గుండెల మీద చేతిని వేసి రాస్తూ అనునయించాలని చూసింది సుమిత్ర.

పెనంలాగా కాలిపోతోంది బాబు వళ్ళు.

సుమిత్ర గుండెల్లో భయం ఎక్కువయింది. మళ్ళీ జ్వరం ఎక్కువయింది. 'లేదు'! 'లేదు....' 'ఆయన మీ నాన్న కాదు....సరేనా! నా బాబు కదూ!' అంటూ కన్నీళ్ళ మధ్య తనేం మాట్లాడుతుందో తెలీని పరిస్థితిలో మాతృప్రేమను రంగరించి మాట్లాడుతోంది సుమిత్ర.

గుమ్మందగ్గర నిల్చున్న సుధీర్‌ని గమనించలేదు సుమిత్ర.

చూసి ఉంటే ఆ మాట అనగలిగేది కాదు.

అతని మొహం వివర్ణమయింది.

వెనుదిరిగి పదినిమిషాల్లో డాక్టరుతో వచ్చాడు.

డాక్టరు పరీక్షచేసి ఒక ఇంజక్షన్ చేశాడు బాబుకి.

"ఫో .... " 'నువ్వు మా నాన్నవి కాదు ....' మా నాన్న వేరే ఉన్నాడు....నాన్నా....రా....నాన్నా.... ఎక్కడున్నావు .... ?" బాబు కలవరిస్తూనే మగతలోకి జారుకున్నాడు.

డాక్టర్ సుమిత్రకేసి చూస్తూ 'వాళ్ళ నాన్న గురించి బాబు మనస్సు తల్లడిల్లుతోంది. ఆ పసిమనసును ముందు ఊరడిస్తే గానీ జ్వరం తగ్గదు' అన్నాడు.

"సరే డాక్టర్...." అంది సుమిత్ర తలదించుకొని. సుధీర్ డాక్టర్ వెంటే బయటికి నడిచాడు. రాత్రి పన్నెండయింది. సుమిత్ర చెప్పాడు మందు బాబు నోట్లో బలవంతాన పోసింది.

"అమ్మా! నువ్వు మంచి దానివి కాదు....ఆ నాన్నని వదిలి ఈ నాన్న దగ్గరికెందుకు తెచ్చావు" బాబు అడిగాడు బలహీనంగా. ఇంక ఊరుకోలేకపోయింది సుమిత్ర.

"తప్పు బాబూ! ఈయన కూడా నీకు నాన్నే .... అలా అనకూడదు" అన్నది బుజ్జగిస్తున్నట్లు.

కానీ ఆ ఎనిమిదేళ్ళ పసి మనసు ఆ సత్యాన్ని జీర్ణించుకోగల స్థితిలో లేదు.

బాబు దుప్పటి సరిచేసి వాకిలి దాకా వచ్చి సుధీర్ కోసం చూసి మళ్ళీ వెనక్కి వచ్చింది. మంచం మీద బాబుని చూస్తే ఏడుపాగలేదు సుమిత్రకు. బాబు చేతులు కాళ్ళు ఎండుపుల్లల్లాగా ఉన్నాయి. ఎలాంటి బాబు ఎలా అయిపోయాడో. వాళ్ళ నాన్న మీది దిగులు వాడెలా మర్చిపోగలడు ? అసలీ పెళ్ళి చేసుకొని తాను పొరపాటు చేసిందా? సుమిత్ర దీర్ఘంగా నిట్టూర్చింది. ఆమె మనసులో గతం తాలుకు నీడలు పరదాల్లా కదిలాయి.

  

"హాయ్ సుమీ...." ఆఫీసునించివస్తూనే సుడిగాలిలా చుట్టేశాడు రమణ.

'ఏమిటిది..చిన్న పిల్లాడిలా..బాబు చూస్తున్నాడు...' చిరుకోపం నటిస్తూ విడిపించుకొంది సుమిత్ర.

" నాన్నా .... నాకు మోటార్ సైకిల్ బొమ్మ తెస్తానన్నావు " గారాలు పోయాడు బాబు.

" అది మర్చిపోతానా .... ఇదిగోరా ! " బ్యాగ్ లోంచి బొమ్మ తీసి ఇవ్వగానే అదిపట్టుకొని బాబు దాన్ని ఆపరేట్ చేయటంలో మునిగిపోయాడు.

" సుమీ....నీకు...." అందించాడు ఆప్యాయంగా. నవ్వుకుంటూ ఆమె తలలో పూలు తురుముకుంది.

మధురమైన ఆ రోజులు మరి మరువ లేనివి సుమిత్ర జీవితంలో.



రమణ శాంతం, చిలిపి తనంతో ఆమెను రకరకాలుగా అలరించేవాడు. అతనికి తగిన భార్య సుమిత్ర.

వారి నోముల పంట బాబు.

" వీడు నా ఫ్రెండ్ సుధీర్ " పరిచయం చేశాడు రమణ ఒక రోజు ఆఫీసునుంచి వస్తూనే!

బెదిరే కళ్ళు వాలుస్తూ నమస్కారం చేసిన సుమిత్ర రూపం సుధీర్ మనస్సులో నాటుకుపోయింది.

ప్రతినమస్కారం చేయటంకూడా మరచిపోయాడు.

అతని ధోరణికి తడబడి, కాఫీ తెచ్చే నెపంతో లోపలికి వెళ్ళిపోయింది సుమిత్ర.

" ఏరా! ఈ సంవత్సరమయినా వెడ్డింగ్ కార్డు ఇస్తావా? "

" అందరికీ నీ అంత అదృష్టం ఉండొద్దూ.....! "

అప్పుడే కాఫీలతో వస్తున్న సుమిత్రని చూస్తూ అన్నాడు.

" నీకు కాబోయే భార్య ఎలా ఉండాలో చెప్పుపోనీ... ఏ సుమిత్రా మనం వెతుకుదామా.... " అన్నాడు రమణ.

సుమిత్ర నవ్వింది.

పరవశంగా ఆమె కేసి చూశాడు సుధీర్.

ఆ రాత్రి సుధీర్ భోజనం అక్కడే.

అది మొదలు సుధీర్ రాకపోకలు ఎక్కువైనాయి సుమిత్రకి అతని ధోరణి మొదట్లో చికాకు కల్గించినా నిర్మలమైన అతని మనస్తత్వం, సున్నితమైన ఆరాధనా భావం గ్రహించి పట్టించుకోనట్లు ఊరుకుంది,

" మీకో చెల్లెలుందా " అడిగాడు సుధీర్ ఓ రోజు.

" లేదు....ఏం? " అన్నది సుమిత్ర కుతూహలంగా.

" ఏంలేదులెండి " నిరాశ పడిపోయాడు సుధీర్. నవ్వుకుంది సుమిత్ర తనలో తాను.

రమణ లాంటి భర్త తనకు లభించినందుకు సుమిత్రకూ, ఆమె లాంటి అనుకూలవతి అయిన భార్యను పొందిన రమణను చూచి విధి ఓర్వలేకపోయింది.

ఆఫీసునుంచి ఇంటికి వచ్చే రమణ యాక్సిడెంట్‌లో బలికావడం విన్న సుమిత్ర కుప్పకూలిపోయింది.

ఆమె నెత్తిమీద అగ్నిపర్వతం బ్రద్దలయినట్లుగా ప్రపంచమంతా కారుచీకట్లో మునిగినట్లుగా తోచింది....

రమణ కెందుకిలా జరిగింది! ఏ దేవుడు తన కళ్ళలో నిప్పులు పోసుకున్నాడు. విధికింత కోప మెందుకు.... ?

తలచుకొని శోక దేవతలా శవంమీద పడి ఏడుస్తున్న సుమిత్ర దుఃఖాన్ని ఎవ్వరూ ఆపలేకపోయారు.

" పాపం చిలకాగోరింకల్లా ఉండేవారు "

ఇరుగుపొరుగువారు జాలిపడ్డారు.

సుమిత్రకి తండ్రి లేనేలేడు. తల్లి వచ్చేసరికి మరో రోజు పట్టింది. జరగవలసిన కర్మకాండ అంతా సుధీర్ నిలబడి చేయించాడు.

శోకదేవత అయిన సుమిత్రను చూడలేకపోతున్నాయతని కళ్ళు.

బాబు కసలేమీ అర్థం కావటం లేదు.

" అమ్మా .... ! నాన్న కేమయింది .... ? నాన్నా ఎందుకలా పడుకున్నావు .... నాన్న నెక్కడికి తీసుకెళ్ళుతున్నారు. చెప్పమ్మా .... " బాబు అడిగే ప్రశ్నలకు సుమిత్ర గుండె బ్రద్దలవుతోంది.

ఆమె ఫెయింటయిపోయింది. బాబుని పక్కింటావిడ దూరంగా తీసికెళ్ళింది.

బొట్టు గాజులు తీసి వేసిన సుమిత్రకు భవిష్యత్తు ప్రశ్నార్ధకంలా నిల్చింది....తనేమీ చదువుకోలేదు. బాబు

నెలా పెంచి విద్యా బుద్ధులు చెప్పించగలదు .... ? పుట్టింటి అండ ఎటూ లేదు. ఉన్న ఒక్క అన్న చాలీచాలని జీతంతో గంపెడు బాధ్యతలతో కొట్టుకుంటున్నాడు. తల్లి అతని దగ్గరే ఉంటున్నది. తమ అనురాగ దీప్తమైన బాబుని ఎలా చదివించాలి? భర్తతాలూకు వచ్చిన డబ్బు చాలా స్వల్పం!

ఆమె భర్తని తలచుకొని పెద్దగా రోదించింది.

"మీరు నన్నిలా వంటరిగా వదిలేసి అనాధని చేశారెందు కండీ ?

నేను మీ ఎడల ఏమైనా పొరపాటుగా ప్రవర్తించానా!

నాకింత పెద్దశిక్ష వేయటం న్యాయమేనా ? "

ఆమె విల్లవిల్లాడిపోయింది.

చెరువు ఎండితే చేపలు బైటపడ్డట్లుగా ఆమె జీవితం శుష్కహాసమైంది.

మూలనున్న మిషన్ బైటికి తీసింది. సరదాగా కొన్న ఆ వస్తువు ఇప్పుడు జీవనోపాధి అయింది.

రోజులు భారంగా దొర్లుతున్నాయి.

బాబు మీదే తన ఆశలన్నీ నిలుపుకొని రోజులు లెక్కించుకుంటోంది సుమిత్ర. కానీ బాబు రోజూ 'అమ్మా... నాన్న ఏడీ....! మా ఫ్రెండ్స్ నాన్న వచ్చి పోయాడంటున్నా రమ్మా ....చావంటే ఏమిటి? ' అని అడిగాడు.

" అదే బాబూ .... దేవుడి దగ్గరికెళ్ళటం .... " కన్నీటితో అంది.

" అందరూ వెళతారా : నాన్న అక్కడికే కదా వెళ్ళారు....మరి నీవూ నేను కూడా వెళతామా.... " ఉలిక్కి పడింది సుమిత్ర.

" వద్దు బాబూ! నాన్న వచ్చేస్తారు....దేవుడు కొన్ని రోజులుంచుకుని నాన్నని తిరిగి పంపేస్తారు " అని అప్పటికి నచ్చజెప్పింది.

కానీ రోజూ నాన్న ఇంకా ఎన్ని రోజులకి వస్తారని బాబు వేసే ప్రశ్నలకి బదులివ్వలేక కొట్టింది బాధలో ఓ రోజు.

సుధీర్ ఒక రోజు వచ్చి సీరియస్‌గా అడగలేక అడిగాడు ' మీ జీవితంలోకి ప్రవేశించి బాబు బాధ్యత నేను తీసుకుంటాను....మీరేమీ అనుకోకపోతే.... '

" ఆలోచించి చెప్తాను " అంది మెల్లగా.

సరేనని వెళ్ళిపోయాడు సుధీర్. వారం రోజులు ఆలోచించి తన సమ్మతిని " బాబు భవిష్యత్తుకోసం ఈ పెళ్ళి చేసుకుంటానని " తెలియజేయటంతో సుధీర్ కళ్ళలో కోటికాంతులు వెలిగాయి.

ఇద్దరూ రిజిస్టరు మ్యారేజి చేసుకున్నారు.

సుధీర్ ఆ వూరు నుంచి దూరంగా మరో వూరు ట్రాన్స్ఫర్ చేయించుకున్నాడు.

సుమిత్ర సుధీర్‌కి భార్య కాగలిగింది కానీ బాబుకి సుధీర్ తండ్రి కాలేకపోతున్నాడు.

" మీ నాన్న.... " అని సుధీర్‌ని చూపిస్తే కోపంగా చూసి మొహం తిప్పేసుకున్నాడు. కానీ ఎట్టి పరిస్థితుల్లోనూ అలా పిలవటానికి ఒప్పుకోలేదు బాబు.

వాడి లేత మనస్సులో తండ్రి రూపం చెరిగిపోలేదు. తండ్రి కోసం ఎదురు చూస్తూ సుధీర్‌ని తండ్రిగా పరిచయం చేస్తే తట్టుకోలేకపోతున్నాడు.

సుధీర్ వాడినెంత ప్రేమగా చూస్తున్నా వాడు మాత్రం రాజీపడటం లేదు. విసిగివేసారి ఒకసారి చిరాకులో విపరీతంగా బాబుని కొట్టింది సుమిత్ర. ఆనాటినుండీ జ్వరం అందుకుంది బాబుకు.

  

తెల్లవారిన సూచనలకు ఉలిక్కిపడి లేచి చూసింది సుమిత్ర. బాబుకు జ్వరంకొంత తగ్గింది. పక్కింటి కుర్రాడు తలుపుకొట్టి లోనికి తెచ్చిచ్చిన ఉత్తరం చదువుతూనే అదిరి పడింది.

సుమిత్రా ! నీ జీవితంలో ప్రవేశించి నీకు మరిన్ని సమస్యలు కల్పించాను. బాబుకోసం నెలనెలా కొంతడబ్బ

పంపు తాను. కాదనకు. నీ అమృతహృదయంలో స్థానం లభించిన నేను ధన్యుడ్ని. బాబు స్థిమితపడేవరకూ వాడి కంట పడదల్చుకోలేదు. వాడి తండ్రి స్థానంలో నిల్చొ టానికి నేనెన్నడూ సిద్ధమే !

నీ
సుధీర్

కళ్ళవెంట కారే కన్నీటిని తుడుచుకోవటం కూడా మర్చిపోయిందది సుమిత్ర .... ' ఆ త్యాగమూర్తి కెంతటి కష్టం కల్గించాను ' అనుకుంది.

బాబుకు జ్వరం తగ్గి స్కూలుకు వెళ్ళి వస్తున్నాడు. స్కూలు వద్ద దింపి తీసుకొచ్చే సుధీర్ లేడు.

అడక్కుండానే బొమ్మలు, అమ్మ వద్దన్నా కొత్త బట్టలు కొనే నాన్న లేడు. పాత నాన్న జ్ఞాపకాలు క్రమంగా మరుగున పడుతున్నాయి.

క్లాసులో మాస్టారు చెప్పిన పాఠాలు వింటుంటే క్రమంగా వాడికి " చావు " అంటే తిరిగిరాని చోటు అని అర్థమయింది. తన తండ్రి తిరిగి రాడని వాడికి అర్థమయింది.

మరి సుధీర్ కన్పడటం లేదు. ఆయనా చచ్చి పోయాడా ' అమ్మా....సుధీర్ అంకుల్ చచ్చిపోయాడా? '

బాబు ప్రశ్నతో నిటారుగా అయింది సుమిత్ర
' తప్పు బాబూ ! ఆయన మీ నాన్న....అలా అనకూడదు '

" నాన్నయితే మరి రోజూ వచ్చిస్కూల్లో ఎందుకు దింపడు. స్వీట్లు తీసుకురాడేం....?'

బాబులోని మార్పు గ్రహించిన సుమిత్ర హృదయం తేలికపడింది.

రెండు రోజులు దొర్లిపోయాయి.

స్కూలుకు తయారై టైమయిందని వాకిట్లోకి వచ్చిన బాబుకు.

" రా బాబు ! స్కూల్లో దింపుతాను ...." సుధీర్ ఎదురొచ్చాడు.

" నాన్నా...." పరుగున వెళ్ళాడు బాబు.

సుధీర్ మనసు పులకరించింది " అవును బాబూ ! నాన్ననే...." అన్నాడు ఆనందంగా.

" నేను రాను .... ఇన్ని రోజు లెక్కడికి వెళ్ళావు. కన్పించలేదు అస్సలు " బుంగమూతి పెట్టాడు బాబు అలిగినట్లు.

" అదా! అర్జంటు పనిమీద ఊరెళ్ళాను రా "

" ఇక వెళ్ళవుగా " తండ్రి చేయి పట్టుకున్నాడు.

" వెళ్ళను " సుధీర్ చేయి బాబు చేతిమీద బిగుసు కుంది.

" ఒట్టు "

" ఒట్టు "

సుమిత్ర కేసి చూసి నవ్వి బాబును ఎక్కించుకుని స్కూటర్ స్టార్టు చేశాడు సుధీర్ సంతోషంగా.

వాళ్ళిద్దరూ కనుమరుగయ్యే దాకా చూస్తూ నిలబడిన సుమిత్ర లోనికి నడిచి భగవంతుని ముందు కృతజ్ఞతా భారంతో నమస్కరించింది.

( ' ఆంధ్ర భూమి ' మాస పత్రిక )

# అపరాజిత

ఉదయం నిద్ర లేస్తూనే ఎదురింటి మేడలో వినిపిస్తున్న ఏడుపులకి చలించి పోయాను. పనిమనిషి వస్తూనే చెప్పింది.

" పాపం ! వనజమ్మ మొగుడు అమెరికా నుంచి వస్తూ విమానంలోనే చనిపోయాడుట గుండె ఆగి "

నా మనసును కలచివేసిందా వార్త.

ఆరునెలలు తిరక్కుండానే పసుపు కుంకమలు పోగొట్టుకున్న వనజ దురదృష్టం ఎవ్వరికీ ఉండకూడదు! ఆమెకు విధి విధించిన శిక్షకన్నా సమాజం విధించబోయే శిక్ష నన్ను ఎంతగానో కలవరపెడుతోంది.

నాకు సుమతి అత్తయ్య గుర్తుకు వచ్చింది.

అవును....

సుమతి అత్తయ్య్య సమాజం రంగులు తుడిచేస్తే వెలిసిపోయిన బొమ్మలా మనం పోగొట్టుకున్న మానవత్వంలా ఉండేది. అత్తయ్యతో తన పరిచయం విచిత్రంగా జరిగింది.

తను స్కూల్లో పదవ తరగతి చదువుకొంటున్న రోజులవి. ఓ రోజున నాన్న ఊళ్ళో లేనప్పుడు నాన్న పేరు మీద ఓ కార్డు వచ్చింది. అందులో క్లుప్తంగా ఇలా వ్రాసి ఉంది.

చి॥ విశ్వానికి ఆశీస్సులు.

ఎన్నాళ్ళకిందో మర్చిపోయిన నన్ను మళ్ళీ మీకు గుర్తుచేసుకుంటున్నాను. మీ వూళ్ళోనే నేను బదిలీమీద టీచర్‌గా వస్తున్నాను. రెండుగదుల పోర్షన్ ఏదైనా దొరుకుతుందేమో చూసిపెట్టు. మిగతా సంగతులన్నీ వచ్చాక మాట్లాడుకుందాం.

అక్క
సుమతి

ఆ ఉత్తరం చూసి అమ్మ బరువుగా నిట్టూర్చింది.

అమ్మ అప్పుడు ఎందుకు నిట్టూర్చిందో నాకు అర్థంకాలేదు. బంగారుకలలు కంటూ జీవితం అంతా గులాబీల తోటగా భావించే నాకు ఆగులాబీల వెనుక ఉన్న ముళ్ళు తెలియవు. సమాజం రంగుటద్దాల వెనుక దాగిన నీలినీడల గురించి అసలే తెలియదు.

ఆ రోజు సుమతిఅత్తయ్య వస్తుందని నాన్న స్టేషన్‌కి వెళ్ళారు.

అమ్మ వంటచేసి రెడీగా వుంచింది. వాకిట్లో రిక్షా ఆగిన చప్పుడుకు నేను గేటు దాకా పరిగెత్తాను.

"రా అక్కా! బ్యాగు నేను తెస్తాలే" అత్తయ్యను ఆహ్వానిస్తూ నాన్న బ్యాగు తీసుకొచ్చారు.

నాన్న వెనకాల తల నెరిసి, కళ్ళద్దాలతో భారీగా పచ్చని మేనిఛాయతో హుందాగా ఉందామె. గోధుమ రంగుకు పచ్చంచు ఉన్న ఖద్దరుచీర కట్టుకొన్నావిడే సుమతి అత్తయ్య అని అందరికీ అర్థమయిపోయింది.

ఆవిడని చూడగానే గౌరవాభిమానాలు కలిగా యందరికీ!

కాళ్ళు కడుక్కోనేందుకు నీళ్ళిచ్చి ఆవిడ లోనికి వచ్చి కూర్చున్నాక మంచినీళ్ళందించాను.

"ఏరా విశ్వం! నీ పిల్లల్ని పరిచయం చేయి నిన్ను పెళ్ళిలో చూడటమేగదా" ఆప్యాయంగా అందావిడ.

"ఇది పెద్దమ్మాయి సుధ. బి. ఎ. మొదటి సంవత్సరం" అక్కని చూపించారు. ఆవిడ అందంగా నవ్వింది అక్కని చూసి

"ఇది శ్యామల రెండోది. పదోక్లాసు చదువుతోంది" నన్ను చూపించారు నాన్న.

ఆవిడ నాచేయి పట్టి పక్కన కూర్చోబెట్టుకుంది ప్రేమగా. "వీడు సుధాకర్ చిన్నవాడు....ఏడోతరగతి" తమ్ముణ్ణి పరిచయంచేశారు నాన్న.

ఆ తర్వాత పదిరోజులు మాయింట్లో ఉంది అత్తయ్య. నేను అత్తయ్యకి బాగా చేరిక అయ్యాను. దానికి కారణం అత్తయ్య రాబోయే ముందురోజు రాత్రి నాన్న విన్పించిన ఆమె కథే: ఆమెని చూస్తుంటే ఆకథే నా కళ్ళముందు మెదుల్తోంది.

  

తొమ్మిదేళ్ళకే అత్తయ్యకి తాతయ్య పెళ్ళి చేశారా రోజుల్లో. ఆడపిల్ల ఈడేరకముందే పెళ్ళి చేయకపోతే.... తలవంపులు! పైగా సంఘంలో చులకనగా చూసే వాళ్ళుట! మరి....బాల్యవివాహాలు అన్యాయమని ఎందరో సంఘ సంస్కర్తలు ప్రబోధిస్తున్నా జరుగుతూనే ఉండేవట!

పెళ్ళి ఊరేగింపులో సుమతి కూర్చున్న పల్లకీ కొమ్ము విరిగి పడిపోయింది. అందరూ దాన్ని అపశకునంగా భావించి గుసగుసలాడుకున్నారు.

పదహారు రోజుల పండగలోపే అత్తింటినించి సుమతి భర్త చనిపోయినవార్త వినగానే నాయనమ్మ పడిపోయి ఇక లేవనేలేదు. కానీ సుమతికివేం అర్థం కాలేదు. భర్త పోయినదానికంటే తల్లి పోయిన దుఃఖంనించి తేరు

కోటానికి దాదాపు సంవత్సర కాలం పట్టిందా పసిమనసుకు. కూతుర్ని ఓ మనిషిని చేయటానికి తాతయ్య పూర్తిగా తన జీవితాన్నే అంకితం చేశాడు. "ఆడపిల్లను చదివించటం అరిష్టం" అని బంధువులంతా ఆడిపోసుకుంటున్నా సుమతిని భాషా ప్రవీణ చదివించాడు ఆ చదువుకోసం ఆయన సమాజం సవాలును ఎంతగానో ఎదుర్కోవలసి వచ్చింది. మిగతా మగపిల్లలు దీనికి వ్యతిరేకించినా వాళ్ళందరిలో తండ్రికీ అక్కకీ సపోర్టుగా కొండంత అండగా నిలిచింది విశ్వనాథం ఒక్కడే! స్వంత తమ్ముడు కాకపోయినా అంతకంటే అండగా నిలిచాడు.

భాషా ప్రవీణ పూర్తయేసరికి తండ్రి వార్ధక్యంతో జీవనపోరాటంలో అలసిపోయి ఉన్నాడని గ్రహించింది సుమతి. అన్నలు ఆయన్ని ఆదరించరని తెలుసు. విశ్వనాథం పెళ్ళిచేసుకుని ఉద్యోగస్తుడుగా సంఘంలో స్థిరపడ్డాడు. అందరికీ దూరంగా ఉన్న వూళ్ళో టీచరుగా వేయించుకొని తండ్రితో వెళ్ళిపోయింది సుమతి. ఆమె దృష్టిలో తండ్రి దేవుడు. అందరూ చులకన చేసినా తన కంటూ ఒక జీవితాన్ని ప్రసాదించిన మహోన్నతమూర్తి. అందుకే ఆమె తండ్రిఫోటోకే పూజచేసేది.

సమాజంలో తండ్రిపోయాక ఒంటరిగా నిలిచిన సుమతి మ రిం త గా కష్టాలను భరించవలసివచ్చింది.

వంటరిగా ఉన్న ఆడది. ఆడవారికి కూడా చులకనే! తను చెడిపోయిందన్నా పట్టించుకోలేదు. తండ్రి ఇచ్చిన మనోధైర్యంతో విద్యాధనంతో ఆత్మస్థైర్యంగా ముందుకు సాగిపోయింది.

పురుషాధిక్యత ప్రతిరంగంలో కన్పిస్తున్న సంఘంలో ఉద్యోగినిగా ఆమె ఎదుర్కొన్న సమస్యలు కూడా ఎక్కువే! ఆమెను వివాహం చేసుకునే వ్యక్తులు ఒకరిద్దరు తండ్రి వున్న రోజుల్లో తారసపడినా తన తండ్రిని దిక్కులేనివాడిగా వదిలేయటానికి ఇష్టపడలేదామె. తన ఉద్యోగం చూసి వివాహమాడి ఉద్ధరించామనే ఫోజులిచ్చేవారని గ్రహించిన సుమతి ఏహ్యతతో వారికి దూరమయింది. ఇన్నాళ్ళు ఒంటరిజీవితాన్ని గడుపుతూ తనవారందరికీ పరాయిదానిలా బ్రతుకుతున్న సుమతికి మళ్ళీ తమ్ముడి వూరిలోనే పోస్టింగ్స్ రావటంతో రాక తప్పలేదు.

తన అడ్రస్‌కూడా ఎవ్వరికీ తెలియజేయకుండా దూరతీరాలకు పారిపోయిన సుమతి అత్తయ్య ప్రవర్తన నాన్న చెప్పిన కథకు భిన్నంగా ఏమీ లేదు. మాది సొంత ఇల్లే అయినా చిన్నదవటం చేతను ప్రక్క ఇంట్లోనే చిన్న పోర్షన్‌ను అద్దెకు తీసుకొంది.

నిరాడంబరంగా సాగే ఆమె దిన చర్య నాకు ఎంతో నచ్చింది. ఉదయం లేవగానే వాళ్ళ నాన్న ఫోటోకి దండం పెట్టుకుంటుంది. ఆమె దృష్టిలో తండ్రే గదా భగవంతుడు !

ఆ రోజుల్లో స్త్రీగా, వితంతువుగా, ఉద్యోగినిగా సమాజం సవాలును ఎదుర్కొని ఎంత వత్తిడికి తాను లోనయిందో అత్తయ్య చెప్తుంటే నాకు చాలా బాధగా అన్పించింది.

ఆమె చెప్పేవన్నీ కథలుగా తోచినా కఠోర సత్యాలు:

సుమిత్ర అత్తయ్య లాంటి ఎందరు సాహసవంతులైన స్త్రీల కృషి ఫలితంనల్లనో మనం ఈ మాత్రమైనా వున్నాము. అత్తయ్యని ఆనాడు అన్నలు సంఘం వెలివేసినా ఈనాడు ఆమె కొంత ఆస్తి నేర్పరుచుకొని ధనవంతురాలయి సమాజంలో ఒక విశిష్ట స్థాయిని చేరుకుంది కాబట్టి గౌరవం పొందుతోంది. వంటింట్లో సాగవలసిన జీవితాన్ని ఆదర్శంగా తీర్చిదిద్దారు తాతయ్య. ఇప్పుడు ఆస్తికోసం అన్నల మనసుల్లో ప్రేమ అంకురించిందని శుష్కహాసం చేస్తుంది సుమతి అత్తయ్య :

సమాజంలో అడుగడుగునా వంటరిగా జరిపిన పోరాటంలో బాగా అలసిపోయిన అత్తయ్య ఆరోగ్యం

ఏమీ బాగాలేదని గ్రహించాను. ఏ మాత్రం నరాల ఉద్రి క్తతను తట్టుకొనే శక్తి ఆమెలో లేదని డాక్టరు ఆమెతో చెప్పటం వెంట వెళ్ళిన నేనూ విన్నాను.

అత్తయ్య స్టూడెంట్సు ఆమెను విపరీతంగా అభి మానించేవారు. తన ఆరోగ్య పరిస్థితిని లెక్కచేయకుండా జీవన సంధ్యా సమయంలో కూడా తన విజ్ఞానాన్ని నలుగురికి పంచి ఇచ్చే ప్రయత్న ఫలితంగా ఆమెని స్టూడెంట్సంతా ఆరాధించే వారు. "ఆడవాళ్ళు ఉద్యోగాలను చీరలకోసం నగలకోసం చేస్తారు. కర్తవ్యాన్ని సరిగ్గా నిర్వర్తించరు" అనే ప్రథను దూరంచేసిందామె నిజంగా.

" శ్యామలా ! రా....లోపలికి " ఆదివారం కాబట్టి విశ్రాంతిగా ఉంటుందని వెళ్ళిన నన్ను సాదరంగా ఆహ్వానించింది.

తలంటుపోసుకున్నట్లుంది వెండి తీగల్లాంటి వెంట్రుకలు ఆమెకేదో దివ్యత్వాన్ని ఆపాదిస్తున్నట్లుగా అనిపిస్తున్నాయి నాకు. లోపలికి వెళ్ళికూర్చున్నాను.

"ఏమిటోయ్....విశేషాలు." అంటూ మాట్లాడుతూనే చాప వేసుకొని బీరువా లోంచి బట్టలు తీసి చాపమీద పడేస్తోంది.

" మీకిష్టమని .... అమ్మ .... పెరుగు పచ్చడి పంపించింది "

నా బహువచన ప్రయోగాన్ని మాన్పించాలని చాలా సార్లు విఫల ప్రయత్నం చేసింది అత్తయ్య.

" మీ అమ్మకి నేను ఋణపడిపోతున్నాను శ్యామలా! అలా అలమారలో ఉంచు. ఇవ్వాళ సెలవుకదా అని బీరువాలో చిందరవందరను సర్దుకుంటున్నాను. "

నేను క్రింద చాపమీద కూర్చుని ఆమె వారిస్తున్నా వినకుండా బట్టలు మడతలు పెడుతున్నాను.

" నీకెందుకు శ్యామూ.... పరీక్షలు దగ్గరికొస్తున్నాయి. చదువుకో పోయి...."

" ఫర్వాలేదు లెండి...." అంటుండగానే హఠాత్తుగా బట్టల మధ్య కన్పించిన చిన్న ఆల్బమ్ నా దృష్టిని ఆకర్షించింది.

తీసుకొని ఫోటోలు చూస్తున్నాను. చిన్నప్పుడు సంస్కృతం చదివే స్కూల్లో తోటి విద్యార్థినులతో కలసి తీయించుకున్నవీ, ఉద్యోగంలో చేరిన కొత్తల్లో సహోద్యోగినులతో కలసి తీయించుకున్నవీ చాలా రకాల వయసులకు సంబంధించినవే ఉన్నాయి. ఆ ఫోటోలో ఎంత అందంగా ఉంది ! "విధవరాలు" ఆ శబ్దానికి అర్థం తెలీని వయసులో సమాజం నిర్దాక్షిణ్యంగా కాలరాచిన గులాబీపూవులా ఉందామె ఫోటోల్లో !

అప్పటికే నాకు ఏర్పడిన చనువుతో అడిగాను "మీరేమీ అనుకోనంటే ఒక మాటడుగుతానత్తయ్యా"

"అడుగు శ్యాముా...."

"మీరు మళ్ళీ పెళ్ళి చేసుకొని ఉండాల్సింది" భయం పడుతూనే అన్నాను.

నేనూహించినట్లు ఆమె కోపగించుకోలేదు. చల్లగా నవ్వింది.

"ఈ మాట ఎందరో అన్నారు శ్యామూ! ఎన్నో విధాల సమాజాన్ని ఎదిరించిన నాన్నకు నా అండ కూడా లేకపోతే చివరిదశలో ఆయన్ని ఎవరు చూస్తారు. చివరి దశలో నాతో పాటుగా నా తండ్రిని కూడా ఆదరించే వ్యక్తి నా జీవితంలో తారస పడలేదు. నాన్న పోయే నాటికి నాలో వివాహం మీద కోరిక కూడా చచ్చిపోయింది." తండ్రి ప్రసక్తి వచ్చేసరికి ఆమె కళ్ళు ఆనంద తరంగిత మవటం నేను గమనించాను.

ఆ ఆల్బమ్‌లోని మరో ఫోటో నా కళ్ళను మరల్చనీయలేదు. పువ్వుల చీర, నల్లని బ్లౌజ్‌లో తలనిండా పువ్వులు! చేతికి గాజులతో బాబుని ఎత్తుకొని వున్న ఈమెవరు? ఈమెలో అత్తయ్య పోలికలు విస్పష్టంగా కన్పిస్తున్నాయి. అత్తయ్యకి తోబుట్టువులు లేరుగదా!

నా ఆలోచన చూసి ఆల్బమ్‌లోకి తొంగి చూసిన అత్తయ్య చిన్నగా నవ్వింది.

“నేనేనమ్మా! ఆశ్చర్యంగా ఉందా! నాకూ మీలాగే అలంకరించుకోవాలనీ అన్పించేదారోజుల్లో-బొట్టు పెట్టుకోవాలనీ, చేతులనిండా గాజులు వేసుకోవాలనీ, ఒక బాబు చేత అమ్మా అని పిలిపించుకోవాలనీ.... కానీ ఆ అవకాశం ఏదీ....నేను విశాఖపట్నంలో వున్నప్పుడు.... మా పక్కింటి అమ్మాయి నా ప్రాణంలా మసిలేది....ఆమె నన్ను బలవంతపెట్టి....ఇలా నా కోరికను....ఒక స్వప్నంలా నిలిపింది .... ఇప్పుడెక్కడున్నారో! .... ” అత్తయ్య గొంతు జీరపోయింది నిట్టూర్పుతో-

నా కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

స్త్రీకి సమాజంలో ఎంతఅన్యాయం జరుగుతోందో నాకిప్పుడప్పుడే అర్థమవుతున్నట్లుగా అనిపించింది.

భార్యపోయిన ఆరునెలలు తిరక్కుండానే భర్త మరో పెళ్ళి చేసుకుంటాడు. అతన్ని 'విధురుడు'గా చూపే చిహ్నాలేవీ సమాజం నిర్ణయించలేదు. కానీ పసితనంలోనే భర్త మొహం కూడా గుర్తుతెలీనీ పాపలకి “విధవ” అని పేరుపెట్టి ఆజన్మాంతం ఆమెకు పుట్టుకతో సంక్రమించిన పసుపు కుంకుమలు, గాజులు, బొట్టు, పువ్వులకు దూరంచేసే హక్కు ఈ సమాజానికి ఎవరు ఇచ్చారు....?

నా ఆలోచన, ఆవేదన గ్రహించి, నా బుజం మీద చేయి వేసింది అత్తయ్య :

" శ్యామలా: నీలాగే....నీ కంటే ఎంతో ఆలోచించే దాన్ని: ఆ సమస్యలు ఇప్పుడు చాలావరకు తగ్గాయనే చెప్పాలి. ధైర్యంగా చాలామంది స్త్రీలు ఎదిరించి తమకు కావలసినవి పొందగలుగుతున్నారు. నేను కూడా విద్య కోసం పట్టుబట్టినంతగా వైవాహిక జీవితం కోసం పోరాడ లేదు. "

ఇటువంటి సంఘటనలు, ప్రస్తావనలు మా మధ్య చాలా జరిగాయి. ఆమె శేష జీవితాన్ని మా మధ్య గడపటం వలన ఆమె అనుభవ జ్ఞానం నా ఆలోచనలకు మరింత పదును పెట్టింది.

" అమ్మగోరూ: మీ సుట్టం పలకట్లేదు...." ఆ రోజు ఉదయాన్నే పనిమనిషి గావుకేకలకి ఇంటిల్లిపాదీ లేచాము.

నాన్న, అమ్మ గబగబా అత్తయ్య ఇంటికి పరిగెత్తారు నేను వెనకాలే పరిగెత్తాను దడదడలాడుతూ.

" అంతా అయిపోయింది : ఏ రాత్రో వెళ్ళి పోయింది...." అత్తయ్య నాడి, కళ్ళు చూసి నాన్న టవల్ మొహంమీద కప్పుకున్నారు.

తలుపుగడియ విరకొట్టి చూశాకనే ఇంటివాళ్ళు కబురు చేశారని మా కర్థమయింది.

"ఏమయింది ఇంతలోనే అత్తయ్యకు? నిన్న నాతో అన్ని కబుర్లు చెప్పి ఆలోచనా తరంగాలు లేపిన ఆ చైతన్య మూర్తి .... అంత ప్రశాంతంగా స్తబ్దంగా ఎలా పడుకొని ఉంది!" నాలో నేను మధనపడుతున్నాను. దుఃఖం రావటం లేదు. సముద్రపు అలపై కెగిసి క్రిందికి దిగకుండా మధ్యలోనే గడ్డకట్టి ఆగిపోయినట్లుంది నా మనస్సు.

"నిన్న ఈ వుత్తరం చదువుకుంటూ కళ్ళుతుడుచుకుంటున్నారండీ....అడిగితే నవ్వి వూరుకున్నారు" ఇల్లుగలావిడ బల్లమీద చూపించిన ఉత్తరం అందుకొని చదివారు నాన్న. అత్తయ్యని వ్యక్తిగతంగా దూషిస్తూ పెదనాన్న రాసిన ఉత్తరం. కులం చెడిందనీ, మానం మంట గలిపిందనీ వ్రాస్తూ చివర్లో తన కొడుకుని దత్తు తీసుకుంటే తాము ఇద్దరు అన్నలూ ఆమె రిటైరు అయినాక జాలి తలచి తమలో కలుపుకుంటామని వ్రాసి ఉంది. అత్తయ్యకి రిటైరుమెంట్ తేదీ దగ్గర పడిందన్న విషయం నాకు గుర్తొచ్చింది.

నాన్న బాధపడుతూ అమ్మకి చెప్తుంటే విన్నాన్నేను.

అన్నింటికీ అతీతంగా ప్రశాంతంగా నిదురిస్తున్నట్లు పడుకొన్న అత్తయ్య మూసుకున్న విశాలనయనాల వెనుక జీవితాంతం పడిన వ్యధ ఎందరికి తెల్సు! ఇలాంటి అభాగినుల జీవితాల అడుగు జాడల్లో భావితరం వారు తప్పటడు

గులు నేర్చుకుంటూ ఆదర్శ శిఖరాలవైపు పయనించటం తప్పదా .... నా చెంపల వెంట నాకు తెలీకుండా కన్నీరు మబ్బుజల్లులా కురుస్తోంది. అది ఆమె చావుకు కాదు, వ్యధతో ముగిసిన ఆమె ఆఖరిక్షణం గురించి ....

ఆఖరిక్షణం ప్రశాంతంగా కన్నుమూయాలనేది మనిషి కనీసపు కోరిక: తన వారు లేకపోగా ఒంటరిపోరాటం సాగించిన ఆ తేజోమూర్తిని ఆఖరిక్షణందాకా వెంటాడి వేధించిన ఈ సమాజపు స్వార్థం, రక్తసంబంధీకుల కుటిలత్వం నా మనసులో ముళ్ళలా గుచ్చుకుంటున్నాయి.

ఈ నా భావాలు ఎవ్వరికీ చెప్పుకోలేక అత్తయ్య నిర్జీవ దేహం వైపు చూస్తూ నిలబడి ఉండిపోయాను అచేతనంగా ! అమ్మ నాచేయి పట్టుకొని దగ్గరిగా తీసుకొంది. అమ్మ వళ్ళో తలదాచుకొని బావురుమన్నాను. తల మీద చేయి వేసి నిమురుతూ ఉండిపోయింది అమ్మ.

స్వహస్తాలతో మోసి స్టూడెంట్స్ సుమతి అత్తయ్యను అంతిమ యాత్రలో సాగనంపారు. ఏ జీవితానికయినా అంతిమ వీడ్కోలు ఆత్మీయుల కన్నీటితోనే కావలసింది !

ఆమె వీలునామా తెల్సుకొని పెద్దనాన్న తిడుతూ పెద్ద ఉత్తరం వ్రాశాడు. మొదలుపెట్టి సగందాకా చదివిన నాన్న బాధపడుతూ మిగతాది చదవలేకపోయారు.

అత్తయ్య ఆస్తిలో సగం తాను చదువుకొన్న సంస్కృత పాఠశాలకూ, మిగతా సగం ఆ ఫోటోలో తన చేతుల్లో ఉన్న బాబుకూ వ్రాసింది. ఆ బాబు ఎక్కడున్నాడో తెలీదనీ, ఆరాతీసి ఆస్తిని అప్పగించాల్సిన బాధ్యత నాన్నమీద పెట్టింది. ఆ వీలునామా చదివాక అత్తయ్య ఏమిటో నాకు పూర్తిగా అర్థమయింది.

జీవితమంతా మధుర స్వప్నంలా మాతృత్వాన్ని ఊహాలోకంలోనైనా అందించిన ఆ బాబు ఆమెకు భావనా లోకంలో ఎంతచేరువైనాడో !

నాన్న డైరీలో అత్తయ్య గురించి వ్రాసుకున్న ఆఖరి మాట—

" సుమతి అక్క అపరాజిత " అని. అంతేకాదు నాన్న ఎంతో గౌరవించే వ్యక్తి కూడా ఆమే !

( ' కలువబాల ' వక్ష పత్రిక )

# ప్రేమంటే ఇదే ఇదే

హాస్పిటల్లో అంతా హడావుడిగా ఉంది. వాతావరణం అంతా సందడిగా ఉంది.

డాక్టర్లు, నర్సులు యంత్రాల్లా చకచకా పనులు చేసేస్తున్నారు. తెల్లకోట్లు, స్టెతస్కోపులు, చిరునవ్వులు, తెల్లగౌన్లు, చిట్లింపు మొహాలు, తళుక్కు నవ్వులు, ఇంజక్షన్ల చురుక్కులతో హాస్పిటల్ దినచర్య కొనసాగుతోంది.

పగలంతా శ్రమపడి అలసిసొలసి కందిపోయిన మొహంతో ఇల్లు చేరుకుంటున్నాడు సూర్యుడు. చల్లగాలి విరియబోతున్న సన్నజాజి మొగ్గల బుగ్గల్ని సుతారంగా నిమురుకుంటూ ముందుకు సాగిపోతోంది.

కిటికీలోంచి అస్తమిస్తున్న సూర్యుడ్ని చూస్తూ నిట్టూర్చింది దీపిక. 'తన బ్రతుకులాగే అస్తమిస్తున్నాడు'

అనుకొంది. ఎంత బంగారు భవిష్యత్తు ఉందని తను భావించింది. తను కన్న కలలన్నీ ఎందుకిలా కరిగి పోతున్నాయి! తన ఎంపికలోనే లోపం ఉందా! ఆమె ఆలోచనలు గతంలోకి వేగంగా పరుగెత్తుతున్నాయి.

  

తెర తీయగానే చప్పట్లతో ఆడిటోరియం మారు మ్రోగింది.

క్షీరసాగర మధనంలో మోహిని పాత్రలో నృత్య భంగిమలో నిలిచిన దీపికను అంతా కళ్ళార్పకుండా చూస్తున్నారు! ఆనాటి కార్యక్రమంలో దీపిక మోహిని లాగే అందరినీ ఆకట్టుకొన్నది. సౌందర్యదేవతలా కన్పించే ఆమె నాట్య చాతుర్యం బంగారానికి తావి అబ్బినట్లుగా అన్పిస్తున్నది. అమర నాట్యమంటే ఎలా ఉంటుందో తెలియదుగానీ ఇంతకంటే మనోజ్ఞంగా ఉంటుందని మాత్రం ఎవరూ అనుకోరు.

నాట్యం ముగిసి తెర వాలితేగాని అందరూ వాస్తవం లోకి రాలేదు.

గ్రీన్ రూమ్‌లోని దీపికను అభిమానులు పొగడ్తలతో ముంచెత్తుతున్నారు.

"మీ నాట్యం నా మనసుకు ఎంతో హాయి నిచ్చింది" పొగడ్తల మధ్యగా అనుభూతితో ధ్వనించిందో స్వరం....

దీపిక ఆ వైపుగా తల త్రిప్పి చూసింది.

సుమారు పాతికేళ్ళుంటాయా యువకునికి. లాల్చీ పైజామాతో గంభీరంగా వున్నా కళ్ళు పలకరింపుగా నవ్వుతున్నాయి. అతని గొంతులోని చిరుగంటల సవ్వడి ఆమె హృదయ తంత్రులను మీటింది.

"థ్యాంక్స్" అంది చిరునవ్వుతో అతనికేసి చూస్తూ.

'మీరేమీ అనుకోకపోతే మీతో ఒకసారి మాట్లాడే అవకాశం కావాలి' అభ్యర్థన కాదు, ఆజ్ఞాపనలా ఆమె భావించింది.

"రేపు సాయంత్రం మా యింటికి రండి ! తీరికగా మాట్లాడుకోవచ్చు" విజిటింగ్ కార్డు అందించిందామె.

అందుకుని మౌనంగా వెళ్ళిపోతున్న అతన్ని ఆపి "మీ పేరు" అంది.

"మాధవ్" అని చెప్పి వెళ్ళిపోయాడు.

"మాధవ్"—మరోసారి అతని పేరు మెల్లగా ఉచ్చరించింది దీపిక. ఇంతమంది వివిధ రంగాలలోని వ్యక్తులతో పరిచయం వున్నా మాధవ్ గొంతు వినగానే దీపికలో ఏదో అలజడి....

మర్నాడు సాయంత్రం వరకూ మాధవ్ రాకకు ఎదురుచూస్తూనే వుందామె. అతన్ని చూస్తూనే—

"రండి" ఎదురెళ్ళి ఆహ్వానించింది.

టీ చేసి స్వయంగా తీసుకొచ్చి ఇచ్చింది.

" మీకు శ్రమ ఇస్తున్నాను " అన్నాడతను ఇబ్బందిగా.

"నో ! నెవర్ మైండ్"

"నేను మీ నాట్యాన్ని చూశాక చాలా ఆనందించాను. ప్రతి కళలోనూ జీవం వుంటుంది ! అయితే అది ప్రదర్శించగలిగేది కొందరే కళాకారులు."

పొగడ్తలు ఇష్టంలేనట్లు ఫీలయ్యే ఆమెను చూసి చిరునవ్వు నవ్వి ఇలా అన్నాడు.

"చూశారా ! ఇదే నా బలహీనత ! ఎదుటివాళ్ళ పరిస్థితి గ్రహించకుండా నా అతి వాగుడుతో ఇబ్బంది పెట్టేస్తుంటాను. ఇంతకూ వచ్చిన పని మరిచేపోయాను చూడండి ! "

చెప్పమన్నట్లు కుతూహలంగా చూసింది దీపిక.

ఆమె అందమైన పెద్ద పెద్ద కళ్ళలోకి చూశాడతను.

"నే నొక నృత్యరూపకం తయారుచేశాను. దానిలో ప్రధాన పాత్ర మీరు ధరిస్తే బాగుంటుందనుకుంటున్నాను"

"ఏదీ స్క్రిప్టు నన్ను చూడనీయండి"

తను తెచ్చిన స్క్రిప్టును ఆమెకు హృదయంలా అందించాడు.

" మీరు కవులా ? "

"ఆ....ఏదో చిన్న చిన్న గేయాలు, పాటలు వ్రాసి పాడుతుంటాను"

"అంటే మీరు గాయకులు కూడా నన్నమాట. ఒక్క పాట పాడండి. "

"ఏదో గాలి పాటలు లెండి! సంగీతం ఏమీ నేర్చుకోలేదు"

"అలా కాదు! నాకోసం పాడండి ప్లీజ్! "

మాట్లాడితేనే మధురిమలొలికే అతని కంఠంలో కృష్ణశాస్త్రి భావగీత మొకటి తేనెవాకలా ప్రవహించింది. ఆమె ఆ పాటలో లీనమై పరిసరాలే మార్చిపోయింది!

"ఎంత బాగుంది" మనసులో మాట పైకి అనేసింది.

అతను మళ్లీ చిరునవ్వునవ్వాడు.

ఆ చిరునవ్వు ఎంత మనోహరంగా ఉంది!

" నేను చెప్పిన విషయం ఆలోచించండి మరి! వస్తాను " అని సెలవు తీసుకొని వెళ్తున్న అతనికేసి చూస్తుండిపోయింది దీపిక.

ఆ తర్వాత మాధవ్ రచనలు, రూపకాల్లో దీపిక ప్రధాన పాత్రగా జీవం పోసుకొని ఆంధ్ర ప్రేక్షకులకు కనువిందు చేయటం ఆరంభమయింది.

ఆ ఇద్దరు కళా తపస్వినుల హృదయాలు పరస్పరం చేరువ కావటంలో వింతకూడా ఏమీ లేదు.

" మాధవ్ "

" ఊ "

" మన పెళ్ళెప్పుడు "

పార్కులో గడ్డి పరకలు తెంపుతున్న అతను ఉలిక్కిపడి నిటారుగా అయ్యాడు.

"అవును ఎప్పుడు ? " ప్రశ్నించాడు.

" అసలు అమ్మ ఒప్పుకుంటుందా అని నా సందేహం: నా గురించి ఎన్నో బంగారు కలలుగనే అమ్మకి నువ్వంటే ఇష్టం లేదు."

" నే నామెతో మాట్లాడుతాను "

" చీకటి పడింది ఇక వెళ్దాంపద. మాధవ్ ! " అంటూ భారమైన మనసుతో లేచింది దీపిక.

గదిలోకి వచ్చి లైటువేసి, కుర్చీలో కూలబడింది. తలనెప్పిగా అనిపిస్తోంది. కణతలు రుద్దుకుంటూ తలెత్తింది. ఎదురుగా అపరకాళిలా అమ్మ !

ఆమె గుండెలు దడదడ మంటున్నాయి.

"షికార్లు అయ్యాయా !" పిడుగు పడినట్లు అడిగిన తల్లివైపు అలాగే చూస్తూ ఉండిపోయింది.

" నువ్వేం చిన్నపిల్లవు కావు, చెబితే అర్థం చేసుకోక పోవటానికి. ఎవర్నయినా హద్దుల్లో ఉంచితేనే అందం. బావ వచ్చేనెలలోనే వస్తున్నాడు తెలుసా "

" బావ పేరు వింటేనే నాకు వళ్ళంతా గొంగళి పురుగు పాకినట్లు ఉంటుంది. మాధవ్ చాలా మంచివాడమ్మా" ఏదో చెప్పాలని ఆరాటపడుతున్న కూతుర్ని మధ్యలోనే ఆపింది జయమ్మ.

" నువ్వేం చెప్పవద్దు. నీకు అందంవుంది, డబ్బు ఉంది. పేరు ప్రఖ్యాతులున్నాయి. మీ నాన్న పోయినా నిన్ను ఇంత దాన్ని చేసింది నేను. నా మాట కాదని నీ వెవరో అనామకునితో స్నేహం చేయటానికి నేను ఒప్పుకోను. వచ్చే నెలలో బావ రాగానే మీ ఇద్దరికీ పెళ్ళి చేస్తే నా బాధ్యత నెరవేరుతుంది...." చెప్పవలసింది చెప్పి, విసురుగా లోపలికి వెళ్ళిపోయింది జయమ్మ. ఆమె వెనకే లోనికి వెళ్ళింది దీపిక.

" అమ్మా "

" మళ్ళీ ఏమిటి " కోపంగా చూసింది.

"అది కాదమ్మా మాధవ్ నన్ను…." ఏదో చెప్పబోయింది దీపిక.

హఠాత్తుగా జయమ్మ స్వరం మృదువుగా మారింది.

"చూడు దీపూ! నీవేం చిన్నపిల్లవు కావు. మాధవ్‌కి నీకంటే నీ నాట్యంపైనే ప్రేమ ఎక్కువ. నీద్వారా వచ్చే డబ్బంటే ప్రేమ."

"కాదమ్మా అది అబద్ధం. నా నాట్యంకంటే నేనంటేనే అతనికి ప్రేమ" ఆవేశంగా అంది దీపిక.

"నీ మొహం! నీకు తెలీదు. ఈ లోకాన్ని నేను కాచి వడగట్టాను! నాకు బాగా తెలుసు. నేనేం చేసినా నీ మంచి చెడుల గురించి ఆలోచించే చేస్తాను. అది మాత్రం గుర్తుంచుకో! నీ సంతోషానికే నా ఆరాటం! మాధవ్ నువ్వనుకున్నంత ఆదర్శ ప్రేమికుడేమీ కాదు" జయమ్మ ఇక చెప్పవలసినదేమీ లేనట్లు తన పనుల్లో మునిగిపోయింది.

ఆలోచనలతో నీరసంగా కూర్చుంది దీపిక. అమ్మ ఎప్పుడూ ఇంతే! చిన్నప్పటినుంచీ బాగానే గుర్తు. అమ్మ చెప్పిన కూరలే తాను తినాలి! చెప్పిన గౌను వేసుకోవాలి—చదవమన్న పాఠం చదవాలి, తనకి ఇష్టంలేని డాన్స్ కూడా బలవంతంగా నేర్పించింది. కానీ క్రమేణా ఆ డాన్సే తనకు ప్రాణమయింది. అమ్మ మంకుపట్టు

ఎన్నో సార్లు తనకి బాధ కలిగించినా ఆవిడకు తనపట్ల వున్న ప్రేమవల్ల అలా చేస్తుంది అని తెల్సు కాబట్టి సరిపెట్టుకుంటూ వస్తుంది. తోటి పిల్లలంతా "అమ్మ కూచి" అని హేళన చేస్తున్నా చిరునవ్వుతో భరించింది. కానీ భర్త విషయంలో కూడా తన మనసు అమ్మకి అవసరంలేదు. ఈ విషయంలో కూడా తనకే హక్కు లేదా! ఆ చింపాంజీ హిప్పీ తనకు కాబోయే భర్త అంటుంది కానీ ఆ రూపమే తనకు వెగటుగా వుంటుంది.

ఒక నిర్ణయానికి వచ్చినట్లుగా "నువ్వు చెప్పినవన్నీ ఆలోచించాను. నేను మాధవ్‌ని తప్ప మరెవర్నీ పెళ్ళి చేసుకోను" అని ఓ చీటీపై వ్రాసి అమ్మ రోజూ పడుకోబోయే ముందు చదివే భారతంలో పెట్టింది.

ఏమైనా సరే! ఈ విషయంలో తను అమ్మను ఎదురిస్తున్నది. మొదట్లో అమ్మకి కోపం వచ్చినా తనమీద అమ్మకి ఎంత ప్రేమ వుందో తెల్సు కాబట్టి ఆవిడ ప్రేమ తప్పకుండా కోపాన్ని కరిగిస్తుంది. మాధవ్, తనూ హరివిల్లులాంటి జీవితం....ఆలోచనల మధ్య నిద్ర పట్టేసింది దీపికకు.

మర్రాడు ఉదయం డాన్స్ ప్రాక్టీసు చేసుకుంటున్న దీపికకు ప్రక్క గదిలో తన జీవితం గురించి తనకు తెలియ కుండానే తీసుకోబడే నిర్ణయాల గురించి తెలియదు.

"పిలిచారట" మాధవ్ అడిగాడు. అతని మొహం ప్రశాంతంగా వుంది.

"అవును కూర్చో బాబూ"....ప్రేమగానే జయమ్మ అంది.

మాధవ్ కూర్చున్నాడు.

"దీపికను పెళ్ళిచేసుకుంటానని అన్నావట గదా !"

"అవునండీ" ఆనందంగా అన్నాడు.

"దీపూని నిజంగా ప్రేమిస్తే నువ్వు ఆమెను మర్చిపో. ఆమె బావ వచ్చే నెలలో అమెరికానుంచి వస్తాడు....శ్రీధర్‌కు అమెరికాలో పలుకుబడి, డబ్బు వుంది. అతన్ని చేసుకుంటే దీపూ జీవితం వన్నెపెట్టిన బంగారం అవుతుంది."

మాధవ్ మొహం పాలిపోయింది. జయమ్మ మాటలు అతని హృదయాన్ని తూట్లు చేస్తున్నాయి.

"నన్నేం చేయమంటారు" హీనస్వరంతో అడిగాడు.

"నీ యిష్టం ! అది చిన్నపిల్ల ! దాని భవిష్యత్తు కోసం నేనెంత శ్రమించానో నీకు తెలియదు. నువ్వు దాని జీవితంలోంచి వెళ్ళిపోతే అది సుఖపడుతుంది. నువ్వీ వూరు వదిలివెళ్ళు"

బొమ్మలా కదిలాడు తను. జాలిగా చూస్తూండి పోయింది జయమ్మ. కదులుతున్న ఫ్లాట్‌ఫారంపై ఆరోజు సాయంత్రం రైలు ఎక్కాడు మాధవ్.

అతని మనస్సు చేదు తిన్నట్లుగా వుంది. గార్డ్ విజిల్ వేశాడు. రైలు కదిలింది మెల్లగా. పరుగెత్తుకుంటూ తనకేసి వస్తున్న కుర్రాడి చేతుల్లోంచి చీటీని ముందుకు వంగి అందుకున్నాడు. చదివిన మాధవ్ గుండెలు వేగంగా కొట్టుకున్నాయి, కదిలే రైల్లోంచి దిగేశాడు. హాస్పిటల్ ముందు టాక్సీలో దిగుతూనే నర్సుని పిలిచి వార్డ్ నెంబరు అడిగి పరిగెత్తాడు. బ్యాండేజీలోవున్న దీపికను చూస్తూనే వెక్కి వెక్కి ఏడ్చాడు.

అతన్ని చూడగానే ఆమె మొహంలో ఆనందం తళుక్కున మెరిసింది.

"ఎలా జరిగింది దీపికా!" కన్నీరుతో అడిగాడు.

"నీ కోసం సంగతి తెల్సి హడావుడిగా వస్తూ, కారు చెట్టుకు గుద్దేసింది. నా తల్లి కాళ్ళు నీవల్ల దెబ్బతిన్నాయి" జయమ్మ శోకాలు పెట్టింది.

మాధవ్ కళ్ళనీళ్ళు చూసిన దీపిక చలించిపోయింది.

"నేను నీ జీవితంలో ప్రవేశించకుండా వుంటే....ఇలా జరిగేది కాదు" మాధవ్ దిగులుగా అన్నాడు.

"అలా అనకు మాధవ్ ! నీ కంఠం వింటూ నేను వేయి జన్మలైనా గడపగలను" అందామె ప్రేమగా.

ఆరోజునుంచీ రెండు రోజులు వరుసగా వచ్చిన మాధవ్ మళ్ళీ కన్పించలేదు.

ఆరోజు దీపికను డిశ్చార్జి చేస్తున్నారు. ఆ విషయం అతనికి మొదటి రోజే చెప్పింది....అయినా అతనింక ఎలా వస్తాడు, ఇంకా ఈ అవిటి దీపిక గుర్తుంటుందా.... ! తనలో తాను నవ్వుకుంది నీరసంగా.

  

కిటికీలోంచి బయటికి చూస్తూ ఆలోచిస్తున్న దీపికకు ప్రపంచం అంతా శూన్యంగా కన్పిస్తున్నది. గులాబీ చెట్టు కొమ్మనిండా పువ్వులే ! అయినా ఏ పువ్వు కా పువ్వు వంటరిగానే వుంది. అస్తమిస్తున్న సూర్యుడులాంటి జీవితం తనది. ప్రేమించే వ్యక్తిని పొందటం ఎంత కష్టం ! మనం ప్రేమించేవారికన్నా మనల్ని ప్రేమించే వ్యక్తి దొరకటం మరీ అదృష్టం....ఆ అదృష్టం తనకి లేదని తేలిపోయింది....

ఎవరో వచ్చిన అలికిడికి వెనక్కి తిరిగి చూసింది. ఎదురుగా పూలగుత్తితో మాధవ్ ! నాలుగు కళ్ళు రెండయ్యాయి. దీపికకు ఏడుపొచ్చేసింది. అతను ఆమెకేసి రెండడుగులువేసి చేతులు చాపాడు....అంతే ! ఆమె అతని హృదయంపై వాలిపోయింది ఆగలేనట్లు.

ఆమె వీపుమీద అనునయంగా రాస్తూ "ఎందు కేడుస్తున్నావు! వచ్చేశానుగా! ఇంక ఎక్కడికీ పోను.... అవునూ....నువ్వు బాగానే నడుస్తున్నావుగా....నీ కాళ్ళు...." అర్థంకానట్లుగా చూశాడామె కేసి.

కళ్ళు తుడుచుకొని అతన్ని కుర్చీలో కూర్చోబెట్టింది. ఎదురుగా కూర్చుంది దీపిక.

"నన్ను క్షమించు మాధవ్! నీ మనసు నొప్పించాను. యాక్సిడెంట్ కావటం, కాళ్ళు పోవటం నాటకం. అమ్మ నిన్ను వంచకుడిగా, డబ్బుకోసం తాపత్రయపడే వ్యక్తిగా అంటుంటే భరించలేక డాక్టర్ల సహకారంతో నాటకం ఆడాను. నువ్వు కనపడని ఈ వారం రోజులు అమ్మ మాటలు నిజమేనేమో అనిపిస్తే నా మనసెంత నరకం అనుభవించిందో నీకు తెలీదు''

ఆమె కళ్ళకింద నల్లటి వలయాలు గుర్తించాడు మాధవ్!

"దీపూ ఇంతేనా నీవు నన్ను అర్థంచేసుకొన్నది! ఈ వారం రోజుల్లో మా వూరు వెళ్ళి మా అమ్మా, నాన్నలను మన పెళ్ళికి వప్పించి వచ్చాను. అవిటితనంతో నీవు బాధపడకూడదని నీకు జీవితాంతం తోడుగా వుండాలనీ,

డిశ్చార్జి అయేనాటికి మన పెళ్ళి విషయం హఠాత్తుగా నీకు తెలపాలనీ, ముందుగా చెప్పలేదు....ఇంతలోనే ఇంత దిగులా" లేచి ఆమె దగ్గరగా వచ్చి కన్నీళ్ళు తుడిచాడు.

అతని కళ్ళల్లో తనపట్ల తొణికిసలాడే ప్రేమముందు మరేమి అక్కర్లేదనిపించిన దీపిక అతని కౌగిట్లో గువ్వలా ఒదిగిపోయింది.

లోపలికి రాబోయిన జయమ్మ ఈ దృశ్యం చూసి చిరునవ్వుతో తలుపులు దగ్గరగా వేసి వెనుదిరిగింది. ●

( 'కలువబాల ' పక్ష పత్రిక )

# ఈ శిక్ష ఎవరికి?

అత్యాధునికంగా ఉన్న రెండతస్థుల మేడ అది.

ఇంటిముందు తోటలో గులాబీలు, విరజాజులు రకరకాలైన పూలుపూస్తున్న మొక్కలున్నాయి. గేటు మీదికి ఎగబాగాలని ప్రయత్నిస్తోంది మనీప్లాంట్ తీగ.

ఆ ఇంటి యజమానురాలి అభిరుచులకు ప్రతీకగా ఉంది ఇంటి వాతావరణం. డ్రాయింగ్ రూమ్‌లో ఉన్న వీరేశలింగం, రాజారామమోహనరాయ్ ఫోటోలు సంఘ సంస్కరణాభిలాషను ప్రకటిస్తూ ఉన్నాయి.

ఖరీదైన సోఫాలు, కార్పెట్లు అంతటా ధనలక్ష్మి తాండవించే ఆ ఇంట్లోనే ఒక్క ప్రక్కగా ఉన్న గదిలోంచి " అమ్మగారూ " " అమ్మగారూ " అనే ఆక్రందన హృదయ విదారకంగా విన్పిస్తూ ఆ ఇంటి అందమైన వాతావరణాన్ని కలుషితం చేస్తోంది.

"అమ్మగారూ! అమ్మగారూ!" తలుపు కొడుతూ హృదయం కరిగించేలా విలపిస్తున్న నాలుగేళ్ల పాప ఏడుపు ఇంటి యజమానురాలి మనసును కరిగించలేక పోతోంది.

"చావు! నీలాంటివాళ్ళ గతి ఇంతే....ముష్టిముం.... బాగా పొగరెక్కి తన్నుకుంటున్నావు. తినడానికి తిండి లేకపోయినా సుకుమారం మాత్రం ఎక్కువే" ఆవిడ చేతులు తిప్పుతూ విసుక్కుంటున్నది.

పడక్కుర్చీలో పడుకున్న ఆవిడ భర్త .... సిగరెట్ పీలుస్తూ పొగని రింగురింగులుగా వదుల్తూ సీలింగ్‌కేసి చూస్తూ అన్నాడు—

"పోనీలే రాజ్యం! పాపం....చిన్నపిల్ల....దానికి పనేం చేతవుతుంది! నలభై ఏళ్ళు వచ్చినా నీకు చేతకాని పన్లు....ఆ నాలుగేళ్ళ పసిపిల్లకేం తెలుస్తాయి!" పాపని సమర్ధించాడు.

"ఆ! అవును మరి! చేతకావు....నాకు చేతగాక.... దాన్ని తీసుకొచ్చి వచ్చానా? అమ్మా, అయ్యా లేక ముష్టెత్తుకు అఘోరిస్తుంటే మనసు కరిగి....పోనీలే, ఇంత ముద్ద పెడదామని తీసుకొస్తే మరీ సోమరిపోతులాగా తయారయింది. దీని అన్నకు పౌరుషం పొడుచుకొచ్చి పారిపోయాడు. వెధవకి మాటంటే అంత అభిమానం

వుంటే నా తిండి తినడానికి కూడా పౌరుషముండాలి.... పైగా మీ బోడి సమర్థింపులు కూడాను !" చీదరించుకుంది.

ఆయన చేసేదేమీ లేక నిట్టూర్చి పేపర్లో తల దూర్చాడు నిస్సహాయంగా.

రాజ్యాన్ని ఏనాడు కట్టుకున్నాడో ఆనాడే తన నోరు పడిపోయింది. పాతికేళ్ళ ఈ వైవాహిక జీవితంలో ఏనాడూ స్వతంత్రించి నిర్ణయం తీసుకోలేదాయన.

"అమ్మగారూ ! అమ్మా ! తలుపులు తీయరా.... నాకు భయమేత్తుంది....అమ్మో ! చీకటి నాకు భయమేత్తుంది అయ్యగారూ ! మీరు తీత్తారా ! నాకు భయమేత్తుంది. మీరు చెప్పినట్లు చేత్తాను" పాప పెద్దగా ఏడుస్తూ తలుపులు బాదుతోంది.

"ఉండు ! కాసేపలా వుంటేగానీ నీ తిక్క తిరిగి రాదు....లేకపోతే నాకే టోపీ వేయాలని చూస్తావూ !...." కోపంగా మూసివున్న తలుపులవైపు చూస్తూ అరిచి వంటింట్లోకి నడిచింది రాజ్యలక్ష్మి.

పాపకు చీకట్లో భయమేస్తోంది. కిటికీ తీసే వుంది. ఆ కిటికీలోంచి పిల్లి వస్తే....అమ్మా !

"అమ్మా ! నువ్వెక్కడికి పోయావు. నేను నీకోసం ఇంత పెద్దగా ఏడుస్తున్నా నీకు విన్పించటం లేదా ?

చచ్చిపోయిన వాళ్ళంతా దేవుడి దగ్గర కెళతారని అన్నయ్య చెప్పాడు....నువ్వు దేవుడి దగ్గరికి వెళ్ళావు కదా ! ఆ దేవుడయినా నీకు చెప్పి నిన్ను పంపించడా.... అయితే దేవుడు చెడ్డవాడు....అమ్మా ! నాకు భయంగా వుంది. ఈ అమ్మగారు నన్ను రోజూ తంతుంది. గిన్నెలు చాలా తోమమంటుంది, తోమి తోమి నా చేతులు చూడు ఎలా బొబ్బలెక్కాయో ? ఇళ్ళు ఊడిస్తే నచ్చక మళ్ళీ కొడుతుంది. గుడ్డలు వుతకమంటుంది. నాకు అంత పెద్ద చీరలు ఉతకటం ఎట్లా చేతవుతుంది నువ్వు చెప్పమ్మా ? అయినా....చేతనయినంతవరకూ చేస్తున్నా కొడుతూనే వుంది. పాలు పారబోశానని గదిలో పెట్టి తలుపేస్తే నాకు భయంవేయదా ? ఈ చేతుల్తో మంచినీళ్ళ బిందెతో ఎలా మోయను ? ఆ బిందె నా అంత ఎత్తు. ఎంత బరువో.... అమ్మా ! నువ్వు నాకు ఇన్ని పనులు చెయ్యమని చెప్పావా ? నాకు అన్నం తినటం కూడా చాతకావటంలేదు. చేతులు మంటలు పుడుతుంటే రెండురోజులనుంచి సరిగా అన్నం తినలేకపోతున్నాను, నువ్వుంటే నా నోట్లో అన్నం పెట్టేదానివి. నాకు, అన్నయ్యకూ అలాగే రోజూ పెట్టేదానివిగా....

పాప మానసికంగా పడే వేదన భావాలకు అందనిది.

"అమ్మా ! అసలు నువ్వెక్కడికి వెళ్ళావు ? నాకు తెలుసులే ! గాలి వానలో దేవుడొచ్చి నిన్ను పిల్చి

తీసుకెళ్ళాడటగా....అన్నయ్య చెప్పాడులే! అయినా.... నన్ను కూడా తీసుకెళ్ళకూడదా? అన్నయ్య వీళ్ళ దెబ్బలు పడలేక నన్ను వదిలేసి ఎక్కడికో వెళ్ళిపోయాడు....వాడు వుంటే నేనింత ఏడ్చేదాన్ని కాదమ్మా...."

కన్నీటి ధారలు తుడుచుకోవాలనే ధ్యాస కూడా లేకుండా ఏడుస్తోంది....వెక్కిళ్లు పెడుతూ....

గోడమీద క్యాలెండరు గాలికి జారి క్రిందపడ్డ శబ్దానికి పాపకి అదురుపుట్టింది.

"అమ్మో!" అంటూ తలుపు దగ్గరికి పరుగుతీసింది.

"అమ్మగారూ! అమ్మగారూ!" తలుపులు బాదుతూ పెద్దగా ఏడ్చింది. "నాకు భయమేస్తోంది.... ఊఁ...."

"రాజ్యం! పాపం చిన్నపిల్ల బెదరగొడతా వెందుకు! మెల్లగా చెప్పి చేయించుకో....అలవాటయితే అన్ని పనులు చెప్పించుకోకుండా అదే చేస్తుంది. మన కెటూ పిల్లలు లేరు. దాన్నలా వుసురు పెట్టటం దేనికి? అదే మన పిల్లనుకో, ఒక్కదాన్ని ....పసిబిడ్డను గదిలోపెట్టి గడియేస్తే....దడుచుకోదూ...." గొణిగినట్లుగా అన్నాడాయన. పాప అరుపులు వినలేక.

"చాల్లే వూరుకోండి....చెప్పొచ్చారు....మీ మెతకదనం చూసీ అంతా మిమ్మల్నలా ఆడిస్తారు. దీని అన్న

కూరలు తీసుకురారా అంటే సోడాలు డ్రింకులూ తాగాడు. ఇదిలా ఏ పనికీ కొరగాకుండా పోతోంది, ఇదరికీ ఇలాంటి వెధవ బుద్ధులుండబట్టే అమ్మ అయ్య ఉప్పెనలో కట్టకట్టుకొని కొట్టుకుపోయారు. అడుక్కొని అఘోరిస్తున్నారని అమ్మ చెప్తే పోనీలే బాగుచేద్దాం అని తీసుకొస్తే ఇలా తయారయ్యారు....ఒకరోజలా వుంచితే దానికే బుద్ధి వస్తుంది : " కోపంగా అందావిడ. భర్త పాపను వెనకేసుకు రావటంవల్ల పాపమీద ఆవిడ కోపం రెట్టింపయింది.

"నీ యిష్టం ! నేను రావుగారింటికి వెళ్తున్నాను...." వాకింగ్ స్టిక్ తీసుకొని బయలుదేరాడాయన.

"వెళ్ళండి, నేను మహిళామండలి మీటింగ్‌కు వెళ్ళాలి, తాళంచెవి తీసుకెళ్ళండి...." అంటూ ఆయనకో డూప్లికేటు 'కీ' ఇచ్చిందావిడ.

మరో అరగంటలో అత్యాధునికంగా తయారయి హ్యాండ్‌బ్యాగ్ వూపుతూ బయటికి వచ్చి పాప వున్న గది దగ్గర ఒక్క క్షణం ఆగింది.

లోపలినుంచి ఏవిధమైన కేకలు గానీ అరుపులు గానీ విన్పించలేదు....విజయగర్వంతో విలాసంగా ముందుకు సాగిపోయింది.

♦ ♦ ♦

కృష్ణా ఎక్స్‌ప్రెస్‌లోని ఒక కంపార్టుమెంటును దీక్షగా శుభ్రం చేస్తున్నాడు కిష్టుడు.

కిష్టుడికి నిండా పదేళ్లుంటాయేమో ! వాడిని చూస్తే అడుక్కునే కుర్రాడిలా అనిపించకపోయినా, చేసే పనిని బట్టి నమ్మక తప్పదు.

వంకీలు తిరిగిన జుట్టు, చక్రాల్లాంటి కళ్లు, ఇప్పు డిప్పుడే నలుపురంగుకి తిరుగుతున్నట్లున్న పచ్చని దేహ చ్ఛాయ, కళ్ళలో అమాయకత్వపు జాడలు మాసిపోతూ క్రూరత్వం కొంచెంగా చోటుచేసుకోవటం కూడా గమనించ వచ్చు.

తల్లిదండ్రులు ఉప్పెనలో కళ్లెదుటే కొట్టుకొని పోతుంటే .... తల్లి కేకను బట్టి అటక మీదే కూర్చుని పక్కనున్న చెల్లిపాపను గట్టిగా పట్టుకొని ఏడ్చేశాడే గానీ మరేమీ చేయలేని వయసు వాడిది! వాడి ఏడుపు ఏ దేవుడి గుండెల్నీ కరిగించలేదు. లేకపోతే సినీమాల్లోలాగా ఏ చెట్టు కొమ్మో తల్లిదండ్రులను ఆధారంగా చిక్కకుండా ఉండేదా! అప్పట్నుంచీ పాపకి తనే తల్లిలా అన్నం కలిపి తినిపించే వాడు, కష్టం చేసే వయసు కాదు, పదిళ్ళలో అడుక్కొని తెచ్చుకొని ఇద్దరూ తినేవాళ్లు. సీతమ్మగారి కూతురి రాజ్యలక్ష్మమ్మగారు పట్నంనించి వచ్చింది. తమని చూసి మాకెటూ పిల్లలు లేరు మిమ్మల్ని తీసుకెళ్తామంది. నాన్నా అమ్మ పోయినప్పటినుంచీ పాప అమ్మ కోసం ఒకటే ఏడుపు, దాన్ని ఓదార్చటం రోజు రోజుకూ కష్టమయి

పోతోంది. అమ్మని ఎక్కడున్నించి తేను. ఈవిడ అమ్మలా చూసుకుంటా నంది కదా! పాపకూడా అమ్మకోసం దిగులు పడదు. వెంటనే వప్పేసుకున్నాడు తను.

వూళ్లో అంతా తమని వెలివేసినట్లు చూస్తున్నారు. అడుక్కునే పిల్లలని గేలి చేస్తున్నారు. అమ్మ. నాన్నలది ప్రేమ పెళ్ళి అని అందరూ చెప్పుకోవటం తనకి తెలుసు. అయితే వాళ్లు బ్రతికుండగా ఆలోటు తెలీలేదు. వాళ్లు చచ్చి పోతే ఏ ఒక్క చుట్టాలు తమని తీసుకెళ్లకపోవటంవల్ల ప్రేమ పెళ్లి గురించి కొంత కొంత తెల్సింది తనకి .... అందరిలాగే అమ్మా నాన్న ఉంటే .... తనూ రాజు గోపీ లాగా స్కూలు కెళ్తూనే ఉండేవాడు .... ఇంటి వస్తువులు ఉప్పెనలో పాడయిపోతే బజారుపడ్డ తమకి రాజ్యలక్ష్మమ్మ గారు దేవతలా అన్పించటం మామూలే....

దెబ్బలు తినలేక పారిపోయొచ్చేశాడు గానీ, పాప గుర్తొస్తే మనసువిల విల్లాడిపోతోంది—పాపం! తన కోసం ఎంత దిగులుపడిపోయి ఏడుస్తోందో! రాజ్యలక్ష్మమ్మ గారు దేవత రూపంలో దెయ్యం! పాపనెలా కొడ్తోందో.... పళ్ళు కొరికాడు.

ఆవిడ పాపని ఎంత యాతన పెడ్తుందో తనకి తెలుసు. ఆవిడ దర్జాగా కూర్చుని చిన్నపిల్లన్న ఆలోచనైనా లేకుండా పాపచేత ఇంటి పనంతా చేయిస్తుంది....అమ్మలా చూసుకుంటానంటే ఇదేనా మరి....అంత చిన్నపిల్ల అన్ని

పనులు ఎలా చెయ్యగలదు. తను ఎద్దులా వుంది గదా.... తను కొన్ని పనులు చేసుకోవచ్చు గదా....ఆ ఇంటాయన ఓ మొద్దు....ఇదేమిటి అని నోరు విప్పడు. అందుకే ఆవిడగారి ఆటలు అలా సాగుతున్నాయి....

తనను ఆరోజు ఎన్ని దెబ్బలు కొట్టింది. దాని చేతులు విరిగిపోవాలసలు....కూరలు తెమ్మంటే బజారు కెళ్ళాడు, బాగా దాహమేస్తే సోడా తాగాడు. ఒక్క పావలా ఖర్చయిందని, అంత కొడ్తుందా .... అందుకే తిక్క కుదిరేలా సరుకులు తెమ్మని ఇచ్చిన వంద రూపాయలతో పారిపోయొచ్చేశాడు. కానీ పాప గురించి ఆ క్షణంలో ఆలోచించలేదు....కిష్టుడికి కళ్ళనీళ్ళు తిరిగాయి. చేయెత్తి చొక్కా చేతులకు కళ్ళు తుడుచుకున్నాడు.

అందరూ తిని పారేసిన వేరుశెనగ తొక్కలు, బీడీ ముక్కలు అరటి తొక్కలు ఇంకా ఎన్నెన్నో అన్నీ ఒక మూలకి పోగుచేసి జాగ్రత్తగా ఎత్తి కిటికీలోంచి బయటికి విసిరేశాడు—

చిన్నప్పుడు అమ్మా నాన్నలతో రైలు ప్రయాణం ఎంతిష్టమో !

ఆ రైల్లోనే జీవితం జరుగుతోందిప్పుడు—ఒక్కొక్కరి దగ్గరకు వెళ్ళి చేతిని చాపసాగాడు. తోచిన వాళ్ళు, వాడి పనిని గమనించినవారు తోచిన డబ్బులు ఇచ్చారు.

కొందరు విసుక్కున్నారు.

కొందరు విన్పించనట్లు నటించారు.

అయినా వాడు పట్టించుకోలేదు. వాడికిది మామూలు విషయమైపోయింది!

పట్టభద్రులకే ఉద్యోగాలు దొరకని ఈ రోజుల్లో వాడి మూడో క్లాసు చదువుకు ఏం పని దొరుకుతుంది· టీ కప్పులు కడగటానికి ఓ చిన్న టీ స్టాల్‌లో కుదిరాడు. కానీ ఏదో పొరపాటు జరిగిందని ఆ యజమాని కొట్టే మానేశాడు ...మరెక్కడా పనిలేక దగ్గరున్న డబ్బులయిపోయి ఆకలితో పస్తు పడుకుంటే, పార్కు ఫ్రెండ్ గోపాల్ ఇలా చేస్తే డబ్బులొస్తాయని చెప్పాడు....కొంచెం కష్టమయినా అలవాటయిపోయింది. చేతిలో డబ్బులు లెక్క వేసుకున్నాడు. సుమారు రూపాయి వుంటుంది.

ఫర్వాలేదు అనుకొని ఒక మూలగా కంపార్టుమెంటు నానుకుని కూర్చున్నాడు.

రైలు వరంగల్‌లో ఆగింది.

"వీడే పట్టుకెళ్ళండి" అంటున్న సింహగర్జనలాంటి స్వరానికి ఉలిక్కిపడి నిద్ర లేచాడు.

తన చుట్టూ జనం అంతా నిల్చుని వున్నారు. ఎర్రటోపీల యమభటులు ఎదురుగా నిలబడి వున్నారు.

"ఏం చేశాడు" ఎవరో అడిగారు.

"మా పాప గొలుసు కాజేశాడు"

"ఎలా" కుతూహలం కన్పించిందా కంఠంలో :

"పాప నిద్రపోతుంటే బెర్తుమీద పడుకోబెట్టాంగా, జారినట్లుంది. వీడే కాజేశాడు....కం పార్టు మెం టు తుడిచాడుగా."

"నేను తీయలేదు సార్ : నిజంగా నేను దొంగను కాదు...." చేతులు జోడించినవాడి డొక్కల్లో....వీపుమీద తన్నులు....వర్షంలా....

వాడి కష్టార్జితం నేలపాలయిపోతే వాడి శరీరం తన్నులపాలయితే....పోలీసులు లాక్కెళ్ళారు.

గొలుసు పోగొట్టుకున్నవారు దిగులుగా కూర్చుండి పోయారు. కంప్లైంట్ ఇచ్చినా పోయిన వస్తువు దొరుకుతుందన్న ఆశ లేదు. దిగే స్టేషన్ ఖమ్మం వచ్చింది. నిద్రపోతున్న పాప నెత్తుకుని దిగబోయే ఆవిడకి బెర్తు మధ్య ఖాళీ సందులో మెరుస్తున్న గొలుసు కన్పించింది.... సంభ్రమంగా తీసిందామె. ప్రాణం లేచివచ్చినట్లని పించింది.

"ఇందాకే సరిగ్గా చూడకూడదూ" భర్త విసుక్కున్నాడు.

"చూశానండి....హుక్ లూజుగా వుంది కాబోలు జారిపడినట్లుంది" ఆమె గొణిగింది.

"పాపం ! అనవసరంగా ఆ కుర్రాడిమీద అనుమాన పడ్డాము....వస్తువొకచోట, అనుమానం మరో చోట." కిష్టుడ్ని తలుచుకొని జాలిపడ్డాడు భర్త.

"ఏం చేస్తాం....పదండి స్టేషన్ వస్తోంది....తర్వాత మళ్ళీ కంప్లైంట్ విత్ డ్రా చేసుకోవచ్చు...." పిల్లని భుజాన వేసుకొని ఆవిడ ముందుకు కదిలింది.

....ఆలోచించే టైము లేనట్లుగా రైలు ఖమ్మం ఫ్లాట్‌ఫారంపై ఆగింది.

సామాన్లు దించుకొని వాళ్ళూ దిగేశారు.

ఈ గొడవలతో నిమిత్తం లేనట్లుగా కూతవేసి హుషారుగా బయలుదేరింది రైలు.

సమాజం కళ్ళలో దొంగగా చూడబడిన కిష్టుడు తాను దొంగను కాదని ఎంత మొత్తుకున్నా వినక గొలుసేం చేశావు చెప్పమని తన్నే స్పృహలేక పడివున్నాడు పోలీస్ స్టేషన్లో !

ఆడే పాడే వయసులో పుస్తకాలు పట్టుకొని బడికెళ్ళ వలసిన వయసులో భరించలేని బ్రతుకు బరువును మోసే ఇలాంటి చిన్నారు లెందరో !

వెట్టిచాకిరీ గాక పిల్లలచేత చాకిరీ కూడా పరిపాటి అయిన దేశంలో పసివాళ్ళ బ్రతుకులు గానుగకు కట్టిన ఎద్దులు !

అనాధ శరణాలయ స్థాపనకు విరాళాలు సేకరించాలని మహిళామండలి మీటింగులో ఉత్సాహంతో ఉపన్యాస మిచ్చిన రాజ్యలక్ష్మిగారింట్లోని ఓ మూల గదిలో రేకులు రాలిన మొగ్గలా స్పృహలేక బెదిరిపోయి పడివున్న పాప !

వికసించవలసిన పువ్వుల్ని మొగ్గ దశలోనే రేకులు రాల్చేటట్లు చేసే ఈ సమాజంలో ఫూలన్‌దేవిలాంటి పాపలూ....విప్లవకారుల్లాంటి కిష్టులూ....తయారవటానికి కారకురాలైన సమాజం మాత్రం తనకేమీ పట్టనట్లు మళ్ళీ వారిని శిక్షించాలని పట్టుబడుతుంది. ఈ శిక్ష అసలు ఎవరికి వేయాలో మనసున్న ప్రతి మనిషి ఆలోచిస్తే అవగతమవుతుంది. ●

( ' ఆంధ్ర భూమి ' వార పత్రిక )

# వీణాపాణి

సూర్యుడు పడమటి కొండల మధ్యకు తప్పుకుంటున్నాడు.

సాయంకాలపు చల్లగాలికి కోతకు సిద్ధమై వాలిపోతున్న వరిమొక్కలు తమ బరువైన తలలతో లయగా నాట్యం చేస్తున్నాయి ... సీతికాలువ సన్నగా శబ్దం చేస్తూ పాట పాడుతున్నట్లుగా ఉన్నది.

ప్రకృతి కన్య పరమాద్భుత సౌందర్యాన్ని చూస్తున్న రవి తన్మయుడై చేలగట్లమీద నడుస్తున్నాడు.

నీలిరంగు ఆకాశం నిర్మలంగా కన్పిస్తుంటే దాని క్రిందుగా తెల్లని కొంగల బారులు ! రవి మనోఫలకంపై మనోహర దృశ్యాన్ని చిత్రించాయి.

గాలి అలలపై తేలివస్తున్న మధుర సంగీత ధ్వని మంద్రస్థాయిలో విన్పిస్తున్నది. ఎంత మధురంగా వుందా

స్వరం! అనుకోకుండా అతని అడుగులు ఆ పాట వస్తున్న దిక్కుకేసి నడిచాయి.

మాగాణి చేల అంచులమీదుగా ఆ పాట వస్తున్న వైపు వెళ్తున్న రవి....పాట దగ్గరవుతున్నకొద్దీ మరింత తన్మయుడయాడు.

ఉన్నట్టుండి రవి ఆగిపోయాడు. ఎదురుగా గడ్డి వాము చాటున కూర్చుని వున్న ఆమె సన్నటి పెదవుల కదలికలోనుండి ఉద్భవించిన ఆ పాట అతనికి మరింత మధురంగా వుంది! లేత నీలిరంగు చీర నల్లటి జాకెట్టుతో చామనఛాయలో అతి సామాన్యంగా వుందామె. విరబోసు కున్న ఆమె కురులు చల్లగాలితో ఆటలాడుతూ అతనికి స్వాగత గీతాలు పాడుతున్నాయి.

ఆమె అతనిని గమనించటంలేదు.

కృష్ణునికై వేచిన రాధలా ఒక విరహగీతం ఆలపిస్తున్నది.

కోయిల కూసినట్లుగా సన్నని జలధార కొండపై నుండి ప్రశాంతంగా క్రిందికి ప్రవహించినట్లుగా, మకరందం కోసం పరిభ్రమించే తుమ్మెద రొదలా గాజుల గలగలలా ఆమె గానం అతన్ని పరవశుడ్ని చేసింది.

పాట ఎప్పుడయిపోయిందో కూడా అతనికి తెలియదు. తన్మయత్వంతో కళ్ళుమూసుకొని అలాగే నిల్చుండి

పోయాడు. పాట ఆగిపోయిన కొంచెంసేపటికి తేరుకుని కళ్ళు తెరిచిన అతనికి ఆమె కన్పడలేదు. ఆశ్చర్యపోయాడు రవి. ఇంతలోనే ఎక్కడికి పోయిందో అనుకుంటూ చుట్టూ చూశాడు.

కాలవపైని వెదురువంతెనపై గబగబా నడుస్తున్న ఆమెని చూసి తనలో తాను నవ్వుకున్నాడు. ప్రశాంతంగా సాగే ఆమె పాటకు అవరోధం కల్గించినందుకు కొంచం నొచ్చుకున్నాడు కూడా! ఏమైనా అమరగాయనీమణులనుసైతం ధిక్కరించగలిగే ఆ పాట....ఓహ్ ! ఆ గొంతులో ఉన్న మాధుర్యం అలాంటిది !

ఈ మారుమూల పల్లెలో ఇంతటి మధుర స్వరం ఉందని లోకానికేం తెలుస్తుంది ! అనుకుంటూ చుట్టూ వ్యాపిస్తున్న చీకట్లని చూసి తనూ ఇంటిదారిపట్టాడు.

" ఇంతసేపా షికార్లు " అమ్మ ఆప్యాయంగా విసుక్కుంటూ కాఫీ చేతికిచ్చింది.

ఇంతలో అదే స్వరం...సన్నగా రాగాలాపన. చప్పున కాఫీ తాగటం ఆపేసి పెరట్లోకి పరిగెత్తినట్లుగా నడిచాడు.

పక్కింటి పెరట్లో సన్నజాజులు కోసుకుంటూ ఆమె సన్నగా పాడుతోంది. మసక చీకటిలో నైనా ఆమెను గుర్తించలేకపోవటం అసాధ్యం అనుకున్నాడు రవి.

" కాఫీ ఇక్కడే వదిలేశావా .... " అమ్మ కేకకి ఉలిక్కిపడి లోపలికి నడిచాడు.

కాఫీ తాగటం పూర్తిచేసి 'అమ్మా ! ప్రక్కింటి జానకమ్మత్తయ్యను చూసివస్తానే '! మెల్లగా అన్నాడు.

" వాళ్ళు లేరురా! బస్తీకెళ్ళిపోయారు. ఇప్పుడు ఎవరో స్కూలు మాస్టరుట. ఆయనా కూతురు ఉంటున్నారు. ఆపిల్ల పాటలు అవీ బాగా పాడుతుంది " అంది అమ్మ. అమ్మ నేదైనా అడిగితే మొత్తం చెప్పేస్తుందనే రవి ఆలోచన ఫలించింది.

" మన వాళ్ళైనా "

" మన వాళ్ళైతే " అమ్మ వెనక్కి రవి మొహంలోకి చూసింది.

" ఏం లేదు లే .... వూరికే అడిగాను " చప్పున లేచి వరండాలోకి వచ్చాడు.

రాత్రి రవీంద్రుని గీతాంజలి మీద మనసు నిలవ లేదు. పది అయింది. అదే స్వరం....లో గొంతుకలో ఏదో పాట....స్పష్టంగా తెలియటం లేదు. కానీ ఆ గొంతులో ఎంతటి మాధురిమ ఉంది! పుస్తకం మూసేసి కళ్ళు మూసు కొని పాట వింటూ నిద్రలోకి జారాడు రవి.

పుట్టింది పల్లెటూళ్లో అయినా చిన్నప్పటినుండి హైద్రాబాదులో పినతండ్రి దగ్గర పెరిగి చదువుకొనే అతడు....స్వగ్రామం వచ్చే సందర్భాలు చాలా తక్కువ. ఉద్యోగస్థుడయినాక ఇదే రావటం....రవికి సాహిత్యమన్నా సంగీతమన్నా తగని మక్కువ. అందుకే సంగీతమూర్తి అయిన రాధ అతని మనసు నాకట్టుకోగలిగింది.

స్నానం చేసి తయారయి 'అలా వెళ్ళొస్తానమ్మా' అంటూ వీధిలోకి నడిచి నేరుగా పక్కింట్లోకి అడుగుపెట్టాడు రవి.

అతని హృదయంలో అలజడి మొదలయి కంగారుగా అనిపిస్తోంది.

"మాస్టారూ...." పిలిచాడు మెల్లగా. తన గొంతు తనకే కొత్తగా అనిపించిందా క్షణంలో. కాసేపు నిశ్శబ్దం. గాజుల గలగల .... ఆమె వచ్చింది .... అతన్ని చూస్తూనే చిరునవ్వు పూసిందామె వదనంలో—

"మీరా ! లోపలికి రండి" వరండాలోంచి హాల్లోకి వెళ్ళాడు.

పొందిగ్గా అమర్చి ఉంది హాలు. ఒక బీరువానిండా పుస్తకాలు మాసిన పాత అద్దాల్లోంచి కన్పడుతున్నాయి. రెండు మూడు పాత కుర్చీలున్నాయి,

లోపలికి నడిచాడు పాట వింటూ. తల నెప్పిగా వుంది. కాఫీ తాగాలి. రాధ వస్తుందేమోనని ఎదురు చూశాడు. ఆ తర్వాత రెండు పాటలు గిరిజ అడగటం ఆమె పాడటం అంతా అయి గిరిజను పంపి రాధ లోపలికి వచ్చేసరికి దాదాపు అరగంట పట్టింది.

"అయిందా కచేరీ .... ?" కోపంగా వుందాతని స్వరం.

రాధ తెల్లబోయింది : ఎన్నడూ చూడని అతని కోపాన్ని చూసి.

"లేకపోతే ఏమిటిది ! మొగుడు ఆఫీసునుంచి అలసిపోయి వచ్చాడు అనే జ్ఞానం లేకుండా కబుర్లూ కచేరీలు" అరిచాడు. దాదాపుగా అతనికా క్షణంలో రాధ తనని నిర్లక్ష్యం చేస్తుందనే భావన తప్ప మరేమీ తోచటంలేదు.

కళ్ళనిండా కన్నీళ్ళు నిండిన రాధ మాట్లాడకుండా వెళ్ళి కాఫీ తెచ్చి ఇచ్చింది.

"ఇకనుంచీ ఆ వీణ ముట్టుకోకు. మనశ్శాంతి లేకుండా చేస్తున్నావు" చిరాకుపడ్డాడు.

తలనెప్పి తగ్గటంకోసం తప్పనిసరై కాఫీ తాగి మొహం కడుక్కొని ముందు గదిలోకి వచ్చాడు.

కుర్చీలో కూర్చొని దీనంగా శూన్యంలోకి ఏదో పోగొట్టుకొన్నదానిలా చూస్తోంది రాధ. ఆమె కన్నీరు

చూశాక తానెంత తప్పుగా ప్రవర్తించాడో అర్థమయింది. తనమీద తనకే పట్టరాని కోపం వచ్చింది.

"రాధా.... !" పిలిచాడు.

అతనికేసి చూసిన రాధ దోసిట్లో మొహం దాచుకొని భోరుమంది. పవిత్రమైన స్త్రీ హృదయం వ్యక్తపరిచె సున్నితమైన ఆవేదన సూటిగా అతని గుండెల్ని తాకింది.

"నన్ను క్షమించు రాధా.... ! చిరాకులో నీ మనసు నొప్పించాను" అంటూ ఆమె చేయి పట్టుకున్నాడు.

"ఎందుకు క్షమించటం ! మీరు మగవాళ్ళండీ ! ఏదైనా మాట్లాడతారు ...." తీవ్రంగా అందామె ఎర్రబడిన మొహంతో.

"సారీ రాధా....ఎంతో తలనెప్పిగా వుంది. ఇంటికి రాగానే నువ్వు నవ్వుతూ ఎదురు రావాలని నా కోరిక. అందుకే అంతసేపు నువ్వు నా గురించి పట్టించుకోకపోతే కోపంలో....అలా అనేశాను. రాధా ! నువ్వు పూర్తిగా నా స్వంతమనీ, నీ ధ్యాస నామీద తప్ప ఇంక దేనిమీదా వుండకూడదనే భావనే నాచేత ఇలా ప్రవర్తింపచేసింది. ప్లీజ్ రాధా....నన్నర్థం చేసుకో...."

అతని కంఠంలోని ప్రేమానురాగాలకు ఆమె మరేం మాట్లాడలేక నీరసంగా లేచి వంటింట్లోకి వెళ్ళబోయింది....

చేయిపట్టి లాగాడు రవి.

విసురుగా వచ్చి అతని హృదయంపై పడిందామె.

"అలక మానకపోతే ఇదే శిక్ష'' అంటూ ఆమెను తన కౌగిలిలో బంధించి మరి మాట్లాడనీయలేదు. భర్త కౌగిలిలో వున్న రాధలో పరస్పర సంఘర్షణతోవున్న అనేక ఆలోచనలు చోటుచేసుకున్నాయి.

ఆ తర్వాత రాధ అసలు పాటలు పాడినట్లే కన్పించ లేదు. అతను కూడా అడగ లేదు. రవి ఎదురుగా బలవంతంగా నవ్వుతూ తిరిగే రాధ హృదయంలో అంతులేని వ్యథ! తనదైన ఏదో వస్తువును పోగొట్టుకున్న బాధ ఆమెది!

రవి ఆ బాధను గ్రహించటంలేదు.

వీణ వాయించమనిగానీ పాట పాడమని గానీ రవి ఇప్పుడు అడగడంలేదు! ఆనాటి సంఘటన ఆమెపట్ల అతని ప్రవర్తనను మార్చేసింది. ఆ ప్రసక్తే తేవటం మానేశాడు.

ఎవరైనా వచ్చి అడిగినా రాధ ఏదో సాకు చెప్పి తప్పించుకుంటున్నది గానీ వీణ బయటికి తీయటంలేదు. రోజు రోజుకు తిండి ధ్యాస మానేస్తోంది. చిక్కినట్లున్న రాధని చూసి—"ఏమిటి రాధా....ఎందుకలా చిక్కిపో తున్నావు" లాలనగా అడిగాడు రవి.

"నాకేం... బాగానే వున్నాను. ఇంత ప్రేమగా చూసే మీరుంటే చిక్కటమేమిటి ! ...." అంది రాధ అతని కళ్ళలోకి సూటిగా చూస్తూ. కానీ ఆమె అంతరంగంలో జరిగే యుద్ధం అర్థంచేసుకోలేదు రవి. చిన్నప్పటినుంచీ సంగీతం అంటే వున్న ఆపేక్ష, భర్త పైన ప్రేమ, ఈ రెంటినీ మనస్ఫూర్తిగా అనుభవించి ఆనందించలేని ఇప్పటి తన అశక్తత వీటిమధ్య నలిగిపోతోంది రాధ.

రవి సమక్షంలో మనిషిలా నటిస్తుంది. అతని పరోక్షంలో పూర్తిగా మట్టిబొమ్మలా మిగిలిపోతోంది.

ఆ రోజు రాధ పుట్టినరోజు.

తలంటుకున్న కురులు ఆరబెట్టుకుంటూ గులాబీ మొక్కల మధ్య తిరుగుతున్న రాధను కిటికీలోంచి చూస్తూ "చక్కనమ్మ చిక్కినా అందమే...." అనుకున్నాడు రవి.

ఏదో సన్నటి రాగం ఆమె పెదవుల కలయికనుండి పుట్టి గాలికి పరవశం కల్గిస్తోంది.

అదే పాట తను మొదటిసారిగా విని ఆకర్షితుడైన పాట. తమ తొలి కలయికను గుర్తుచేసుకున్నాడు రవి.

అనుకోకుండా ఆమెకేసి నడిచాడు.

అతన్ని చూడగానే ఆమె పెదవులకు తాళం పడింది.

"ఆపేశావేం....పాడు !" అన్నాడు ఆప్యాయంగా.

"ఊహు...." తల అడ్డంగా తిప్పింది.

"ఎందుకు....ఫర్వాలేదు పాడు"

"పాడలేనండీ...పదండి ఆఫీసుకు టైమవుతోంది... "

"నీ మొహం...." అని ప్రేమగా వీపుపై తట్టి లోపలికి నడిచాడు.

అతడు బతిమాలి తనచేత పెళ్ళికి ముందులా అడిగి అల్లరిగా పాడించుకొని వినాలని ఆశించిన రాధ మనసు చిన్నబోయింది.

రవి ఆఫీసుకు వెళ్ళగానే ఆమెలోని ఆలోచనలు ఉధృతమై తీవ్రమైన తపన మొదలయింది.

తనివితీరా వీణమీద పాడుకోవాలనే ఆకాంక్ష ! రవి సాయంత్రందాకా ఎటూ రాడు. స్వేచ్ఛాస్వాతంత్ర్యాలను తనీరోజు పూర్తిగా ఉపయోగించుకోవాలి !

మూలనున్న వీణపెట్టెవైపు నడిచింది. దానినిండా ఎన్నాళ్ళ దుమ్మో ! దులిపి జాగ్రత్తగా వీణ బయటికి తీసింది.

మూగవోయి పడివున్న ఆ వీణ ఆమె మానసవీణలా వుంది.

ఒడిలోకి తీసుకొని ఆప్యాయంగా దుమ్ము తుడిచి ఒకసారి మీటింది.

"ట్రింగ్...."

అంతే! తర్వాత ఆమె వేళ్ళు లయబద్ధంగా కదలటం, స్వరవీణారవంతో కలసి పరవశించటం....ఆమెకే తెలియకుండా జరిగిపోయింది.

అవధులు దాటి ఆనందమయమైన ప్రపంచంలోకి అడుగు పెట్టాలనీ, రససింధువు దాటి పరమానంధం పొందాలనీ మహామహులైన వాగ్గేయకారులెందరో చేసిన తపస్సు అది....గుండెల్లో ఇమిడని ఆనంద రసాస్వాదన. ఆరోహణ అవరోహణలమధ్య పొంగిన రసధునిలో ఆమె ఓలలాడుతోంది .... ఏదో ఆవేదన, అద్భుత భావన, తన్మీలన, తన్మయత!

ఆమె పుట్టినరోజు కానుకగా వీణాపాటి బొమ్మని ప్రెజంట్ చేద్దామని తెచ్చిన రవి ఎదురుగా కన్పిస్తున్న దృశ్యంచూసి కాళ్ళకి బంధం వేసినట్లుగా ఆగిపోయాడు.

కన్నీళ్ళతో రాధ వీణని అణువణువునా తడిమి తడిమి చూస్తోంది. కన్నబిడ్డను అణువణువూ ఆప్యాయంగా స్పృశించే తల్లి స్పర్శలా ఉందది! .... వీణపైని ప్రతి మెట్టు, ప్రతి తీగా అమితమైన ప్రేమతో స్పర్శిస్తున్న ఆమె కన్నీళ్ళతో వీణను అభిషేకిస్తున్నది.

అంతులేని దుఃఖోద్వేగాలతో వీణనెత్తుకొని నిలబడిందామె. ఆమె కళ్ళలో తుఫాను తర్వాత నెలకొన్న ప్రశాంతత!

వీణని రెండు చేతులతో పైకెత్తి విసిరి నేలకేసి కొట్టబోయింది.

అంతదాకా విస్మయంగా చూస్తున్న రవి "రాధా! ఏం పని అది....మతిపోయిందా!" అంటూ వచ్చి చేతులు పట్టి ఆపాడు.

"వదలండి....ఎన్నాళ్ళనుండో అనుభవిస్తున్న ఈ బాధ....బంధం తీరిపోనివ్వండి! ఇది ఎదురుగా వున్నంత సేపు నా వేళ్ళు ప్రకంపిస్తూనే వుంటాయి. నా విద్యకు ఆధారం ఇదే....అందుకే ఆధారాన్నే సమూలంగా నాశనం చేస్తున్నాను" రాధ ఆవేశంగా పెనుగులాడింది.

అతనికి దీర్ఘకాలిక మత్తు దిగిపోయినట్లయింది. ఒక కళాకారిణి తనలోని విద్యను చంపుకోవాల్సిన పరిస్థితి కల్పించిందెవరు? తనే! తనే ఆమెను పూర్తిగా స్వంతం చేసుకోవాలనీ, ఆమెనో ఆస్తిగా అలంకార ప్రాయమైన వస్తువులా భావించాడు. ఆమె సంగీతం కూడా తనకే స్వంతమనీ, తనడిగినప్పుడే ఆమె మరబొమ్మలా పాడాలనీ ఆంక్షలు విధించాడు. ఆమెలోని అపూర్వమైన కళకు అవధులు ఏర్పరిచి, ఆ కళనే చంపేస్తున్నాడు. అది తనకు కూడా దక్కని పరిస్థితులు ఏర్పరచుకుంటున్నాడు....

ఆమె కళ్ళలోకి దీనంగా చూశాడు. వీణను పదిలంగా చాపమీద పెట్టాడు.

" నన్ను క్షమించు రాధా ! నీ మనసు నెంతగా గాయపరచానో నా కర్థమయింది. సంగీత మనేది.... నాల్గుగోడల మధ్య నీ వీణలో గానీ, మనిషి గుండెల్లో గానీ బంధించే వస్తువు కాదని తెల్సుకున్నాను. అజ్ఞానంతో కళ్ళుమూసుకుపోయి నీ వ్యక్తిత్వాన్ని అవమానించాను.... సంగీత సరస్వతినే నిర్లక్ష్యం చేశాను...." అంటూ ఆమెను దగ్గరగా తీసుకొని తాను తెచ్చిన వీణాపాణి బొమ్మని ఆమె చేతుల్లోకి అపురూపంగా అందించాడు.

ఇది కలా....నిజమా ! అన్నట్లుగా రాధ ఆనందంగా రవి కళ్ళలోకి చూసింది.

అతని కళ్ళలో దొరికిన నిజాయితీకి పరవశించిన రాధ చాలాకాలం తర్వాత మనస్ఫూర్తిగా హాయిగా నవ్వింది !

( ' ఆంధ్ర భూమి ' వార పత్రిక )

# మిథ్యా విలువలు

ఏదో చెప్పాలన్నట్లుగా వచ్చి తటపటాయిస్తూ నిలబడిపోయింది మమత.

టేబుల్ ముందు కూర్చుని దీక్షగా ఏదో రాసుకుంటున్న దమయంతి తలెత్తి కూతురి కేసి ప్రశ్నార్థకంగా చూసింది.

" మమ్మీ....మరే.... " నసిగింది మమత.

కూతురి కేసి పరీక్షగా చూసింది దమయంతి. లోకజ్ఞానం తెలీనట్లుగా అమాయకంగా ఉంది మమత మొహం.

ఆపేక్షగా చేయి చాపి కూతురి చేతిని తన చేతిలోకి తీసుకొని పక్క కుర్చీలో కూర్చోబెట్టుకుంది.

" చెప్పమ్మా....ఏం....కావాలి. "

" ఏం లేదు మమ్మీ : నేను పి.జి. చేయను. డిగ్రీ తోటే ఆపేస్తాను. "

దమయంతి నుదురు చిరాగ్గా ముడిపడింది.

" ఎందుకని.... " తీక్షణంగా అడిగింది.

మమత చేతి వేళ్ళకున్న నెయిల్ పాలిష్‌ను శ్రద్ధగా చూసుకుంటున్నది. కానీ మాట్లాడటానికి జంకుతున్నట్లుగా ఆమె చేతులు కంపిస్తున్నాయి.

"చెప్పమ్మా ....ఎందుకు చదవవు...." అనునయంగా కూతురు చుబుకంపట్టుకొని తల కొంచం పైకి ఎత్తి అడిగింది దమయంతి.

" అదీ....మోహన్....పి.జి. చేయడుట " మమత గొంతులో జంకు భయం మిళితమై వినిపిస్తున్నాయి.

" అతను చదువాపితే .... నువ్వూ అంతేనా. " రెట్టించింది దమయంతి కూతుర్ని.

" అతని కంటె ఎక్కువ చదివితే .... మా పెళ్ళి .... జరగదు మమ్మీ...." నసిగింది మమత.

" ఓహో....తనకంటె ఎక్కువ చదివిన అమ్మాయిని చేసుకోటానికి మోహన్‌కి అభ్యంతరమన్నమాట....అటువంటి సంకుచితుడ్ని నువ్వు చేసుకోకపోవటమే మంచిది....పోయి ఆ అప్లికేషన్ ఫిలప్ చేసి నాకివ్వు. " ఆజ్ఞాపించినట్లుగా

అంటున్న తల్లి మాటలకు అయిష్టంగా అక్కడ్నుంచి కదిలింది మమత.

అలా మరబొమ్మలా నిరాసక్తంగా కదిలివెళుతున్న మమతను చూస్తుంటే దమయంతి హృదయంలో దాగిన వేదానాతరంగం పై కెగసినట్లయింది.

లోపం ఎక్కడుంది....తన పెంపకంలోనా...ప్రత్యేక వ్యక్తిత్వం గల తన దగ్గర పెరిగిన మమత ఇలా మర బొమ్మలా ఎందుకు మారిపోయింది. అడుగడునా మమత గురించి తాను ఎంత శ్రద్ధ తీసుకుంది !.... అయినా తనకన్న మోహన్ ఆమెపై అంత ప్రభావాన్ని ఎలా చూపించగలిగాడు....

దమయంతికి మోహన్ మీద పట్టరాని కోపం వచ్చే సింది. అతను తన నుండి మమతను దూరం చేస్తున్నాడన్న భావన ఆమె హృదయాన్ని వికలం చేస్తోంది. మమతను మోహన్ నుంచి వేరుచేస్తే కూతురు మానసికంగా తనకు దూరం అవుతుంది వేదనతో....నిట్టూర్చింది దమయంతి.

ఎన్నడో మర్చిపోయాననుకున్న కన్నీరు ఆప్యాయంగా కన్పించి పలకరించింది.

"రాజా..." అని మనస్సు విలవిల్లాడింది జ్ఞాపకాలతో.

మమత ఈనాడు ఆలోచించినంత మాత్రంగానైనా తను ఆ రోజు ఆలోచించి ఉంటే ఈ నాడింత ఒంటరి

తనం అనుభవించవలసిన అవసరం వచ్చేదా .... [illegible] వెనక్కి వాలి కళ్ళు మూసుకుంది. కనురెప్పల మాటున దృశ్యాలు అలల్లా కదుల్తున్నాయి.

"నాన్నా....నాకు ర్యాంకు వచ్చిందె. మెడిసిన్‌లో చేరతాను" దమయంతి పేపరు పట్టుకొని ఆనందంతో ఊగిపోతోంది.

"మంచిది బేబీ....కానీ...." ఆప్యాయంగా కూతురి తల నిమురుతూ ఆలోచనలో పడిపోయాడు మూర్తిగారు.

"ఎందుకు నాన్నా అంత ఆలోచన .... నాకు మెడిసిన్‌లో సీటొస్తే నీకు సంతోషంగా లేదా...." గారాలు పోయింది.

"లేదమ్మా ! అదికాదు ...." ఏదో చెప్పబోయి అర్థోక్తిలో ఆగిపోయిన తండ్రిని చూస్తూ....

"ఇంకేం చెప్పకండి. నేను మెడిసిన్‌లో చేరుతున్నా నోచ్...." అంటూ తూనీగలా కలల రెక్కలు తగిలించుకొని పరుగెత్తిన కూతురి మనస్సును ఆ తండ్రి నొప్పించలేక పోయాడు.

తెలివితేటలు, మనస్థైర్యం గల కూతురి నిర్ణయం తప్పో ఒప్పో తేల్చగల శక్తి ఆయనలో లేనప్పుడు, కూతురి కళ్ళల్లో కన్పించే భవిష్యత్తు గురించి బంగారు కలలను చెరిపేసేందుకు అశక్తుడయ్యాడు.

" ఏంటన్నయ్యా ! దమయంతిని మెడిసిన్ చేయిస్తావా...."

అనమాయ ఉండబట్టలేక అడిగేసింది.

" అవును అనూ! దానికి గట్టిగా మెడిసిన్ చేయాలని ఉంది. పైగా సీటుకూడా వచ్చింది గదా.... "

" అదేంటన్నయ్యా .... తల్లిలేనిపిల్ల .... ఈ చేతుల మీదుగా దాన్ని పెంచి పెద్ద చేశాను. కూతురైనా కోడలైనా నాకదే గదా....అందుకనే ఇలా అడుగుతున్నాను...."

" అనూ, మనం అనుకున్నవాటికి పిల్లల భవిష్యత్తు ఎందుకు కాలరాయాలి....అది చదువుకుంటానంటోంది....సీటు వచ్చింది. నేనెలా ఆపను చెప్పు. "

" నిజమే అన్నయ్యా ! అదింకా చిన్నపిల్ల .... జీవితం తెలీదు దానికి....రాజాకి చదువు అంతగా అబ్బడం లేదని నీకూ తెలుసు .... వాడి చేత ఏదైనా బిజినెస్ పెట్టించి ఆ మూడు ముళ్ళూ వేయించేస్తే...."

చెల్లెలి గుబులు అర్థమయినట్లుగా నవ్వారు మూర్తిగారు.

" మన చేతిలో ఏముందమ్మా ! కానీయ్ చూద్దాం ! అంతగా వాళ్ళిద్దరూ కావాలనుకుంటే మనం ఆపుతామా .... పిల్ల ముచ్చటపడుతోంది. చేరనీ ముందు. పెళ్ళిళ్ళు రాసిపెట్టినదాన్ని బట్టి ఆపినా ఆగవు " వేదాంత ధోరణిలో

అంటున్న అన్నగారి మాటలకు బదులీయలేకపోయింది అనసూయ.

అలా మెడిసిన్‌లో చేరిన దమయంతి చదువు ఎమ్.ఎస్. అవటమేగాక ఫారిన్ వెళ్ళి రావటం వరకూ కొనసాగుతూనే ఉంది. తన చదువే ధ్యాసగా ఉన్న దమయంతి చుట్టూ ఉన్న వ్యక్తుల్లోని మార్పులు గుర్తించే స్థితిలో లేదు. ఆమె అధిరోహిస్తున్న విజయశిఖరాల నుండి క్రిందకు చూస్తే నేల కన్పించనంత ఎత్తులో ఉందిప్పుడు; తనను హృదయ పూర్వకంగా కోరుకున్న వ్యక్తులు తన నుండి ఎంత దూరమయ్యారో గుర్తించేసరికి చాలా ఆలస్యమయింది.

చిన్నప్పటి ఆప్యాయత, గిల్లికజ్జాలు, ప్రేమారి మానాలు, కోర్కెల నందనాలు, వాగ్దానాలు అన్నీ పుస్తకాల దొంతర్ల క్రింద పడి దుమ్ము కొట్టుకొని నలిగిపోయాయి.

పెళ్ళి చేసుకుంటున్నానని రాజా శుభలేఖ ఇవ్వటానికి వస్తే తండ్రి మొహంలో సుళ్ళు తిరిగిన వేదన దమయంతి గుండెలను తాకింది.

"మంచిది నాయనా...నాకెటూ ఆ అదృష్టంలేదు..."

ఆ కంఠస్వరంలో తనవారు పరాయివారయిపోతున్న వ్యథ ధ్వనిస్తోంది.

"పెళ్ళికి వస్తావు కదూ...." దీనంగా అడుగుతున్న రాజాకేసి చూడలేక అపరాధిలా తలదించుకుంది దమయంతి.

అంతరాంతరాల్లలో అతని పట్ల ఎగిసిపడే అనురాగ వీచికలను అదిమిపట్టి ఇక అతన్ని గురించిన ఆలోచనలకు ఆనకట్ట వేయాలనుకుంది.

"జీవితంలో పెళ్ళి పరమావధి కాదు .... సాధించ వలసినవి ఎన్నో ఉన్నాయి...." మనసును దిట్టపరచుకొని కర్తవ్యపథంలోకి దృష్టిని సారించింది స్థిరంగా.

అయినా రాజా గురించిన స్మృతులు ఆమెను నీడలా వెన్నాడుతూనే ఉన్నాయి. ఎందుకు తను రాజాని మర్చి పోలేకపోతోంది. ఇంత చదివింది. ఇంత సాధించింది. తను తల్చుకుంటే రాజాని మించిన వ్యక్తి భర్తగా లభించడా! ఆ ఆలోచనే ఆమెకు నచ్చలేదు. రాజా జ్ఞాపకాలు అతను పెళ్ళి చేసుకున్నాక ఎక్కువవటం ఆమెకు మరింత బాధా కరంగా వుంది. ఆ జ్ఞాపకాలు వెన్నంటుతూంటే వాటి నుంచి దూరంగా పారిపోవాలని బిజీగా ఉండటం కావాలని అలవాటు చేసుకుంది.

రాజా స్థానంలో మరో వ్యక్తిని కలలో కూడా దమయంతి ఊహించలేకపోతోంది. తనకు తెలీకుండానే చిన్నతనం నుంచీ తన వయసుతోటి అతని పట్ల ప్రేమ ఊడలు చాచి పెరిగితే తాను ఎందుకు గుర్తించలేకపోయానని పరితపిస్తోందో సారి....అతనికి లేని బాధ తన కెందుకుండా లని మరోసారి మనసులోనే అతనిపై కోపం పెంచుకుంటోంది.

తండ్రిపోయాక నిజంగా ఒంటరిదయింది దమయంతి. తన గురించిన దిగులుతోటే అది వ్యక్తం చేయకుండానే ఆయన కన్నుమూశారని కూడా ఆమెకు తెలుసు. అయినా తానుగా ఏమీ నిర్ణయించుకోలేని నిస్సహాయత, అసంతృప్తి ఆమెను వెన్నాడుతోంది. సమర్థురాలయిన సర్జన్‌గా పేరు తెచ్చుకుంది. పని ఎక్కువగా కావాలని కల్పించుకుంటుంది.... శ్రమిస్తున్నది.

" ఎందుకింత కష్టపడతావు .... ఇంకా సంపాదించి ఏం చేయాలని " చనువుగా కోప్పడ్డ రాజా మాటకి నవ్వేసింది జవాబుగా.

" డబ్బు కోసమనుకుంటున్నావా .... " ఎదురు ప్రశ్న వేసింది సూటిగా.

రాజా అర్థమయినట్లు నిశ్శబ్దంగా చూపు మరల్చుకున్నాడు.

" దమయంతీ ! ఆ సురేష్‌కి నువ్వంటే ప్రత్యేక యిష్టమట కదా!" అనసూయ అడిగింది గభాలున. ఉలిక్కిపడింది దమయంతి.

" నా పెళ్ళి చేయాలని ఎంతాశ అత్తా ! అయినా నా పెళ్ళి అయిందిగా. "

ఆశ్చర్యంగా చూసింది అనసూయ మేనకోడలి కేసి.

" అదే....చదువుతో " నవ్వింది చిన్నగా.

" అలా తీసేస్తే ఎలా చెప్పు. నువ్వు బాగా చదువు కున్నావు. నీకు తెలీకనా .... నేను మాత్రం శాశ్వతమా చెప్పు. "

" నేను మాత్రం .... " ఆపైపూర్తి చేయకుండా కన్నీటిని ఆపుకుంటూ వెళ్ళిపోయిన దమయంతిని చూసి అనసూయ మనసు విలవిల్లాడింది.

ఆపరేషన్ థియేటర్స్, పేషంట్స్, సిస్టర్స్ సాంగత్యంతోనే దమయంతి శిరోజాలు కొంత రంగు మారినాయి.

తనను చూడవచ్చిన రాజుతో—

" నాతో ఒకసారి బయటికి వస్తావా ? "

" ఎక్కడికి ? " ఆశ్చర్యంగా అడిగాడు.

" అనాథ సదనానికి "

" ఎందుకక్కడికి "

దమయంతి నిర్ణయం విని బాధపడినా అభినందించకుండా ఉండలేకపోయాడు.

పురిటికందుగా మమతను అనాథ శరణాలయంనుండి తెచ్చుకుంది దమయంతి. ఎదురుగా ఎవ్వరూ ఏమీ అనక

పోయినా చాటున గుసగుసలాడే వాళ్ళు. దమయంతి కోరిక మీద అనసూయ చేతుల్లోనే మమత పెరుగుతోంది. రాజా అత్తవారి ఊర్లోనే బిజినెస్‌లో స్థిరపడ్డాడు.

మమతకి పదో ఏట అనసూయ అందరి నుండి కన్నీటితో శాశ్వతంగా వీడ్కోలు తీసుకుంది. తన మనసెరిగిన మరో ప్రాణప్రదమైన వ్యక్తిని కోల్పోయినట్లు విలపించింది దమయంతి. అంత పెద్ద డాక్టరు అలా కుంగిపోవటం అంతా విడ్డూరంగా చెప్పుకున్నారు.

చరిత్ర పునరావృతమయినట్లు తనకి ఎదురయిన ప్రశ్నే మమతకి ఎదురయిందీనాడు. తాను చదువుల సరస్వతి అయినా మనసు కోరిన తోడును పొందలేకపోయింది. మమత హయ్యర్ స్టడీస్ చేస్తే మోహన్‌కూడా... రాజులా....తనకంటే ఎక్కువ చదివిన స్త్రీని మోహన్ కూడా భార్యగా అంగీకరించలేడా....ప్రేమ త్యాగాన్ని కోరుతుందంటారు .... ఆమె తనకి కావాలనే బలమైన నిర్ణయం తీసుకోలేని ప్రేమ నిజమైనదేనా .... తరాలు మారుతున్నా సమాజం స్త్రీ చదువును కూడా ఆమె పెళ్ళి ద్వారా శాసిస్తోంది ! తనకంటే విద్యాధికురాలయితే పురుషునికి న్యూనత....! ఒక స్త్రీ విద్యావతి అయితే కుటుంబమంతా విద్యావంతమవుతుందనే వివేకానందుని సూక్తి నీటిమూటేనా మరి....

సంఘం తయారు చేసిన ఈ మిథ్యావిలువలు మమతకి ఎలా అర్థమవుతాయి. భార్యా భర్త మధ్య ఏర్పడవలసిన అవగాహన ఇది .... ఇందులో సంఘ ప్రమేయం ఉండరాదు. దురహంకారంతో కూడిన సంఘం పెత్తనం మన జీవితం మీద ఎందుకుండాలి .... ?

సాయంత్రం కబురంపితే మోహన్ వచ్చాడు.

" ఏంటి ఆంటీ. "

" నువ్వు పి.జి.కి అప్లై చేశావా.... "

" లేదు ఆంటీ....నా చదువు అమ్మా నాన్న కింక భారం చేయదల్చుకోలేదు .... నేను ఉద్యోగం చూసుకుంటున్నాను. "

" మమతా నువ్వూ ప్రేమించుకుంటున్నారు కదా : మరి మమత ఇంకా చదువుకుంటే నీకేమైనా అభ్యంతరమా" సూటిగా అడిగేసింది.

" నాకా...." నవ్వేశాడు తమాషాగా.

" నవ్వులాటకాదు....నీ భార్య నీ కంటే ఎక్కువగా చదివిందనే న్యూనతాభావం నీయింటిని నరకం చేస్తుంది. మమత తెలివైనది. నాకు చదివించే శక్తి ఉంది. నీకు అభ్యంతరం ఉండవచ్చని తను చదవనంటోంది " ఫిర్యాదు చేసింది చిన్నపిల్లలా.

" ఆంటీ....నేనే ఈ విషయం బాగా ఆలోచించాను. మమత నా కోసం చదువును త్యాగం చేస్తోంది .... అంతటి ప్రేమమయిని సమాజం సృష్టించిన మిథ్యా విలువల కోసం వదులుకునేంత మూర్ఖుడ్ని కాను. మమతను చదివించండి. నాకు ఉద్యోగం రాగానే మేము పెళ్ళి చేసుకుంటాం మీ ఆశీస్సులతో " అంటున్న మోహన్ని అభినందనగా చూసింది దమయంతి.

దేశ ప్రగతిలో భాగస్వామిని అయిన స్త్రీ వ్యక్తిత్వాన్ని, తెలివి తేటలనీ మిథ్యా విలువల కోసం బలి పెట్ట కూడదు. ఆమెకున్న సామర్థ్యంతో ఎదిగేవిధంగా సమాజం తోడ్పడాలి. ఆమె అన్నింటిలోనూ తనకన్న తక్కువగా ఉండాలి అనే పురుషాహంకారం నశించిపోవాలి. దీనికి యువతరం ఆదర్శంగా నిలవాలి. తాము పురుషుల కన్న తక్కువగా ఉండాలనే ఆత్మన్యూనత యువతుల వ్యక్తిత్వానికి గొడ్డలిపెట్టులాంటిది.

" ఏంటి ఆంటీ....అంత ఆలోచన....ఇంతకీ మమత ఏదీ...."

" గార్డెన్లో ఉంది .... చూడు మోహన్ .... నీ అభిప్రాయం చెపితే ఆనందిస్తుంది పిచ్చిపిల్ల...బలవంతంగా చదివిస్తున్నానని నాపై గొంతుదాకా కోపం పెంచుకుంది " హాయిగా అంది.

"మీ లాంటి తల్లి దొరకటం మమత అదృష్టం ఆంటీ .... నేను మమతకి నచ్చ చెబుతాను. థాంక్స్ ఆంటీ ...." అంటూ నూతనోత్సాహంతో అడుగులు వేస్తున్న మోహన్ కేసి ప్రశంసాపూర్వకంగా చూస్తూండి పోయింది దమయంతి.

అశక్తంగా అసంతృప్తిగా తన జీవితంలోంచి తప్పుకున్న తన 'రాజా' రూపం అంతరాంతరాలలో కన్నీళ్ళతో తృప్తిగా నవ్వినట్లనిపించింది దమయంతికి. స్వార్థంతో కొందరు వ్యక్తులు సృష్టించిన మిథ్యావిలువలపై విజయాన్ని సాధించిన అనుభూతికి లోనయిందామె. పిల్లగాలి ఆమెను అభినందిస్తున్నట్లుగా చల్లగా తాకి వెళ్ళిపోయింది. ●

('వనిత' మాస పత్రిక)

# ప్రియబాంధవి

"రాజేశ్వరి సీరియస్ .... స్టార్ట్ ఇమీడియట్లీ"

టెలిగ్రాం చదువుతూనే నేను కలవరపడి పోయాను, నా మనసు మనసులో లేదు.

నా ప్రాణంలో ప్రాణం ఎలా ఉందో ఏమయిందో! బాల్యం నుండీ నా ఆశయాలూ ఆలోచనలు, జీవితంతో బాటు రాజేశ్వరితో కూడా పెనవేసుకున్నాయి నన్ను అర్థం చేసుకుని ప్రాణంగా మసిలిన రాజీ తప్ప నా మనసును ఇంకెవ్వరూ స్పృశించ లేదు. నా భర్త కూడా అంత చేరువుగా రాలేదంటే వింత కాదు.

ఆలోచిస్తూనే హడావుడిగా శ్రీవారికి ఆఫీసుకి ఫోను చేసి చెప్పి రెండు జతల బట్టలు సూట్‌కేసులో సర్దుకొని విజయవాడ రైలెక్కాను.

ఎందుకింత సడన్‌గా ఈ విధమైన టెలిగ్రాం? మనసు మథనపడుతోంది. గత ఎనిమిది సంవత్సరాలుగా రాజీనుండి

ఏ కబురూ అందటం లేదని అసలే బాధపడుతుంటే ఇప్పుడీ టెలిగ్రాం ఏమిటి? నిజంగా రాజీ ఏ స్థితిలో ఉంది. ప్రాణ సమానంగా ప్రేమించిన స్నేహితురాలిని ఆఖరుదశలో చూడబోతోందా !

అద్భుతమైన మేధాసంపత్తిగల శకుంతలాదేవితో పోల్చబడే రాజీ—జీవితనౌక చివరికి ఏ తీరం చేరుతోంది. రాజీ స్మృతులతో మనసు బరువవుతోంది.

రాజీ వాళ్ళ ఇల్లు తమ యింటి పక్కన ఉండేది. తమది హుందాగా ఉండే మేడ అయినా దాని ప్రక్కన అలికి ముగ్గులు వేసి పూలపందిళ్ళు పరచుకున్న పొదరిల్లు లాంటి కుటీరం రాజీ వాళ్ళది. చిన్నతనం నుండి ఆటల్లో పెరిగి జీవితాల్లో ఒదగటం ప్రారంభించారు ఇద్దరూ! నాలుగు స్థంభాలాట నుండీ చెమ్మచెక్క, ఒప్పులకుప్ప, వామన గుంటల నుండి చెస్‌వరకూ ఎదిగారక్కడే !

రాజీ వాళ్ళ నాన్న మామూలు స్కూలు మాస్టారు. రాజీ ఆ ఇంట్లో అందరికంటే చిన్నపిల్ల. ఇద్దరు అక్కలూ, ఇద్దరు అన్నలూ ఉండేవారు తనకి. వాళ్ళమ్మ కాసంత బొట్టుతో స్త్రీత్వం మూర్తీభవించినట్లుగా నిరాడంబరంగా ఉండేది. వెలితిని బయటికి రానిచ్చేది కాదు. రాజీ మాత్రం ఆ ఇంట్లో పుట్టదగింది కాదని అంతా అనుకునేవారు.

మట్టిలో మాణిక్యంలా మెరిసిపోయే రాజీని చూసి అందరూ ఈర్ష్యపడేవారు. రాజీ ప్రక్కన తను సూర్యుని ముందు దివిటీలా....కానీ రాజేశ్వరికి తనంటే ప్రాణం !

రాజీ జీవితం గురించి ఎన్ని బంగారు కలలు కన్నదో తనకు మాత్రమే తెలుసు. మనసు విప్పి అన్నీ చెప్పే ఆ అందమైన కళ్ళు భవిష్యత్తులోకి బంగారు స్వప్నాలు పరుచుకుంటూ కన్పిస్తుంటే తనకి విచిత్రంగా అన్పించేది. తాను పెద్ద ఐ.ఎ.యస్. ఆఫీసరు కావాలనేది రాజీ.

"విజ్జీ నేను సాధించగలనా? నాకు పట్టుదల ఉంది గదా...." అని అమాయకంగా అడిగేది.

రాజీను పలువురిలో గుర్తింపు తెచ్చింది దాని స్వరం! జీవనతరంగాలు ఎగిసిపడే ఆ గొంతులో ఏ పాట అయినా మనోహరంగా తీగలా సాగి పరవళ్ళు త్రొక్కేది. స్కూల్లో బహుమతులు చాలా పోటీల్లో రాజీకే! వాళ్ళ ఇంట్లో సరయిన అల్మారా లేదంటే అన్ని బహుమతులూ తన దగ్గరే దాచింది, "నేను పెద్దయి ఐ.ఎ.యస్. అయినాక తీసుకొంటాలే!" అనే రాజీని చూస్తుంటే నిజంగా కలెక్టరు అవుతుందనిపించేది.

స్కూల్లో చదివే రోజుల్లో రాజీ అంటే టీచర్లకు, తోటి విద్యార్థులకు అభిమానం. విద్యార్థి యూనియన్ లీడర్‌గా రాజీ ఉపన్యాసాలు అందర్నీ ఆకర్షించేవి. "ఎందుకీ గొడవలు రాజీ...." అని తానంటే—

"లోకం తెలియాలిగా" అని నవ్వేది.

జలతరంగిణి మీటినట్లుండే రాజీ నవ్వు తనకెంతో ఇష్టం!

రాజీ పదవతరగతి కాగానే మాస్టారు చదువు మానేయమన్నారు. ఎక్కువ చదివిస్తే అంతకంటే ఎక్కువ చదువుకున్న వరుణ్ణి తెచ్చేస్థోమత లేదని ఆయన వాదన.

"చదువు పెళ్ళికోసమేనా! నేను చదువుకుంటాను ఐ. ఎ. యస్. అవుతాను" మొండివాదనకు దిగిన రాజీకి ఎవ్వరూ సమాధానం ఇవ్వలేకపోయారు. చిన్నపిల్లయినా రాజీలోని వాదశక్తి అమోఘం. ఆ శక్తి ముందు మాస్టారే తలవంచారు.

"నీకు పెళ్ళి కుదిరినప్పుడు చదువుమానాలి." ఆఖరి అస్త్రం ప్రయోగించారు మాస్టారు. అది జరగదని తెలిసినా రాజీ నవ్వి సరేనంది.

తన చదువు తండ్రికి భారం కాకూడదని ట్యూషన్లు చెప్పేది, పుస్తకాలకి, ఫీజులకి తానే సంపాదించుకునేది. రాజీ పెళ్ళి మాస్టారికి కలే! ఎందుకంటే పైన రాజీ అక్కలకి కుదిరితేగా! తమిద్దరం డిగ్రీలో ఉండగానే రాజీ అమ్మగారు పోయారు. రాజీ మానసికంగా ఎంతో కుంగిపోయింది. తాను బాగా చదివి ఆఫీసరయి అమ్మని సుఖపెట్టాలనుకుంది. కానీ ఆవిడ ఇలా శాశ్వత విశ్రాంతి తీసుకోవటం ఆ అమ్మాయి మనసును విపరీతంగా గాయపరచింది. యాంత్రికంగా కన్పించేది రాజీ.

ఆ తర్వాత తనకు పెళ్ళయి హైద్రాబాదు వచ్చేస్తుంటే—

“విజ్జీ! నన్ను మర్చిపోవుగా!” అంటూ కన్నీటి సముద్రాలను ఆపుకుంటూ అడిగిన రాజీని చూస్తుంటే పెద్దగా ఏడ్చేసింది తను.

‘నిన్ను మర్చిపోతే నన్ను నేను మర్చిపోయినట్లే....’ వెక్కిళ్ళ మధ్య స్నేహితురాలితో తను అన్నది. అడ్రస్ చేతిలో ఉంచి కదిలి వచ్చేసింది తను.

చిన్నప్పటి నుండి ప్రాణంలో ప్రాణంగా మసిలిన స్నేహితుల మూగవేదన ఒకరికొకరికే తెలుస్తుంది. బ్యాండ్ మేళం బ్రద్దలు కొడుతున్నంతగా హృదయం బ్రద్దలవు తోందని ఎందరికి ఎలా తెలుస్తుంది?

రాజీ మొదట్లో అప్పుడప్పుడూ ఉత్తరాలు రాసేది. ఆ ఉత్తరాల ద్వారా వాళ్ళ సంగతులు తెలుస్తుండేవి. తను కూడా కొత్త కాపురం విశేషాలు రాసేది. రాజీ తన అన్నలు ఉద్యోగ వేటలో చాలా దూరంలో జీవితం నడపాలనే ప్రయత్నంలో ఉన్నట్లు రాసింది. అక్కలకి వివాహము యిందని వ్రాసింది.

విధి రాజేశ్వరితో తీర్చుకున్న రెండవ ప్రతీకారం మాస్టారి అనారోగ్యం.

మాస్టారికి పక్షవాతం వచ్చిందని బాధపడుతూ రాసిన రాజేశ్వరి ఉత్తరం ముందు పెట్టుకొని కన్నీరు పెట్టుకున్న తనకి శ్రీవారు నచ్చజెప్పారు "ఓసారి వెళ్లిరా" అన్నారు.

ఆ ఇల్లు అలాగే ఉందిగానీ పూలపందిళ్ళు ఎండి పోయాయి. పెచ్చులూడిపోయి వికృతంగా ఉన్నాయి గోడలు. ఇది రాజీ జీవితమూ...ఎలాంటి కలలు కన్నది. అంత తెలివిగల అమ్మాయికి విధి ఇలాంటి జీవితాన్నిచ్చిందా! బాధపడింది తన మనసు.

రాజీకెంతో ధైర్యం చెప్పాక తన ఇంటికి రమ్మంది ఉద్యోగ ప్రయత్నానికి. ముందు వప్పుకోలేదుగానీ తండ్రి వైద్యానికైనా సంపాదించాలిగా .... నా వెంట వచ్చింది. తండ్రి సంరక్షణ భారం పొరుగువారిపై పెట్టి నాతో హైద్రాబాదు వచ్చిన రాజేశ్వరిలో అవసరానికి అమ్ముడయిన విస్సహాయత తొలిసారిగా గుర్తించాను.

మాస్టారు నోరు లేదు కాబట్టి కన్నీళ్ళతో వీడ్కోలి స్తుంటే నా మనస్సు విచలితమైంది.

రాజీ పరిస్థితి చెప్పి శ్రీవారితో ఓ ప్రయివేటు కంపెనీలో ఉద్యోగం వేయించాను అందమైన రాజీ గాజు బొమ్మలా భావరహితంగా మారటం చూసి నా మనసు విలవిలలాడుతోంది. కంపెనీలో మేనేజరు ఆమెపట్ల వెకిలిగా ప్రవర్తించబోయాడని రాజీ ఆ ఉద్యోగం వదిలేసింది.

ఆమె అందమే ఆమె పాలిట శత్రువుగా ఎక్కడికి పోయినా వెక్కిరిస్తోంది. ఆకలి చూపులు ఆమె పాతాళం లోకి పారిపోయినా వెన్నంటి వచ్చేట్లున్నాయి.

హఠాత్తుగా రాజేశ్వరి ఓరోజు వెళ్ళిపోతానంది.

"నన్ను క్షమించు విజ్జీ! నీకు శ్రమ ఇచ్చాను" కన్నీళ్ళతో మొహం తిప్పుకుంది.

నా మనసు విలవిలలాడింది.

"మనలో మనకి క్షమార్పణ లేమిటే! నన్ను పరాయిగా చూస్తున్నావా!" చేతులు పట్టుకుంది తను. నచ్చజెప్పి వెళ్ళిపోయింది రాజీ.

ఊరెళ్ళిపోయిన రాజీ అడ్రస్ కూడా రాయకుండా ఎన్ని ఉత్తరాలు రాసినా జవాబు లేకుండా ఎనిమిదేళ్ళు కఠిన శిక్ష వేసింది.

గుండె అరచేత పట్టుకొని టెలిగ్రాంలోని అడ్రస్‌ను అనుసరించి హాస్పిటల్ చేరిన తనకి రాజీ గుర్తుపట్టలేని రూపులో కన్పించింది.

ఈమె రాజీ అంటే ఎలా నమ్మటం....కళగల పిల్ల.... అనీ, చిదిమి దీపం పెట్టవచ్చు అనీ అందరి పొగడ్తలూ పొందిన రాజీ....ఈ శవాకారం అంటే నమ్మశక్యం కావటం లేదు.

డాక్టర్ చెప్పింది విని కుప్పకూలిపోయాను. 'నా రాజీ ఒక గంటకంటే బ్రతకదు' అనే సత్యం నా గుండెల్ని పిండేస్తోంది.

'రాజీ....నా కెందుకింత శిక్ష వేశావు. సృష్టిలో తీయనిది స్నేహం అంటారు, ఆ స్నేహంలో చేదు ఎందుకు కలిపావు' ఆక్రోశించాను.

"రాజీ....రాజీ...." నా రోదనకి మెల్లగా కనులు విప్పింది. నన్ను చూడగానే దాని కళ్ళల్లో కోటి సూర్యుల వెలుగు! దీపం ఆరిపోయే ముందు ప్రకాశించినట్లుగా గప్పుమంటున్నట్లుంది.

"రాజీ ఎందుకిలా...." నోట్లో కొంగు కుక్కుకున్నాను.

ఎండు పుల్లలాంటి చేతిని కదిపి మెల్లగా నాచేయి పట్టుకొంది.

"ఇక సెలవు విజ్జీ...." పెదవులు మెల్లగా గొణిగాయి ఆమె అచేతనమయినట్లు గ్రహించి ఘొల్లుమన్నాను నేను.

"నా రాజీ పోయినా....నేనింకా బ్రతికే వున్నాను.... భగవాన్ మానవులకి మమకారాలు ఎందుకు పెట్టావయ్యా" నా ప్రియబాంధవి శరీరంపైబడి రోదిస్తున్న నామీద నర్స్ చేయి వేసి....

"మీరేనా విజయ"

అవునన్నట్లు తలూపాను.

"మీ కిమ్మన్నారు రాజేశ్వరి" అంటూ ఓ ప్యాకెట్ ఇచ్చింది. రాజీని ఆఖరిసారిగా ఆఖరి ప్రయాణానికి పంపాను ఈ పాపిష్టి చేతులతో :

ప్యాకెట్ ఓపెన్ చేసి రాజీ గదిలో కూర్చుని అందు లోని నల్లడైరీ చూసి ఉలిక్కిపడ్డాను. ఇది నేను ప్రజెంట్ చేసిందే! ఏంరాసింది నా నేస్తం! మొదటి పేజీలోనే ఇద్దరివీ చిన్నప్పటి ఫొటోలు అతికించుకుంది రాజీ.

ఆ కళ్ళలో ఎంతటి ఆత్మ విశ్వాసం : నమ్మకం : "ఐ. ఎ. యస్. అవుతా" ననే రాజీ కనుల ముందు నిలిచింది. జీవితంపై ఆశలు అల్లుకున్న అందమైన రాజేశ్వరి ఎందుకిలా శాపగ్రస్తగా తరలిపోయింది.

ఈ డైరీ రాజేశ్వరి జీవితంలో నేను చూడని రెండో ప్రపంచం అయివుంటుంది. వణుకుతున్న చేతులతో పేజీలు తిరగేశాను.

"ప్రియమైన ప్రాణమా : " ఆ సంబోధన తనకి ప్రతి ఉత్తరంలోనూ రాజీ వ్రాసేది. కళ్ళు అక్షరాలబారుల వెంట పరిగెత్తాయి.

" నీవు కానిదేదీ నా జీవితంలో లేదు. కానీ మీ యిల్లు హఠాత్తుగా వదిలివచ్చాక నాన్న నెలా పోషించాలో తెలియక బాధపడ్డాను. యాదృచ్ఛికంగా ఓనాడు రైల్లో తారసపడిన వ్యక్తి దేవుడనుకున్నాను. బొంబాయి నగరానికి ఉద్యోగం వంకతో నన్ను తీసికెళ్ళి ఓ నరకంలో పడేశాక తెల్సింది, అతను నాపాలిటి మృత్యువని. నాలాంటి శాపగ్రస్తులెందరో అక్కడ జీవితాలని కరిగించుకోవటం చూసి నీరుగారిపోయాను. నాన్న మందులకని నేను పంపే డబ్బుకు కక్కుర్తిపడి ఆయన చావు వార్త కూడా నాకు తెలియనీయలేదు నా సోదరులు ! నేను చేస్తున్నది వాళ్ళ దృష్టిలో ఆఫీసరు ఉద్యోగం. ఇంటి మొహం చూడకుండా నేను ఊహించని విధంగా నా జీవితం సాగించాను. నాన్న పోయారన్న వార్త తెలిశాక భోరున ఏడ్చాను. నిజం, విజ్జీ .... నీ ఒడిలో తల ఉంచుకుని మనసారా ఏడవాలని ఎంత కొట్టుకున్నానో కానీ నేనా అదృష్టాన్ని దూరం చేసుకున్నాను. నాకు తెలుసు ఈ ఊబి నాలోని శక్తిని కరిగించేసింది. నా నీడ కూడా నీ మీద పడకూడదు. అందుకే నీకు ఉత్తరమయినా రాయలేదు.

నేను మీయింట్లోంచి వచ్చేనాటికి నువ్వు కడుపుతో వున్నావు. పాపో....బాబో తెలీదు. ఎవరయినా మనసారా ఆశీర్వదిస్తూ ఐ. ఎ. యస్. చదివించమని కోరుతున్నాను. ఆ పిచ్చి నాకు ఇంకా పోలేదు.

విజ్జీ.... శారీరిక హింసకన్నా మానసికంగా చాలా అనుభవించాను. అంతా నా అందం వల్లనే! ఆడదానికి అందమే శత్రువనేది నిజం అయింది నాపట్ల. మనసు ఎవ్వరికీ అక్కర్లేదు. నేనెలాంటి జీవితం కోరాను. నాకెలాంటి జీవితం దొరికిందో చూశావా? నా ఆకారంలో మార్పు చూసి రోడ్ల పైకి తరిమారు.... పేవ్‌మెంటు జీవితం కూడా చూశాను. పరాయి ఆడదాన్ని ఆడదిగా కాక తల్లిగా, చెల్లిగా చూసే రోజు ఈ దేశంలో వస్తుందనే ఆశ పూర్తిగా చచ్చిపోయింది. కనకదుర్గ గుడి మెట్లమీద భిక్షుకిని అయినా నాలోని స్త్రీత్వాన్ని కొందరు పురుషులు గుర్తించారు. గుడిలో దేవతగా కొలిచే స్త్రీని అదే గుడి మెట్లపై దిగజార్చే సంస్కృతి మనదైనందుకు ఏహ్య పడనా....జీవితాన్ని త్వరగా ముగించాలి అన్పించింది. నా జీవితం నేను కోరుకున్నట్లుగాక ఈ సమాజం కోరినట్లు నడిచింది. ఈ దేశం, ఈ సమాజం నాకు యిచ్చిన జీవితం ఇది....ఇది నా తప్పు కాదు.

దాచి ఉంచిన బంగారం అమ్మి హాస్పిటల్‌కి కట్టాను.

నువ్వు వస్తావు. పోయేలోగా నిన్ను ఒకసారి చూడటం తప్ప మరే కోరికా లేదు. సెలవు నేస్తం!"

కన్నీళ్ళతో డైరీ ముద్దవుతోంది.

ఈ దేశంలో స్త్రీని స్త్రీగా కాక తల్లిగా కూడా చూసే రన్న వివేకానందస్వామి మాట నిజమా అనే అనుమానం

వస్తోంది. ఆడదాని అందాన్ని కాక మేధస్సును గుర్తించే రోజు ఎప్పటికైనా వస్తుందా! రాజేశ్వరి వంటి జీనియస్‌ల మేధ మట్టిలో కలవకుండా విశ్వానికి వినియోగపడితే ఎంత బాగుండేది.

కకావికలై పోతున్న మనసును అదుపు చేసుకుంటూ మాటిమాటికీ కన్నీళ్ళు అద్దుకుంటూ తిరుగు ప్రయాణమయిన విజయకి డైరీ చెప్పని మరో రహస్యం తెలిస్తే పర్యవసానం ఎలా ఉండేదో!

హఠాత్తుగా తన ఇంటి నుండి రాజేశ్వరి వెళ్ళిపోటానికి కారణం తన భర్త సంస్కారలోపమేనని తెలిసి ఉంటే ఆమె రియాక్షన్ ఎలా ఉండేదో మరి!

('వనిత' మాస పత్రిక)

# ఉషోదయం

"మంగీ! మంగీ" బెడ్ మీద నుంచి లేస్తూనే పిల్చింది వసంత.

"మంగి ఈ రోజు పన్లోకి రాలేదమ్మగారూ" నాయర్ వచ్చి చెప్పాడు.

"ఏమైందిట."

"ఏమోనమ్మా! రెండ్రోజులకోసారి మానేస్తే గానీ తోచదు దానికి" గొణిగాడు నాయర్.

ఆ రోజే కాదు మర్నాడు కూడా మంగి రాలేదు. మూడోరోజు పొద్దుటే మూలుగుతూ వచ్చింది.

"ఏమిటి ఏమైంది జ్వరమా"

"లేదమ్మా! ఆ సచ్చినోడు ఎట్లా తన్నిండో సూడండమ్మగోరూ!" అంటూ వీపుమీద జాకెట్టు పైకి లాగి చూపింది మంగి.

ఎర్రటి దద్దుతేలిన వీపంతా — వసంత మనసు జాలితో ద్రవించిపోయింది.

"ఇన్ని దెబ్బలా! ఎందుకు కొట్టాడిలా!" వసంత గొంతులో సానుభూతి ధ్వనించింది.

" ఇంకేటుందమ్మా! తాగటాన్కి పైసలులేవన్నానని మక్కెలిరగ తన్నిండమ్మా " ముక్కుచీది కళ్ళు తుడుచు కుంది మంగి.

తోటి ఆడదానిగా సానుభూతి చూపటం తప్ప మరేమి చేయగలదు వసంత మాత్రం. రెక్కలు ముక్కలు చేసు కొని ముగ్గురు పిల్లల్నీ, మొగుడ్నీ పోషించటమే కాకుండా దాని మొగుడికి తాగటానికి డబ్బులివ్వలేని రోజున తన్నులు తినక తప్పదు మంగికి.

'ఈ పదిరూపాయలు తీసుకొని మందులిప్పించుకో' అని ఓ పదిరూపాయల నోటు అందించింది వసంత.

" దయగల తల్లి! సల్లంగుండమ్మా. ఆడి చేతులడి పోను. తాగనేకపోతే కుక్కలా సేత్తాడు తల్లీ " మరోమారు కళ్ళుతుడుచుకుంది మంగి. 'తగ్గంగానే వత్తానమ్మా' అంటూ వెళ్ళిపోయింది.

మంగి వెళ్ళిపోయాక చాలాసేపు ఆలోచిస్తూనే ఉండి పోయింది వసంత. మంగికి తగిలిన దెబ్బ శరీరానికి సంబంధించినది కాబట్టి కొన్ని రోజుల్లో మానిపోతుంది. తనకు లెక్కలేనన్ని దెబ్బలు తన మనసుకు తగిలాయే : వాటి మాటేమిటి ? భగవంతుడు ఈ శరీరంలో మనసు అనే చిన్న సున్నితపు భాగాన్ని అమర్చి ఉండకపోతే ఎంత బాగుండేది. ఆలోచనలు అంతులేకుండా ఉన్నాయి వసంతకు.

" ఈ రోజు రాత్రి రావటం లేటవుతుంది. నా కోసం ఎదురు చూడకు " కాఫీ తాగుతూ అన్నాడు సుధీర్.

మౌనంగా తల వూపింది వసంత.

అతను హడావుడిగా వెళ్ళిపోయాడు. టేబుల్ మీద రకరకాల పళ్ళు, కేకులు, జాములు, పదార్థాలు ఉన్నాయి. కానీ వసంతకి అవేమీ తినాలనిపించటంలేదు. ఇవన్నీ రోజూ ఇలా ఉండేవే ! తను తిన్నదో లేదో అడిగేదెవరు ? ఇంట్లో అన్ని వస్తువుల్తోబాటు తనూ ఒక వస్తువే సుధీర్‌కి. తన సంగతి ఎవరికి కావాలి? తను తినకపోతే ఎవరికి జాలి?

ఎప్పుడైనా భర్త తరపు బంధువులొస్తే వాళ్ళకోసం చిరునవ్వును మొహానికి అతికించుకొని వాళ్ళు వెళ్ళేదాకా ఆనందం నటించటం అలవాటయిపోయింది.

ఎవరికోసం ఈ నటన. ఎంతకాలం ఇలా ! తలనొప్పిగా అన్పించింది వసంతకు. ఒక గ్లాసు పాలు త్రాగి ఆ పూటకు పడుకొంది.

ఇందతా ఎందుకిలా జరిగింది. నిన్న మిసెస్ వర్మ వచ్చి అన్న మాటలు సడన్‌గా గుర్తు వచ్చాయి వసంతకి.

" వసంతా ! నిజంగా నీ మొహంలో ఎంత అందం ఉంది. ముఖ్యంగా నీ నవ్వు ఎంత బాగుంటుందో తెలుసా ! " ఆ మాటలు గుర్తు రాగానే ఒక శుష్కహాసం మెదిలింది వసంత పెదవులపై. నిజంగా ఇప్పటికీ తను అలా నవ్వుతోందా ! నవ్వగలుగుతోందా !

అవును అప్పటి నవ్వు ఎంత బాగుండేది! కలల వెల్లువలో వయసు వసంతంలో ముగ్ధ సౌందర్యం నింపుకొని కన్నుల్లో భావచిత్రాలు కన్పిస్తుంటే పెదవులపై తేనెలు కురిపించే ఆ నవ్వు .... ఆనాటి పెళ్ళిలో ఇప్పటికీ బాగా గుర్తుంది .... పిన్ని కొడుకు పెళ్ళిలో తన దగ్గరకి వచ్చిన వృద్ధురాలు తనకి తర్వాత కాబోయే అత్తగారని తనకెలా తెలుస్తుంది!

ఆమె దగ్గరగా వచ్చి చూస్తుంటే తన కదోలా అన్పించి తలవంచుకొంది.

" నీ పేరేమిటమ్మా ...." అని అడిగిందావిడ.

" వసంత " బెరుకుగా జవాబిచ్చింది.

" బాగుందమ్మా ! నీకు తగ్గ పేరు " అందావిడ ప్రశంసాపూర్వకంగా.

మళ్ళీ ఆవిడే అమ్మతో అంది. ' నాకిలాంటి కోడలు కావాలని ఉంది . ఏమంటావు? ' అని.

అమ్మ చిరునవ్వుతో ఆవిడతో మాట్లాడుతూ అవతలకి తీసికెళ్ళింది.

ఆ మాటలకర్థం తర్వాతగానీ తనకు తెలీలేదు. ఆమె ఒక్కగా నొక్క కొడుక్కు తోడుకోసం వెతికిందని. కానీ ఆ రోజున తన మనసులో మిలమిల మెరిసిన నక్షత్రాలు ఏవీ!

" నన్ను ఏరి కోరి చేసుకున్నారు....కానీ మీకిచ్చిన మాటతో నేనెంత నరకం అనుభవిస్తున్నానో మీకు తెలుస్తోందా ! " పైలోకంలోని అత్తగార్ని ఉద్దేశించి విలపించింది వసంత.

వర్తమానం కన్నా గతం మేలన్నమాట ఎంతో నిజం అనిపిస్తుంది వసంతకు. ఆ రోజులు ఎంత మధురమైనవి. కాలేజీలో చదివే రోజుల్లో సంగీతంలో, నాట్యంలో చదువులో ఓహ్....ఒకటేమిటి? ఎన్ని ప్రైజులు తనకి. తనను పెళ్ళి చేసుకోబోయే వాడెంతో అదృష్టవంతుడని అంతా అనుకొనే వాళ్ళు.

తన క్రీగంటి చూపులకోసం పడిగాపులు గాచిన వాళ్ళెంతమంది లేరు!

పెళ్ళి అయిన తర్వాత ఆ రోజు....ఎంతటి దుర్దినం, అత్తగారు ఏకాంతంగా పిలిచి చెప్పిన ఆ మాటలు .... ఆవే అగాధంలోకి తోసేశాయి.

" నన్ను క్షమించు తల్లీ .... నీ దగ్గర ఏమీ దాచను కానీ...."

" ఏమిటి చెప్పండి .... " దడదడలాడే గుండెల్తో తొందర పెట్టింది వసంత. క్రొత్త పెళ్ళికూతురన్న బిడియం లేదా యువతికి. తన జీవితం గురించి తీర్పు వినబోయే ముద్దాయిలా ఉందామె పరిస్థితి.

మరేం లేదమ్మా ! .... ఎంతో నమ్మకంతో నిన్ను కోడలిగా తెచ్చుకున్నాను .... నా కున్నది సుధీర్ ఒక్కడే. ఎన్నో నోములు నోచి వాడిని కన్నాను...."

వసంత హృదయం దడదడమంటున్నది వినబోయే మాటలకు. 'కాలేజీలో జరిగిన ఆటల్లో ఒక ప్రమాదానికి వాడు సంసార జీవితానికి పనికిరాడని డాక్టర్లు చెప్పారు. నేను ఎంతో కష్టపడి కాపాడుకోకపోతే వాడు నాకు దక్కి వుండేవాడు కాదు....' ఆమె మాటలకి బదులు వసంత చెవుల్లో సముద్రపు హోరు బయలుదేరింది. కళ్ళు చీకట్లు కమ్మాయి.

కళ్ళు తెరిచిన వసంతకు ఎదురుగా అత్తగారు కన్నీళ్ళతో కన్పించింది.

వసంత ఆవేశంగా లేచి కూర్చుంది. "మీకిది న్యాయమా ! ముందే మీకీ విషయం తెలిసి ఒక ఆడపిల్ల జీవితాన్ని బలి తీసుకోవటానికి మీ మనసెలా ఒప్పింది. ఇదే మీ కూతురయితే ఈ పనిని మీరు అంగీకరిస్తారా?...." కన్నీళ్ళు జల జల రాలాయి వసంత బుగ్గలపై.

"నేను నీకు అన్యాయమే చేశానమ్మా .... వప్పుకుంటాను. నా కొడుకు గురించి, నా కున్న స్వార్థం నా చేత ఇలా చేయించింది. అందరిలా వాడు బిడ్డా పాపలతో ఉండడనే బాధ నా గుండెల్ని కోసేస్తున్నా వాడి కోసమే

నేను బ్రతికి వున్నాను. నువ్వు భార్యగా గాక ఒక స్నేహితురాలిగా వాడిని కనిపెట్టి వుంటావని నా ఆశ .... అందుకే నా ఈ ఆస్తిలో సగం నీ పేర రాశాను ...." అందామె దీనంగా. "హు....ఆస్తి! ఎవరికి కావాలి బోడి ఆస్తి .... స్త్రీ ఎటువంటి జీవితాన్ని కోరుకుంటూందో ఒక ఆడదానిగా మీరు తెల్సుకోలేకపోయారు! డబ్బు చూపించి నన్ను మాయబుచ్చుదామనుకుంటున్నారు" వసంత కళ్ళు ఎర్రబడ్డాయి.

"అలా అనకమ్మా ! ఒక ఆడదానిగా. తల్లిగా అభ్యర్థిస్తున్నాను. నీ మనో ధైర్యంతో నువ్వే పని చేయగలవు. నీ ప్రవర్తనవల్లనే వాడి జీవితం నడుస్తుంది సాఫీగా. నువ్వీ విషయం మీ తల్లిదండ్రులకి చెప్పి రచ్చకెక్కి ఈ ఇంటి పరువు బజారులోకి ఈడ్వవద్దమ్మా .... అందరు పురుషుల్లా వాడిని సంఘంలో తలెత్తుకుని బ్రతకనీయమ్మా! నా మాట దక్కిస్తానని మాటివ్వు తల్లీ...." ఆవిడ కన్నీళ్ళ మధ్య అంది.

గొంతులో ఎగిసే ఎక్కిళ్ళు అదిమిపట్టి, గుండెలో పొంగే దుఃఖ సముద్రానికి ఆనకట్ట వేసి ఆవిడ వడికే చేతిలో తన చేయి నుంచింది వసంత అలసిపోయినట్లుగా.

ఎన్ని కలల సౌధాలు నిర్మించుకొంది! దాంపత్య జీవితం గురించి ఎన్ని వూహలల్లుకొంది ! అన్నీ పేక మేడల్లా క్షణంలో కూలిపోయాయి.

తను డబ్బు కోరిందా? తెలియకుండా ఎంత వంచన! అమ్మ నాన్నలకి విషయం తెలిస్తే గుండె పగిలి చావరూ! వీళ్ళ స్వార్థానికి తన జీవితం బలిచేసే హక్కు వీళ్ళకెక్కడుంది. పెళ్ళంటే నూరేళ్ళ పంట. ఇదంతా పూర్వజన్మ పాపఫలమా! ఇలాగే బ్రతకాలని తన నుదుటన రాశాడా విధాత....తను కావాలనుకుంటే ఈ రాతను మార్చుకోలేదా! అన్నీ ప్రశ్నలే! సమాధానం అంత తేలిగ్గా దొరకని ప్రశ్నలు.



సాయం సంధ్య ఎర్రగా వాలుతోంది. మంగి పని చేసుకుంటూ కూని రాగం తీస్తోంది. టీ కప్పు వసంత కోసం తెచ్చి నాయర్ అన్నాడు—

" ఈ రోజు ఉదయం నుంచీ ఏమీ తినలేదు—చాలా సేపు నిద్రపోయారమ్మా! లేపటం ఎందుకని...." అర్థోక్తిలో ఆగాడు.

" కడుపులో నొప్పిగా ఉందని ఏమీ తిన్లేదు. ఇడ్లీ తీసుకురా తింటాను ...." తన మనసులోని విషయం మరెవ్వరికీ తెలియనీయటం వసంత స్వభావంకాదు. రాత్రి లేటుగా వస్తానన్న సుధీర్ మూడోరోజయినా ఇంతదాకా రాలేదు. ఆలోచిస్తుండగానే మంగి గది వూడవటానికి వచ్చింది.

క్రొత్త చీర కట్టింది. కళ్ళకి కాటుక, నుదుటిన ఎర్ర బొట్టుతో నిండుగా వుంది. వీళ్ళు కీచులాడుకున్నా ఎంత త్వరగా కల్సిపోతారు.

" ఏంటి మంగీ: దెబ్బలు పూర్తిగా తగ్గాయా: "

అది సిగ్గుపడినట్లుగా 'తగ్గాయమ్మగోరు : ఆడు కొట్టినా ఆడి మనసు ఎన్నమ్మగారూ : మర్నాడే చమించ మని కాళ్ళట్టుకున్నాడు '

అవును మరి : వాళ్ళది భార్యాభర్తల సంబంధం. తనకెవరున్నారు? తన మనసు గాయం మాన్పేదెవరు : మంగి గది వూడ్చి వెళ్ళిపోయింది. నాయర్ ఇడ్లీ తెచ్చి ఇచ్చాడు.

ఎదురుగా కేలండర్లో పాపాయి బోసినోటితో నవ్వులు కురిపిస్తోంది.

అలాంటి పాప కావాలని తనకెంత ఆశ: చిన్నప్పటి నుంచీ పిల్లలంటే తనకి ప్రేమ ఎక్కువ. పక్కింటి పిల్లలందర్నీ చేర్చి తనూ చిన్నపిల్లయి వాళ్ళతో కల్సి ఆడేది. అంత చిన్నపిల్లల్తో నీకేం ఆటలే: అని అమ్మ విసుక్కునా వినేది కాదు. అందుకేనేమో భగవంతుడిలా చేశాడు.

తన కన్నా బిచ్చగత్తె నయం. మాతృత్వం అనేది తను పొందలేనిదయినా ఏమీలేని ముష్టిదానికి లభిస్తుంది.

తనకిది తీరని ఇహం. తను సంతోషంగా ఉన్నదని అమ్మ అనుకుంటున్నది.

" వసూ ! నాలుగేళ్ళయినా ఏమీ అనుకోలేదా ! డాక్టర్ని కలుసుకున్నావా! " అడిగింది మెల్లిగా.

" ఆరోగ్యం బాగానే ఉందమ్మా! డాక్టర్‌కి చూపించుకొంటాను " అని ఆ ప్రసక్తి మార్చింది తను. ఆలోచనల మధ్య చీకటి పడిందే గ్రహించలేదు వసంత.

మర్నాడు ఉదయం సుధీర్ వచ్చినట్లు గ్రహించింది. ఏ అర్థరాత్రో వస్తే నాయర్ తలుపు తీసి ఉంటాడు. సుధీర్‌కి కాఫీ ఇస్తూ—

" మా చెల్లెలి పెళ్ళి ఇంకో పది రోజులుంది " చిన్నగా అంది.

" కారిచ్చి పంపిస్తాను. మళ్ళీ ఎప్పుడొచ్చేదీ చెప్తే కారు పంపిస్తాను " వసంతను చూడకుండానే అన్నాడు!

" మీరొస్తే బాగుంటుందేమో "

" నాకు తీరదు. నువ్వెళ్ళు " లేచి వెళ్ళిపోయాడు మాట్లాడుతూనే.

" అవును ఎందుకొస్తారూ .... తనకింత అన్యాయం చేసి తన వెంట ఎక్కడికీ రావడానికి మొహం చెల్లదు. తన వెంట ఆయన బదులు కారు వస్తుంది. అంతే!...కనీసం ఒక

స్నేహితుడిగా ఆత్మీయంగా మాట్లాడటం కూడా రాదా! తనెంత రాజీ పడాలని ప్రయత్నించినా ఈ మోడులాంటి జీవితంలో రాజీ ఎలా....? ”

లక్ష్మి పెళ్ళికి వెళ్ళివచ్చింది. సుధీర్ వస్తాడని పెళ్ళి అయే దాకా అమ్మావాళ్ళు ఎదురుచూశారు. అల్లుడి రాక కోసం వాళ్ళ తాపత్రయం తనకి నవ్వు, జాలి పుట్టించాయి. కూతురికి భర్త కాలేని వ్యక్తి అల్లుడా....ఏమో మరి!

ఇంటికి వస్తూనే అడగాలనుకున్నది. “కనీసం పెళ్ళి టైముకి రాకూడదా! ” అని-కానీ సుధీర్ ఇంట్లోలేడు. ఇల్లు ఒక పెద్ద జైలులా తోచిందామెకు.

ఇంతలో ఫోన్ మోగింది. విసుగ్గా తీసింది వసంత. ఆమె మొహంలో చిరాకు ఎక్కువయింది.

“మీరా....ఆ....నేనే మాట్లాడుతున్నాను....ఏమిటి... రేపు వస్తారా సరే” ఫోన్ పెట్టేసింది.

ఎక్కువ టైము తనని తప్పించుకొని బయట తిరగ టానికి అలవాటుపడుతున్నాడతను. అతని బలహీనత ఎవరు గుర్తిస్తారోననే భయం కూడా ఎక్కువైంది. క్రమేణా ఈ మధ్య తాగటం కూడా ఎక్కువయింది. కనీసం తన ఆరోగ్యం కూడా సరిగా ఉంచుకోవటం ఇష్టం లేదా? రోజులో కొంచెంసేపైనా ఇంటికి రావటం తమ మొదటి రాత్రి ఒప్పందం వల్లనే!

ఆమె బట్టలు కూడా మార్చుకోకుండా మంచం మీద వాలిపోయింది. మళ్ళీ అదే వాతావరణం ఆమె మనస్సులో నిరాశను పెంచేస్తున్నది. పెళ్ళిలో తాను చూసిన అన్నా వదినల సరసాలు, పెళ్ళికొడుకు పెళ్ళికూతురుల సరదాలు ఆమెలో ఎన్నో క్రొత్త క్రొత్త ఆలోచనలను రేకెత్తిస్తున్నాయి. తనకీ రాత ఎందుకు పట్టింది! తన గురించి తిన్నదీ లేనిదీ ఎవరికక్కర్లేదు. తను అసలు ఎవరికోసం బ్రతికుంది? ఆ రాత్రి అన్ని ఆశలూ చంపుకుని నిస్తేజంగా గదిలో కూర్చుంటే అతను వచ్చాడు. అత్తగారికిచ్చిన మాట ప్రకారం అతనితో స్నేహంగా ఉందామని అన్పించిందామెకు.

అతను గంభీరంగా అన్నాడు "నువ్వు చదువుకున్న దానివి. అందగత్తెవు. నీ కంతా అమ్మ చెప్పివుంటుంది. నేనీ పెళ్ళికి ఇష్టపడలేదు. ఒప్పుకోకపోతే అమ్మ ఉరేసుకుంటానంది. నీకు రావాలంటే డైవోర్సు...." "ఆపండి" కోపంగా అంది వసంత. ఆమె శరీరం అంతా కోపంతో సెగలు కమ్ముతున్నట్లే ఉంది.

"మీరు చేసుకొని....మళ్ళీ డైవోర్సు ఇవ్వటానికి నేనేం మట్టిబొమ్మనా .... ఒక నిండు జీవితంతో ఇలా ఆడుకునే మీరు మనుషులు కాదు, రాక్షసులు. డైవోర్సు తీసుకున్న ఆడదాన్ని మళ్ళీ ఏ మొగాడైనా మన పవిత్ర భారతదేశంలో పెళ్ళి చేసుకుంటాడా? కనీసం మొగతనం లేని మీలాంటి వాడైనా...."

" నో ర్మ యే .... " సుధీర్ కోపాన్ని కొంత నిగ్రహించుకున్నాడు. " సమాజంలో నాకు సరియైన స్థానం కోసం నేనీ పని చేయకతప్పలేదు. నీకెంత డబ్బు కావాలన్నా తీసుకో. నీకు నచ్చిన వాడిని చేసుకో. ఈ విషయం మాత్రం మనమధ్యనే ఉండాలి "

" అవును పాపం. మీరు చేసిన ద్రోహం లోకానికి తెలియ కూడదు. ఒక భర్తని వదిలేసి మరో భర్తతో లేచి పోయినదానిగా నేనే కనపడాలి .... నా తప్పులేకపోయినా ఈ పెళ్ళి చేసుకున్న నేరానికి నేననుభవిస్తున్నాను " రోషావేశాలతో అంది వసంత.

" నువ్వేమనుకున్నా నీ యిష్టం. నేను చెప్పదలుచు కుంది చెప్పాను " ప్రక్కరూములోకి దారితీశాడు సుధీర్.

" ఒక మాట " పిల్చింది వసంత. అతను ఆగి పోయాడు.

" మీరు మాత్రం ఈ ఇంటి బాధ్యత పట్టనట్టు తిరగ కూడదు. సమాజంలో మీ భార్యగా నాకు స్థానం ఉండాలి అన్ని విషయాలలో. ఒక్క విషయంలో నేను ఎటూ మాట్లాడలేను " మొండిగా అంది వసంత.

" సరే! " అని నిట్టూర్చి వెళ్ళిపోయాడు సుధీర్.

ఆ రాత్రి వసంత దిండు కన్నీటితో తడిసి ముద్దయి పోయింది. పుట్టింటివారికి సుధీర్ వలన జరగబోయే ధన

సహాయం ఆలోచించిన వసంత అంతకంటే ఇంకేమీ చేయ లేకపోయింది అప్పట్లో.

చేదు జ్ఞాపకాలతో వసంత మనసు విలవిలలాడు తోంది. తనేం నేరం చేసిందని తనకీ జైలు. మగవాడిలో లోపం కప్పిపుచ్చటానికి, అతనికి సమాజంలో సరియైన స్థానంకోసం ఒక స్త్రీ జీవితం బలికావలసిందేనా! తను చదువు కుంది. తన కాళ్ళ మీద తాను నిలబడగలదు. ఈ చేయని తప్పుకు శిక్ష ఇలా అనుభవించవలసిందేనా! అందరు ఆడవాళ్ళకు లభ్యమయే మాతృత్వం అనేది తనకి అలభ్యం! ఆలోచనల మధ్య మరిగిన ఆ రాత్రి ఉషోదయం అవుతూనే వసంత చేతిలో సూటికేస్ అచంచలమైన ఆత్మ విశ్వాసంతో, భవిష్యత్తుపై కమ్మటి కలలు గుండెల్లో నింపు కొని ఆ ఇంటి మెట్లు దిగుతూ ముందుకు సూటిగా చూస్తూ కన్పించింది. ●

( ' వనితా జ్యోతి ' మాస పత్రిక )

* సమాప్తం *